SOURACHANDRAJYOTHISHA

SRI VILAMBI 2018 - 19

# ALMANAC



2018 2019

# సౌరచంద్రజ్యోతిష

## శ్రీ విళంబి నామసంవత్సర

# గంటల పంచాంగము

పంచాంగకర్త

**సౌరచంద్రజ్యోతిష్**

ఉగాది ప్రచురణలు - ఆకివీడు

THE FUTURE MIRROR

# శ్రీ విళంబి నామ సంవత్సర సౌరచంద్రజ్యోతిష పంచాంగము

## 2018-2019

శ్రీమనోరమా జ్యోతిర్నిలయం

ఉగాది ప్రచురణలు

© ప్రకాశకులు ©
ఉగాది ప్రచురణలు
అజ్జమూరు గరువు, మెయిన్‌రోడ్,
ఆకివీడు - 534 235

వెల : అమూల్యము





## విషయసూచిక

☎ 08816-253589 9493989639

The Best Scientific Astrological Centre

# ఉగాది జ్యోతిష పరిశోధనాకేంద్రము

వారి నూతన సంవత్సర వసంతోదయాభినందనలతో.....



శ్లో॥ విద్యాం విద్యాధిదేవతే ప్రతిష్ఠాం రచనాయాం
కవితాం దేహి సకల కార్యసిద్ధానుగ్రహామ్ !
వినయం దేహి విజయం దేహి శక్తిం శిష్యప్రభోధికామ్ !!



పంచాంగ కర్త:

## సౌరచంద్రజ్యోతిష్

(ఆకివీడు) వారిచే గుణించబడినది.







## పంచాంగమునందలి అక్షరసంజ్ఞలు

| | | | |
|---|---|---|---|
| ర॥ | = రవి | వ.మ॥ | = మధ్యాహ్న వర్జ్యము |
| చం॥ | = చంద్ర | వ.సా॥ | = సాయంత్ర వర్జ్యము |
| కు॥ | = కుజ | వ.రా॥ | = రాత్రి వర్జ్యము |
| బు॥ | = బుధ | వ.తె॥ | = తెల్లవారుఝాము వర్జ్యము |
| గు॥ | = గురు | శు.ఉ॥ | = ఉదయ శుభకాలము |
| శు॥ | = శుక్ర | శు.మ॥ | = మధ్యాహ్న శుభకాలము |
| శ॥ | = శని | శు.సా॥ | = సాయంత్ర శుభకాలము |
| రా॥ | = రాహు | శు.రా॥ | = రాత్రి శుభకాలము |
| కే॥ | = కేతు | శు.తె॥ | = తెల్లవారుఝాము శుభకాలము |
| శు॥ | = శుక్లపక్షము | అశ్వి॥ | = అశ్విని |
| బ॥ | = బహుళపక్షము | భ॥ | = భరణి |
| ర॥ | = రహితము | కృ॥ | = కృత్తిక |
| మతాం॥ | = మతాంతరము | రో॥ | = రోహిణి |
| దిన॥ | = దినప్రమాణము | మృ॥ | = మృగశిర |
| దు॥ | = దుర్ముహూర్తము | ఆ॥ | = ఆరుద్ర |
| వ॥ | = వర్జ్యము | పున॥ | = పునర్వసు |
| శు॥ | = శుభము | పు॥ | = పుష్యమి |
| ఉ॥ | = ఉదయము | ఆశ్లే॥ | = ఆశ్లేష |
| ప॥ | = పగలు | మ॥ | = మఖ |
| మ॥ | = మధ్యాహ్నము | పూ.ఫ॥ | = పూర్వఫల్గుణి (పుబ్బ) |
| సా॥ | = సాయంత్రము | ఉ.ఫ॥ | = ఉత్తరఫల్గుణి (ఉత్తర) |
| రా॥ | = రాత్రి | హ॥ | = హస్త |
| తె॥ | = తెల్లవారుఝాము | చి॥ | = చిత్త |
| ల॥ | = లగాయతు (నుండి) | స్వా॥ | = స్వాతి |
| వ॥ | = వఱకు | వి॥ | = విశాఖ |
| పు॥ | = పునర్ (మరల) | అను॥ | = అనురాధ |
| భు॥ | = భుక్తి | జ్యే॥ | = జ్యేష్ఠ |
| సూ.ఉ॥ | = సూర్యోదయము | మూ॥ | = మూల |
| సూ.అ॥ | = సూర్యాస్తమయము | పూ.షా॥ | = పూర్వాషాఢ |
| వక్ర॥ | = వక్రగతి (వెనుకకు) | ఉ.షా॥ | = ఉత్తరాషాఢ |
| ఋజు॥ | = ఋజుగతి (ముందుకు) | శ్ర॥ | = శ్రవణము |
| దు.ఉ.॥ | = ఉదయ దుర్ముహూర్తము | ధ॥ | = ధనిష్ఠ |
| దు.మ॥ | = మధ్యాహ్న దుర్ముహూర్తము | శ॥ | = శతభిషము |
| దు.సా॥ | = సాయంత్ర దుర్ముహూర్తము | పూ.భా॥ | = పూర్వాభాద్ర |
| దు.రా॥ | = రాత్రి దుర్ముహూర్తము | ఉ.భా॥ | = ఉత్తరాభాద్ర |
| వ.ఉ॥ | = ఉదయ వర్జ్యము | రే॥ | = రేవతి |

# పంచాంగ గణిత వివరణ

వర్తమానమున పంచాంగ గణిత పద్ధతులను 4 రకాలుగా విభజించ వచ్చు. అవి: 1)సూర్య సిద్ధాంత ప్రోక్త గణిత పద్ధతి. 2)సూర్యసిద్ధాంత ప్రోక్త గణితము-గ్రంథభేద పద్ధతి. 3)దృక్ గణిత పద్ధతి. 4)దృక్ గణితము-అయనాంశభేద పద్ధతి.

ఇందు 1వ గణిత పద్ధతి ప్రకారము పంచాంగములు గుణిస్తే అందరికి ఒకే రకమైన తిథ్యాదులు వస్తాయి. 2వ గణిత పద్ధతి ప్రకారము పంచాంగములు గుణిస్తే...సూర్యసిద్ధాంత ప్రోక్త గణిత పద్ధతికి వివిధ గ్రంథములలో వివిధ రకాలుగా బీజ సంస్కారములు చెప్పబడుటచే ఆయా గ్రంథములచే పంచాంగములు గుణించుట వలన అందరికి ఒకే రకమైన తిథ్యాది సమయములు రావు. 1వ-2వ పద్ధతులను ఒకదానికొకటి పోల్చి చూస్తే పంచాంగ గణితములు మరింత విభేదించును. ఈ రెండు గణిత పద్ధతులు నిరాయన గణితములే. అనగా అయనాంశములకు అంతగా ప్రాముఖ్యత లేదు. ఈ రెండు పద్ధతులద్వారా చేయు పంచాంగ గణితములు వర్తమానమున పూర్తిగా ప్రత్యక్ష ప్రమాణములు కావు. ఈ రెండు గణిత పద్ధతులద్వారా రాబడిన సూర్యచంద్రాదుల గ్రహణ సమయములకు, ప్రత్యక్ష గ్రహణ సమయములకు వ్యత్యాసములు వచ్చును. ఈ రెండు పద్ధతులలో వచ్చిన కరణ గ్రంథములు, పంచాంగ గణితము సులభముగా చేయుటకు దోహదపడుచున్నవి. అందుకే సులభ గణితమునకు అలవాటుపడి, పూర్వోక్త గణిత విధానములో తిథ్యాదులను గుణించు సిద్ధాంతులు సూర్యచంద్ర గ్రహణములను మాత్రము దృక్ గణితము ద్వారా గ్రహిస్తున్నారు. పూర్వోక్త గణిత పద్ధతిలో వ్రాయబడిన... సామంత చంద్రశేఖర సింహుని **"సిద్ధాంతదర్పణము"** మరియు గణేశ దైవజ్ఞుని **"గ్రహలాఘవ కరణము"** అను గ్రంథములు ఈనాటి దృగ్గణితమునకు ఎంతోకొంత సామీప్యముగా ఉంటున్నవి.

3వ గణితపద్ధతి అయిన దృగ్గణితము సాయనపద్ధతిలో ఉండి పంచాంగకర్తలందరూ ఒకే రకమైన అయనాంశమును తీసివేయుట వలన అందరూ ఒకే విధమైన తిథ్యాది సమయములను పొందగలరు. 4వ గణిత పద్ధతి నందు ఎవరికివారు వేరు వేరు అయనాంశములను తీసుకోవడం వలన తిథులు-కరణములు మరియు సూర్యచంద్ర గ్రహణ సమయములు





మాత్రమే ఏకీభవించును. మిగిలిన నక్షత్ర-యోగ-గ్రహ-వర్జ్యాది సమయములు విభేదించును. ఈ రెండు గణిత పద్ధతులు ప్రత్యక్ష ప్రమాణములకు సరిపోవును. అయితే ఖచ్చితమైన అయనాంశ విషయములో ఇప్పటి వరకు పండితుల మధ్య ఏకాభిప్రాయము లేదు. నిజానికి ఖచ్చితమైన అయనాంశ బ్రహ్మదేవునికి తప్ప అన్యులకు అసాధ్యమయినది. అయన గతిలో కూడా భిన్నాభిప్రాయములు వ్యక్తమగుచున్నవి. ఎవరికి వారు, వారి వారి వ్యక్తిగత పరిశోధనతోను మరియు జాతకాదుల ఫలితానుభవముచే అయనాంశములను సుమారుగా నిర్ణయించెదరు. ఈ అయనాంశముల తారతమ్యముచే దృగ్గణితపద్ధతిలో కూడా పంచాంగ గణితములందు తేడాలు వచ్చును.

కొందరు పంచాంగ కర్తలు తిథ్యాదులతో పాటు గ్రహగణితములను కూడా పూర్వపద్ధతిలోనే వ్రాయుదురు. మరి కొందరు తిథ్యాదులను పూర్వపద్ధతిలోను, గ్రహగణితములను దృక్పద్ధతి నందు వ్రాయుదురు. కొందరు సూర్యసిద్ధాంత ప్రోక్త అయనాంశములను ఉపయోగించి దృక్పద్ధతి నందు పంచాంగ రచన చేయుదురు. ఈ విధానములో రవ్యాది నవగ్రహములందు అయనాంశ సామ్యము ఉండునని మనందరికి తెలిసిన విషయమే. ఇంకొందరు సూర్యసిద్ధాంత ప్రోక్త గణితముచే మొత్తము పంచాంగము చేయుదురు. ఈ విధానము నందు నవగ్రహములందు ఒకే రకమైన అయనాంశ రాదు.

కొసమెరుపు ఏమిటంటే.....మా గణితము గొప్పదంటే, మా గణితము గొప్పదని గొప్పలు చెప్పుకునే వారందరూ గ్రహణములను మాత్రము దృక్ గణితములో వ్రాయుదురు. ఎందుకంటే ఇవియే ప్రత్యక్షములు.

ఈ పంచాంగము **"ఖగోళ దృగ్గణిత తంత్రమ్"**(అముద్రితము) గ్రంథమును అనుసరించి వ్రాయబడినది. ఇందు చూపబడిన తిథులు, నక్షత్రములు, రవ్యాది నవగ్రహములు, గ్రహణములు ప్రత్యక్ష ప్రమాణములుగా భాసిల్లును. 17°-00' ఉత్తర అక్షాంశము, 81°-48' తూర్పు రేఖాంశముల మధ్యప్రాంతమైన రాజమహేంద్ర పట్టణమునకు గణన చేయబడిన కర్మార్హమైన పంచాంగమిది. తెలుగు రాష్ట్రాల్లో ఉపయుక్తమైనది!

**ఇందలి తిథి-నక్షత్ర-యోగ-కరణములకు అంత్యకాలములను, శుభ-వర్జ్య-దుర్ముహూర్తములకు ప్రారంభాంత్యవేళలను చూపబడినవి. దిన ప్రమాణములను మరియు సూర్యభుక్తులను గంటలలో గ్రహించవలెను. గోచార ఫలములు అనుభవమునకు సరిపడునట్లు వ్రాయడమైనది.**

## విజ్ఞప్తి

ఈ పంచాంగము ఎటువంటి ఎఫిమెరిస్‌ల నుండి వ్రాయబడలేదు. అహర్గణమును సాధించి... తద్వారా అహర్గణజనిత సాయన గ్రహములను, తద్వారా సాయన మధ్య గ్రహములను, తద్వారా సాయన స్ఫుట గ్రహములను గుణించి, వాటినుండి అయనాంశములను తీసివేసి పంచాంగము వ్రాయడమైనది. సూర్యునికి ఒక మందఫల సంస్కారము,చంద్రునికి మందఫల సంస్కారముతో పాటు దశాధిక సంస్కారములను,కుజాది పంచ తారా గ్రహములకు చర-మంద-శీఘ్ర త్రిఫల సంస్కారములను, ఛాయా గ్రహములైన రాహు-కేతువులకు మధ్యమ సంస్కారములను చేయడమైనది. ఇందలి స్ఫుట సూర్య-చంద్రులచే గ్రహణములను గుణించడమైనది.

**శాలివాహనశక : ౧౯౪౦ శ్రీ విళంబి** నామ సంవత్సర ప్రారంభమునకు...అనగా ది.**18-03-2018** ఆదివారము ఉదయం గం॥**5-30**ని॥ {IST}లకు**"ఖగోళ దృగ్గణిత తంత్రమ్"** (అముద్రితం) గ్రంథముద్వారా రాబడిన **స్వదేశ సాయన మధ్యగ్రహములు :**

**అహర్గణము = 5110**

| | | | |
|---|---|---|---|
| 1. రవి | = **355°-30'- 41"** | 6. గురు | = **227°-16'- 33"** |
| 2. చంద్ర | = **7° -57'- 59"** | 7. శుక్ర | = **37°-03'- 10"** |
| 3.చంద్రోచ్చ | = **284°-11'- 57"** | 8. శని | = **272°-46'- 58"** |
| 4. కుజ | = **240°-46'- 20"** | 9. రాహు | = **132°-52'- 47"** |
| 5. బుధ | = **108°-40'- 17"** | 10. కేతు | = **312°-52'- 47"** |

**శ్రీ విళంబి నామ సంవత్సర ప్రమాణము = 384 రోజులు**

### రాజమండ్రికి లగ్నప్రమాణ-పుష్కర కాలములు

| లగ్నము | ప్రమాణము గం॥ - ని॥లు | పుష్కరము గం॥ - ని॥లు | లగ్నము | ప్రమాణము గం॥ - ని॥లు | పుష్కరము గం॥ - ని॥లు |
|---|---|---|---|---|---|
| మేషము | 1 - 46 | 1 - 14 | తుల | 2 - 10 | 1 - 44 |
| వృషభము | 2 - 01 | 0 - 56 | వృశ్చికము | 2 - 13 | 0 - 31 |
| మిథునము | 2 - 12 | 1 - 46 | ధనుస్సు | 2 - 06 | 1 - 28 |
| కర్కాటకము | 2 - 12 | 0 - 31 | మకరము | 1 - 51 | 0 - 52 |
| సింహము | 2 - 07 | 1 - 29 | కుంభము | 1 - 39 | 1 - 19 |
| కన్య | 2 - 06 | 0 - 59 | మీనము | 1 - 37 | 0 - 23 |

**స్వానుభవ అయనాంశ : 24°– 13'– 35"**

**వార్షికాయనగతి : 00° – 00' – 50.4"**







## ముందుమాట

పంచాంగ ప్రియులకు శ్రీ "విళంబి" నామ సంవత్సర శుభాకాంక్షలు!

**జ్యోతిష శాస్త్ర ప్రియులారా !**

గత సంవత్సరము పంచాంగములందు, తెలుగు సంవత్సరము పేరును "హేవిళంబి" "హేవళంబి" "హేమలంబి" "హేమలంబ"అని పంచాంగకర్తలు బహువిధములుగా వ్రాయడముతో ప్రజలు అయోమయమునకు గురి అయ్యిరి. ఇందు "హేవిళంబి" అనేది అనాదిగా వ్రాయబడుతున్నది! నేను, శ్రీ ములుగు రామలింగేశ్వర వరప్రసాదు సిద్ధాంతి గారు "హేవిళంబి" అనే వ్రాయడము జరిగింది. కొంతమంది తెలుగు సంవత్సరాల పేర్లుకు అర్థాలు వెదుకుట మొదలుపెట్టి, "హేవిళంబి" అను నామమునకు అర్థం లేదనే ఉద్దేశ్యముతో సంవత్సరనామములను మార్చి వ్రాయడము జరిగినది! నిజానికి "ప్రభవ-విభవ" "భావ-యువ" "చిత్రభాను-స్వభాను" "సర్వజిత్-సర్వధారి" "విరోధి-వికృతి" "విజయ- జయ" "వికారి-శార్వరి" అనుప్రాసగా సంవత్సర నామములను ఏర్పరచిన పద్ధతిలోనే "హేవిళంబి-విళంబి" నామ సంవత్సరములను మహర్షులు నిర్ణయించిరి! ఇదే విషయాన్ని వక్కాణిస్తూ, సంస్కృతభాషాకోవిదులైన శ్రీ కేశప్రగడ సత్యనారాయణ గారు మరియు శ్రీ ధూళిపాళ మహాదేవమణి వంటివారు "హేవిళంబి" అని వ్రాయడమే సరయైనదని చెప్పారు! ఈ విషయాన్ని డెక్కన్‌క్రానికల్ లో ప్రచురించిరి.

హేవిళంబి

హేవిళంబి : శబ్దరత్నాకరము (బహుజనపల్లి సీతారామాచార్యులు) 1912

సం. వి. స్. పుం.

- ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము)

హేవిళంబి : బ్రౌణ్య తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు 1903

hē-viḷambi

[Skt.] n.

- The name of a Telugu year.

హేవిళంబి : శ్రీహరి నిఘంటువు తెలుగు-తెలుగు (రవ్వా శ్రీహరి) 2004

వి.

- ఒక సంవత్సరము పేరు (ముప్ఫై ఒకటవది)

హేవిళంబి : శంకరనారాయణ తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు 1953

n.

- N. of the 31st year of the Hindu cycle of sixty.

హేవిళంబి : తెలుగు నిఘంటువు తెలుగు-తెలుగు (జి.ఎన్.రెడ్డి-ఆం.ప్ర.సా.అ.) 1979

సంస్కృత విశేష్యము

- అరువది సంవత్సరములలో నొకటి.

అనాదిగా వస్తున్న నిఘంటువులలో కూడా "హేవిళంబి" అనే తప్ప మరొకవిధముగా వ్రాయలేదంటే అతిశయోక్తి కాదు! ఈ విషయాన్ని మీరు కూడా ఈ ప్రక్క నేనిచ్చిన సమాచారములో గమనించగలరు!!

గత సంవత్సరము "హేవిళంబి" అగుటవలన ఈ సంవత్సరము "విళంబి" నామ సంవత్సరము అయ్యింది! గత సంవత్సరము "హేవళంబి" అని వ్రాసినవారు ఈ సంవత్సరము "వళంబి" అని, "హేమలంబ" అని వ్రాసినవారు "విలంబ" అని, "హేమలంబి" అని వ్రాసినవారు "విలంబి" అని వ్రాస్తారేమోనని నా భయం! వేచి చూడాలి మరి!!

ఆయా రోజులలో ఆయా గ్రహ ప్రార్ధనలు శుభమును కలిగించును.



శ్రీరస్తు ! శుభమస్తు !! అవిఘ్నమస్తు !!!




**"ఓం శ్రీ మహాగణపతియే నమ:"**
**"ఓం శ్రీ హనుమతే నమ:"**



శ్లో॥ శుక్లాం బరధరం విష్ణుం ! శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వ విఘ్నోప శాంతయే॥
శ్లో॥ శ్రీ ముకుందం సదానందం గోవిందం భక్త కామదం॥
తమహం వరదం వందే మనోభీష్టార్థ సిద్ధయే॥
శ్లో॥ ఓం శ్రీం ఆదిత్యాయచ సోమాయ మంగళాయ।
బుధాయచ గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః॥



## నవగ్రహ ధ్యాన శ్లోకములు



రవి 1 జపాకుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిమ్ ।
తమోరిం సర్వపాపఘ్నం ప్రణతోస్మి దివాకరమ్ ॥ 6 వేలు

చంద్ర 2 దధి శంఖ తుషారాభం క్షీరోదార్ణవ సముద్భవమ్ ।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్ ॥ 10 వేలు

కుజ 3 ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్ ।
కుమారం శక్తిహస్తం తం మంగళం ప్రణమామ్యహమ్ ॥ 7 వేలు

బుధ 4 ప్రియంగు కలికా శ్యామరూపేణా ప్రతిమం బుధమ్ ।
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్ ॥17వేలు

గురు 5 దేవానాంచ ఋషీనాంచ గురుకాంచన సన్నిభమ్ ।
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ ॥ 16 వేలు

శుక్ర 6 హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమగురుమ్ ।
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్ ॥ 20 వేలు

శని 7 నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్ ।
ఛాయమార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్ ॥ 19 వేలు

రాహు 8 అర్ధకాయం మహావీరం చంద్రాదిత్య విమర్ధనమ్ ।
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్ ॥18వేలు

కేతు 9 ఫలాశపుష్ప సంకాశం తారకాగ్రహ మస్తకమ్ ।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్ ॥7వేలు



నిత్యము ఆంజనేయస్వామి నామస్మరణ కార్యసిద్ధి కలిగించును.





### గణేశస్తుతి

శ్లో॥ అగజానన పద్మార్కం గజాననమహర్నిశం ।
అనేకదం తం భక్తానాం ఏకదంత ముపాస్మహే ॥

### ఆంజనేయస్తుతి



శ్లో॥ ఆంజనేయ మతిపాటలాలనం కాంచనాద్రి కమనీయవిగ్రహమ్ ।
పారిజాత తరుమూల వాసినం భావయామి పవమాననందనమ్॥
యత్ర యత్ర రఘునాధకీర్తనం, తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతింనమత రాక్షసాంతకమ్ ॥

### సరస్వతిస్తుతి



శ్లో॥ సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥

### ఈశ్వరస్తుతి



శ్లో॥ ధర్మార్ధ కామ మోక్ష ప్రదాయకం లోకనాయకం ।
విశ్వవాఙ్మయ విభూతిం వందే సాంబశివం సదా ॥

### లక్ష్మీస్తుతి



శ్లో॥ పద్మప్రియే, పద్మినీపద్మహస్తే, పద్మాలయే పద్మదళాయతాక్షి ।
విష్ణుప్రియే విశ్వమనోనుకూలే, తత్పాదపద్మం మయి సన్నిధత్స్వ॥

### అర్ధనారీశ్వరస్తుతి



శ్లో॥ ప్రదీప్త రత్నోజ్వల కుండలాయై స్ఫురన్మహాపన్నగ భూషణాయ ।
శివప్రియాయైచ శివాప్రియాయ నమశ్శివాయైచ నమశ్శివాయ ॥

### గురుస్తుతి



శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురువే నమ: ॥

### మేధా దక్షిణామూర్తిస్తుతి



శ్లో॥ గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తియే నమ: ॥

### శ్యామలాస్తుతి

శ్లో॥ మాణిక్యవీణాముపలాలయంతీం మదాలసాంమంజులవాగ్విలాసామ్ ।
మహేంద్రనీలద్యుతి కోమలాంగీం మాతంగికన్యాం మనసాస్మరామి ॥



### సర్వదేవతా ప్రార్ధన



విశ్వంత్వదీయం హృదయంత్వదీయం మదీయమేకం తవపాదపద్మమ్
త్వమేవమాతా చ పితాత్వమేవ త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

### మహామృత్యుంజయ మంత్రము



ఓమ్త్ర్యమ్బకమ్ యజామహే సుగన్ధిమ్ పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుక మివబన్ధనాన్ మృత్యోర్ముక్షియమామృతాత్ ॥
(నిత్య జపమువలన సర్వప్రమాద నివారణయగును. ఆయుర్వృద్ధి కలుగును.)

# దేశాంతర సంస్కార పట్టిక

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| భీమవరం | +01 | తిరుపతి | +09 | కర్నూలు | +15 | రాజమండ్రి | 00 |
| తాడేపల్లిగూడెం | +01 | సూర్యాపేట | +09 | మహబూబ్‌నగర్ | +15 | అమలాపురం | -01 |
| ఏలూరు | +02 | గోదావరిఖని | +09 | నిజామాబాద్ | +15 | కాకినాడ | -02 |
| మచిలీపట్నం | +02 | పెద్దపల్లి | +09 | గుత్తి | +16 | అనకాపల్లి | -05 |
| గుడివాడ | +03 | మంచిర్యాల | +09 | డోన్ | +16 | విశాఖపట్నం | -06 |
| లక్నో | +03 | కరీంనగర్ | +10 | గద్వాల్ | +16 | విజయనగరం | -06 |
| భద్రాచలం | +03 | జనగాం | +10 | అనంతపురం | +17 | బొబ్బిలి | -06 |
| విజయవాడ | +04 | కామారెడ్డి | +10 | బళ్ళారి | +17 | పార్వతీపురం | -07 |
| తెనాలి | +04 | చిత్తూరు | +11 | బెంగుళూరు | +17 | శ్రీకాకుళం | -08 |
| చర్ల | +04 | శ్రీశైలము | +11 | భోపాల్ | +17 | గంజాము | -10 |
| బాపట్ల | +05 | నల్గొండ | +11 | ఢిల్లీ | +18 | పాట్నా | -14 |
| గుంటూరు | +05 | జగిత్యాల | +11 | సిమ్లా | +18 | భువనేశ్వర్ | -16 |
| చీరాల | +05 | కడప | +12 | చండీఘర్ | +19 | బరంపురం | -16 |
| కొత్తగూడెం | +05 | నంద్యాల | +12 | త్రివేండ్రం | +19 | గాంగ్‌టక్ | -27 |
| ఒంగోలు | +06 | రామేశ్వరము | +12 | మైసూర్ | +22 | కలకత్తా | -27 |
| చెన్నై | +06 | మదనపల్లి | +13 | జైపూర్ | +24 | అగర్తల | -38 |
| ఖమ్మం | +06 | ప్రొద్దుటూరు | +13 | ఉజ్జయిని | +24 | షిల్లాంగ్ | -40 |
| నర్సారావుపేట | +07 | హైదరాబాద్ | +13 | జమ్ము | +27 | ఐజాల్ | -45 |
| నెల్లూరు | +07 | ఆదిలాబాద్ | +13 | ముంబాయి | +36 | కోహిమా | -49 |
| గూడూరు | +07 | కదిరి | +14 | గాంధీనగర్ | +36 | ఇంఫాల్ | -49 |
| శ్రీ కాళహస్తి | +08 | మెదక్ | +14 | జయపురం | +58 | రంగూన్ | -54 |
| వరంగల్ | +08 | తాడిపత్రి | +15 | నర్సాపురం | 00 | ఇటానగర్ | -67 |

**సూచన :** **ఈ పంచాంగములోని సూర్యోదయ,సూర్యాస్తమయ, దుర్ముహూర్త,లగ్న సమయములను పైనపేర్కొన్న ప్రాంతములవారు ఆయా గుర్తులు ధన(+) లేక ఋణ (-) ప్రకారము, తిథి-నక్షత్ర-గ్రహ-గ్రహణ-వర్జ్య-శుభ కాలములందు గుర్తునకు వ్యతిరేకముగాను సంస్కరించుకోవలెను.**







# వృషభ - కలశ చక్రశుద్ధులు

(గృహారంభ - ప్రవేశములకు ఉపయోగము)

| వృషభచక్రము | | కలశచక్రము | |
|---|---|---|---|
| 3 మరణము | 18 ధనము | 1 మరణము | 17 దరిద్రము |
| 7 దరిద్రము | 22 ధాన్యము | 5 ప్రవాసము | 21 సంతానపీడ |
| 11 ధైర్యము | 25 సంపద | 9 ధైర్యము | 24 సిరి-సంపద |
| 14 సంచారము | 28 పాడిపంటలు | 13 ధాన్యము | 27 ఆయుష్యము |

**సూచన :** రవి సంచార నక్షత్రము లగాయతు ముహూర్త నక్షత్రము వరకు లెక్క చూచుకోవలెను. వృషభచక్రమందు అభిజిత్తు నక్షత్రమును కూడా లెక్కించవలెను. గృహారంభ-ప్రవేశములకు **వృషభచక్రము**, గృహప్రవేశ మునకు **కలశచక్రము** తప్పక శుద్ధిగా ఉండవలెను.

## వివాహచక్రశుద్ధి

| | | |
|---|---|---|
| 3 మరణము | 12 వైధవ్యము | 21 వ్యభిచారము |
| 6 శుభము | 15 కులవృద్ధి | 24 ధాన్యము |
| 9 నిస్సంతానము | 18 ఋణము | 27 సంపద |

**సూచన :** రవి సంచార నక్షత్రము నుండి ముహూర్త నక్షత్రము వరకు లెక్క చూడవలెను.

ఉదా॥ : సూర్యుడు కృత్తికలో ఉన్నప్పుడు, కృత్తిక మొదలు 3 నక్షత్రములు మరణమును కలుగచేయును. తదుపరి 3 (6వరకు) శుభము.

## పంచకరహితము

ముహూర్త సమయమందలి తిథి,వార,నక్షత్ర,లగ్నసంఖ్యలను కలుపగా వచ్చిన మొత్తము 9చే భాగించగా 3,5,7,9 సంఖ్యలు శేషముగా మిగిలినచో ఆ ముహూర్తము పంచక రహితమైనదిగా గుర్తించవలెను. మిగిలిన 1,2,4, 6,8 సంఖ్యలు దుష్ట ఫలములను కలుగచేయును. వీటిని 1మృత్యు, 2 అగ్ని, 4రాజ, 6చోర, 8రోగ పంచకములుగా తెలియవలెను.

ఆదివారము-రోగపంచకము, సోమవారము-రాజపంచకము, మంగళ వారము-చోరాగ్నిపంచకము, బుధవారము-మృత్యు పంచకములు అసలు పనికిరావు. అధికార దర్శనమునకు-రాజపంచకము, గృహప్రవేశము నకు-చోరాగ్నిపంచకము, ప్రయాణమునకు-చోర,మృత్యు పంచకములు, వివాహాది శుభకార్యములకు-మృత్యు పంచకములను విసర్జించవలెను.

# నామ-నక్షత్ర-రాశి-గణ పొంతనములు

| నామాద్యక్షరము | | | | నక్షత్రపాదములకు రాశులు | గణము | జంతువు | నాడి |
|---|---|---|---|---|---|---|---|
| చూ | చే | చో | ల | అశ్విని 4 మేషము | దేవ | గుఱ్ఱము | ఆది |
| లీ | లూ | లే | లో | భరణి 4 మేషము | మనుష్య | ఏనుగు | మధ్య |
| ఆ | ఈ | ఊ | ఏ | కృత్తిక 1 మేషము, 3వృషభం | రాక్షస | మేక | అంత్య |
| ఓ | వా | వీ | వు | రోహిణి 4 వృషభం | మనుష్య | పాము | అంత్య |
| వే | వో | కా | కి | మృగశిర 2 వృష, 2 మిధునం | దేవ | పాము | మధ్య |
| కూ | ఖం | జ్ఞ | చ్ఛ | ఆరుద్ర 4 మిధునము | మనుష్య | కుక్క | ఆది |
| కే | కో | హా | హీ | పునర్వసు 3 మిధు,1కర్కాటక | దేవ | పిల్లి | ఆది |
| హూ | హే | హొ | డా | పుష్యమి 4 కర్కాటకము | దేవ | మేక | మధ్య |
| డీ | డూ | డే | డో | ఆశ్లేష 4 కర్కాటకము | రాక్షస | పిల్లి | అంత్య |
| మా | మీ | మూ | మే | మఖ 4 సింహము | రాక్షస | ఎలుక | అంత్య |
| మో | టా | టీ | టూ | పుబ్బ 4 సింహము | మనుష్య | ఎలుక | మధ్య |
| టే | టో | పా | పి | ఉత్తర 1 సింహము, 3 కన్య | మనుష్య | గోవు | ఆది |
| పూ | షం | ణా | ఠా | హస్త 4 కన్య | దేవ | దున్న | ఆది |
| పే | పో | రా | రి | చిత్త 2 కన్య, 2 తుల | రాక్షస | పులి | మధ్య |
| రూ | రే | రో | త | స్వాతి 4 తుల | దేవ | దున్న | అంత్య |
| తీ | తూ | తే | తో | విశాఖ 3 తుల, 1 వృశ్చికము | రాక్షస | పులి | అంత్య |
| నా | నీ | నూ | నే | అనురాధ 4 వృశ్చికము | దేవ | లేడి | మధ్య |
| నో | యా | యీ | యు | జ్యేష్ఠ 4 వృశ్చికము | రాక్షస | లేడి | ఆది |
| యే | యో | బా | బి | మూల 4 ధనుస్సు | రాక్షస | కుక్క | ఆది |
| బూ | ధా | భా | ఢా | పూర్వాషాఢ 4 ధనుస్సు | మనుష్య | కోతి | మధ్య |
| బే | బో | జా | జి | ఉత్తరాషాఢ1ధను, 3మకరం | మనుష్య | ముంగిస | అంత్య |
| ఖ | ఖా | ఖే | ఖో | అభిజిత్ మకరము | మనుష్య | ముంగిస | ... |
| జూ | జే | జో | ఖా | శ్రవణం 4 మకరము | దేవ | కోతి | అంత్య |
| గా | గీ | గూ | గే | ధనిష్ఠ 2మకరం,2కుంభము | రాక్షస | సింహం | మధ్య |
| గో | సా | సీ | సు | శతభిషము 4 కుంభము | రాక్షస | గుఱ్ఱము | ఆది |
| సే | సో | దా | ది | పూర్వాభాద్ర 3కుంభం,1 మీనం | మనుష్య | సింహం | ఆది |
| దు | శ | ఝా | థా | ఉత్తరాభాద్ర 4 మీనము | మనుష్య | గోవు | మధ్య |
| దే | దో | చా | చి | రేవతి 4 మీనము | దేవ | ఏనుగు | అంత్య |

**విరోధ జంతువులు :** గుఱ్ఱము-దున్న, ఆవు-పులి, ఏనుగు-సింహము, పాము-ముంగిస, కోతి-మేక, పిల్లి-ఎలుక, లేడి-కుక్క పరస్పర విరోధ జంతువులు. కావున దంపతుల నక్షత్రములు పరస్పర విరోధ జంతువుల లో పడరాదు. దంపతులకు ఏక గణము శుభము. దేవ-మనుష్య గణములు సామాన్యము. రాక్షస-మనుష్య గణములు మధ్యమము. దేవ-రాక్షస గణము లు అధమము. దంపతులకు ఏక నాడి అశుభము. నాడీ భేదము శుభము.





# ప్రతీరోజూ ఉదయాది గ్రహముల పాలనా సమయములను తెలిపే హెూరాచక్రము

| వారము | కాలము | 6మొదలు 7వరకు | 7మొదలు 8వరకు | 8మొదలు 9వరకు | 9మొదలు 10వరకు | 10మొదలు 11వరకు | 11మొదలు 12వరకు | 12మొదలు 1వరకు | 1మొదలు 2వరకు | 2మొదలు 3వరకు | 3మొదలు 4వరకు | 4మొదలు 5వరకు | 5మొదలు 6వరకు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | పగలు | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| | రాత్రి | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| సోమ | పగలు | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| | రాత్రి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగళ | పగలు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| | రాత్రి | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| బుధ | పగలు | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| | రాత్రి | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | పగలు | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| | రాత్రి | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| శుక్ర | పగలు | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| | రాత్రి | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| శని | పగలు | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| | రాత్రి | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

**సూచన :** పగలు సూర్యోదయము నుండి,రాత్రి సూర్యాస్తమయము నుండి,హెూరా ప్రమాణకాలమును అనుసరించి ఆయాగ్రహ హెూరాకాలములను గ్రహించవలెను. **హెూరాప్రమాణము :** పగటి ప్రమాణమును లేదా రాత్రి ప్రమాణమును 12తో విభజించగా పగలు లేదా రాత్రియొక్క హెూరా ప్రమాణకాలము వచ్చును.

విద్యా-వ్యాపారములకు బుధహోర, మైత్రికి చంద్రహోర, ప్రేమకు శుక్రహోర, సంపదకు గురు



# హోరాకాలములో చేయుపనులు

**1. రవిహోర :** రాజకీయ వ్యవహారములు, అధికారులను కలుసుకొనుట, కాంట్రాక్ట్లు కుదుర్చుకొనుట. సాహసకార్యములకు, ధరఖాస్తులు వ్రాయుటకు, ఉద్యోగ ప్రయత్నములకు, నూతన పార్టీల స్థాపనకు, రవిగ్రహ దోషనివారణకై గోధుమలు దానము ఇచ్చుటకు, కెంపుటుంగరము ధరించుటకు, ప్రమాణ స్వీకారము చేయుటకు, పట్టాభిషేకమునకు, కలప కొనుగోలుకు మంచిది.

**2. చంద్రహోర :** రత్నాలవ్యాపారమునకు, జలసంబంధిత వ్యవహారములకు, స్త్రీలను కలుసుకొనుటకు, వెండివస్తువులను ఉపయోగించుటకు, పెద్దలను దర్శించుటకు, విందు-విలాసములలో పాల్గొనుటకు, వనవిహారములు చేయుటకు, బియ్యము దానమిచ్చుటకు, ముత్యపుటుంగరము ధరించుటకు, ఔషధసేవకు మంచిది.

**3. కుజహోర :** భూ-గృహాది వ్యవహారములకు, సోదర సంబంధిత విషయములకు, అగ్ని-విద్యుత్ సంబంధితపనులకు, యుద్ధ విద్యలు నేర్చుకొనుటకు మంచిది. శుభకార్యములను చేయరాదు.

**4. బుధహోర :** సర్వవ్యాపారములను ప్రారంభించుటకు, కోర్టు వ్యవహారములు, సర్వవిద్యాసంబంధిత విషయములు, జ్యోతిష భాషావిషయములకు, వస్త్రవ్యాపారమునకు, సభాకార్యకలాపములను నిర్వహించుటకు, మరకతముధరించుటకు, పెసలు దానమిచ్చుటకు, వైద్య-శిల్ప-క్రీడా విషయములకు, జూదములకు మేలు.

**5. గురుహోర :** మతసంబంధిత చర్చలు, ఆధ్యాత్మిక వ్యవహారములు, వివాహాది శుభకార్య విషయచర్చలకు, సలహాలు సంప్రదింపులకు, నూతన వస్తువస్త్రాలను ధరించుటకు, ధనసంగ్రహమునకు, శనగలను దానమిచ్చుటకు, పుష్యరాగధారణకు, విజ్ఞాన విషయములకు, పెద్దల ఆశీస్సులు పొందుటకు,పొదుపుకు మంచిది.

**6. శుక్రహోర :** స్త్రీ-పురుషుల కలయికకు, సినిమాలు, నాటకములు ప్రారంభించుటకు, నూతన వస్తు-వస్త్రాది భూషణములను ధరించుటకు, పెండ్లిచూపులు, నిశ్చయతాంబూలములకు, వాహనములు అధిరోహించుటకు, ప్రేమలేఖలు అందించుటకు, అలసందలు దానముచేయుటకు, వజ్రమణిని ధరించుటకు మంచిది.

**7. శనిహోర :** ఇనుము-నూనె-ఉప్పు వ్యాపారములకు, పశుసంబంధిత విషయములకు, చెప్పులషాపులు ప్రారంభించుటకు మంచిది. ఎట్టి శుభకార్యములను చేయరాదు. కష్ట-నష్టములు కలిగించును



హోర, భూమికి కుజహోర, అధికారమునకు రవిహోర, సేవకత్వానికి శనిహోరలు శుభము.



# దినాధిపతుల పట్టిక

| జన్మ నక్షత్రము లేక నామ నక్షత్రము | అశ్విని మఘ మూల | భరణి పుబ్బ పూర్వాషాఢ | కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ | రోహిణి హస్త శ్రవణము | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆరుద్ర స్వాతి శతభిషము | పునర్వసు విశాఖ పూర్వాభాద్ర | పుష్యమి అనురాధ ఉత్తరాభాద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని, మఖ, మూల | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 |
| భరణి, పుబ్బ, పూర్వాషాఢ | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 |
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 |
| రోహిణి, హస్త, శ్రవణము | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 |
| ఆరుద్ర, స్వాతి, శతభిషము | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 |
| పుష్యమి, అనురాధ, ఉత్తరాభాద్ర | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 |

**సూచన :** ఈ పట్టిక నందు 1జన్మ, 2సంపత్, 3విపత్, 4క్షేమ, 5ప్రత్యక్త, 6సాధన, 7నైధన, 8మిత్ర, 9పరమమిత్ర అను తారలుగా గుర్తించవలెను. **తారాబలము :** 2,4,6,8,9 తారలు శుభమైనవి. 1,3,5,7 తారలు అశుభమైనవి.

**చంద్రబలము :** జన్మరాశి లగాయతు 1,3,6,7,10,11 రాశులయందు సంచరించు చంద్రుడు ఉభయ పక్షము లందు శుభుడు. 2,4,5,8,9,12 రాశుల యందు సంచరించు చంద్రుడు అశుభమును కలుగ చేయును.

# దినాధిపతుల ఫలములు

**1.రవి :** సంచారము, తలనొప్పి, చీకాకులు, శరీరములోవేడి, వేళకాని వేళ భుజించుట, రాజకీయచర్చలు, భయాందోళనలు, ఇతరుల వలన నిరుత్సాహము, ధనవ్యయము, చినిగిన వస్త్రధారణ, ప్రయాణము, సాహసకార్యములు, అధికారులతో పేచీలు, కార్యవిలంబనలు.

**2.చంద్ర :** సంతోషము, సుఖము, మంచిభోజనము, నూతన పరిచయములు, శుభవార్తలు, వనవిహారము, వస్త్రలాభము, గౌరవము, నిర్మలమనస్సు, భక్తి, స్త్రీ సౌఖ్యము, సముద్ర స్నానము.

**3.కుజ :** ధనవ్యయము, ఆందోళన-అలజడులు, చీకాకులు, తగవులు, మనోకాఠిన్యము, సంకోచము, వైద్యసంప్రదింపులు, దుర్వార్తలు వినుట, ధనమునకు ఒత్తిడి, ప్రయాణము, కార్యాటంకము, కోపము, తాపము, అపవాదులు శరీరబాధ, రక్తదర్శనము, రక్తపీడనం

**4.బుధ :** విచిత్ర వేషధారణ, ప్రయాణము, ప్రయత్నకార్య జయము, మంచివార్తలు, జ్యోతిష-విద్య-వ్యాపార చర్చలు, బంధు-మిత్ర సందర్శనము, ధనలాభము, ఆశ్చర్యకర విషయములు జరుగుట.

**5.గురు :** సంతోష-సౌఖ్యములు, కుటుంబములో ఆనందము, ధనలాభము, గౌరవము, కీర్తి, పండితులను, పెద్దలను సందర్శించుట, మంచివార్తలు, కార్యజయము, సుఖభోజనము, శయ్యాసుఖము.

**6.శుక్ర :** స్త్రీలయందు ఆసక్తి, రతిసౌఖ్యము, చతుర్ముఖ పారాయణము, నూతనపరిచయములు, ప్రేమలేఖలు అందుకొనుట, స్వాతంత్ర్యము, భోగము, ఆనందము, బాకీలువసూలవుట, పరిమళ గంధలేపనము, తాంబూలాది విలాసములు, ప్రియవ్యక్తులాగమనం.

**7.శని :** నీచకార్యము, చోరాగ్నిభయములు, పశునష్టము, కార్యహాని, వివాదము, బంధనము, మందబుద్ధి, వృధాశ్రమ, దుర్వార్తలు.

**8.రాహు :** ప్రయాణము, తొందర, శ్మశానదర్శనము, ఆకస్మిక విరోధము, చిక్కులు,సర్పాది విషజంతు భయము, పొంగు, చెడు కలలు, వృధాశ్రమ, ఖర్చు, నీచులతో పరిచయములు, బంధనము.

**9.కేతు :** సర్పదర్శనము, కోపము, తర్కము, వివాదము, స్త్రీలతో గొడవలు, పుణ్యకథలు వినుట, దుష్టజంతు భయము, శ్రమ, సంకోచము, రాజభయము, విచిత్రగమనము, పుట్టలు-పొదలు దర్శనము.





## శ్రీవిళంబి నామ సంవత్సరము 2018- 19 మాసాధిపతులు

| మాసము | ప్రవేశము | అశ్విని మఘ మూల | భరణి పుబ్బ పూర్వాషాఢ | కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ | రోహిణి హస్త శ్రవణము | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆరుద్ర స్వాతి శతభిషము | పునర్వసు విశాఖ పూర్వాభాద్ర | పుష్యమి అనురాధ ఉత్తరాభాద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చైత్రము | 18-03-2018 | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ |
| వైశాఖము | 17-04-2018 | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు |
| అధిక జ్యేష్ఠము | 16-05-2018 | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి |
| నిజ జ్యేష్ఠము | 14-06-2018 | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర |
| ఆషాఢము | 14-07-2018 | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ |
| శ్రావణము | 12-08-2018 | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని |
| భాద్రపదము | 10-09-2018 | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు |
| ఆశ్వయుజము | 10-10-2018 | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర |
| కార్తీకము | 08-11-2018 | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ |
| మార్గశిరము | 08-12-2018 | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని |
| పుష్యము | 07-01-2019 | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు |
| మాఘము | 05-02-2019 | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ | గురు | చంద్ర | శుక్ర |
| ఫాల్గుణము | 07-03-2019 | గురు | చంద్ర | శుక్ర | రవి | రాహు | కేతు | శని | కుజ | బుధ |

**సూచన :** ఆయా నక్షత్రములవారు తమగడికి క్రిందుగాను, మాసగడికి ఎదురుగాను ఉన్న మాసాధిపతికిగల ఫలమును ప్రక్కపేజీలో చూసుకోగలరు.

# మాసాధిపతుల ఫలములు

**1. రవి :** సంచారము, అధికశ్రమ, తలనొప్పులు, మూలవ్యాధి, తూర్పు గమనము, పనులు ఆలస్యము, ఆశాభంగము, ఉత్సాహము లేకపోవుట, రాజకీయచర్చలు. సూర్యజపము, ఆదిత్య హృదయము చదువుకోవాలి.

**2. చంద్ర :** మనస్సంతోషము, మంచివార్తలు వినుట, కార్యసిద్ధి, స్త్రీ ద్వారా కార్యసాధన, యశస్సు, గౌరవము, గురుభక్తి, దేవతా భక్తి, పెద్దల సందర్శనము, మాతృసౌఖ్యం, నిర్మల మనసు, నూతన వస్తు-వస్త్రప్రాప్తి.

**3. కుజ :** విరోధములు, వ్యవహార నాశనము, శరీరమునకు గాయములు, రక్తముకారుట, మనసుకఠినముగా ఉండుట, ధనమునకు ఇబ్బంది, ఔషధములు సేవించుట, తరచుగా ఆసుపత్రికి వెళ్ళుట, దక్షిణ-నైఋతి దిశాప్రయాణములు. కుజజపము, ఈశ్వరాభిషేకము చేయించుకోవాలి.

**4. బుధ :** యత్నీకృత కార్యజయము, వ్యాపారలాభము, భవిష్యత్‌ను గురించి ఆలోచన, వర్తకజనుల స్నేహము, నూతన బాంధవ్యము, తెలివిగా మసులుకొనుట, సాంకేతికవిద్యలు, సాంప్రదాయవిద్యలు నేర్చుకొనుట, బంధుమిత్ర సందర్శనము, హాస్యసంభాషణలు, ధనరాబడి.

**5. గురు :** కుటుంబ సౌఖ్యము, ధన సంతాన లాభములు, పశ్చిమదిశా ప్రయాణము, ఆధ్యాత్మికచింతన, సుఖభోజనము, ప్రశాంతజీవనము, స్థిరజీవనము, సువర్ణ వస్తులాభము,పెద్దల ఆశీస్సులు, సంతానసౌఖ్యము.

**6. శుక్ర :** విందులు-విలాసములు, నూతనస్త్రీలతో పరిచయము, ప్రేమ వ్యవహారములు, మన్మథ సౌఖ్యము, భోగము, ఆనందము, పరిమళ, సుగంధద్రవ్యములు వాడుట, వస్తు-వస్త్రములు పొందుట, జీవితమునకు వసంతభోగము, ధనలాభము, సినిమా-నాటకరంగ ప్రవేశములు.

**7. శని :** మలినముగా ఉండుట, ఆకలిబాధ, కలహసంభాషణలు బంధనము, బద్ధకము, విరక్తి, దుష్టవార్తలు వినుట, అన్యకులస్థులవలన భయము, నీచకార్యములలోతలదూర్చుట, చోరాగ్నిభయములు, ప్రయాణములలో డబ్బుపోగొట్టుకొనుట, పశునష్టములు, కుక్షిరోగములు.

**8. రాహు :** తొందరప్రయాణము, శ్మశానదర్శనము, అనారోగ్యము, పిశాచభయము, మనోధైర్యము, వ్యసనములు, విధవాస్త్రీ సహాయము, సర్పదర్శనము, చోరభయము. రాహుజపము, దుర్గాదేవి ఉపాసనలు.

**9. కేతు :** పోయినసొమ్ము లభించుట, కోపము, తర్కము, స్త్రీలతో కలహములు, మూఢభక్తి, పుణ్యపురుషుల సందర్శనము, స్వామీజీల ఆశీర్వాదము, చంచలమనస్సు, కేతుస్తుతి, రుద్రాభిషేకము చేయించాలి.





# శిశు జనన - నక్షత్ర పాద దోషముల పట్టిక

| నక్షత్రము | 1వ పాదము | 2వ పాదము | 3వ పాదము | 4వ పాదము |
|---|---|---|---|---|
| అశ్విని | తండ్రికి | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | మంచిది | శిశువుకు |
| కృత్తిక | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| రోహిణి | పితృ.మేనమామ | పితృ,మేనమామ | పితృ,మేనమామ | పితృ,మేనమామ |
| మృగశిర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఆరుద్ర | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | పితృ,మాతృ | పితృ,మాతృ | పితృ,మాతృ |
| ఆశ్లేష | మంచిది | శిశువుకు | తల్లికి | తండ్రికి |
| మఖ | తండ్రికి | తండ్రికి | మంచిది | తల్లికి |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| ఉత్తర | పితృ,మాతృ | మంచిది | మంచిది | మంచిది |
| హస్త | మంచిది | మంచిది | దోషం | మంచిది |
| చిత్త | తల్లికి | తండ్రికి | మంచిది | మంచిది |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| అనురాధ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| జ్యేష్ఠ | తల్లికి | సోదర,మేనమామ | శిశువుకు | తండ్రికి |
| మూల | తండ్రికి | తల్లికి | ధనమునకు | మంచిది |
| పూర్వాషాఢ | మంచిది | మంచిది | తండ్రికి | మంచిది |
| ఉత్తరాషాఢ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శతభిషము | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పూర్వాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉత్తరాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | తండ్రికి |

**సూచన :** శిశువు ఉత్పాత కాలములందు, గ్రహణ-అమావాస్య సమయములందు, వర్జ్య-దుర్ముహూర్తములందు, సోదర-సోదరీల, తల్లిదండ్రుల జన్మ నక్షత్రములందు, నక్షత్ర-తిథి-లగ్నసంధులందు మరియు ప్రేగులు మెడకు చుట్టుకుని పుట్టిననూ...నవగ్రహశాంతులు, నక్షత్రజపములు, కూష్మాండాది సువర్ణదానములు, హోమశాంతులు, రుద్రాభిషేకములు, అమ్మవారి పూజలు చేయించుట వలన దోషములు తొలగి ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగును.

## ప్రయాణ విషయమై శుభ సమయములు

**శుభ తిథులు :** ఉభయ పక్షముల యందలి 2,3,5,7,10,13 తిథులు మంచివి.

**శుభ నక్షత్రములు :** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, మూల, శ్రవణము, ధనిష్ఠ, రేవతిలు ప్రథమ పక్షముగాను, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిషములు ద్వితీయ పక్షముగాను, మిగిలిన తారలు అధమ పక్షముగాను, ప్రయాణ విషయమై గమనించవలెను.

### ఆయా దిక్కులకు ప్రయాణము చేయకూడని తిథి-వార-నక్షత్ర -లగ్నములు

| దిక్కు | తిథి | వారము | నక్షత్రము | లగ్నము |
|---|---|---|---|---|
| 1.తూర్పు | పాడ్యమి,నవమి | శని,సోమ | జ్యేష్ఠ, ధనిష్ట | తుల,కుంభము |
| 2.ఆగ్నేయము | తదియ,ఏకాదశి | గురు,శని | - | మకరము |
| 3.దక్షిణము | పంచమి,త్రయోదశి | గురు | అశ్విని,శ్రవణము | వృశ్చిక,మీనము |
| 4.నైఋతి | చవితి,ద్వాదశి | సోమ,శుక్ర | - | కర్కాటకము |
| 5.పడమర | షష్ఠి,చతుర్దశి | ఆది,శుక్ర | పుష్యమి,రోహిణి | సింహము |
| 6.వాయువ్యము | సప్తమి,పూర్ణిమ | ఆది,మంగళ | - | మేషము |
| 7.ఉత్తరము | విదియ,దశమి | మంగళ,బుధ | పుబ్బ, హస్త | వృషభ,కన్య |
| 8.ఈశాన్యము | అష్టమి,అమావాస్య | బుధ | - | మిధునము |

### ప్రయాణ విషయమై నలుదిశలకు మంచివారములు

**1.తూర్పు** : మంగళవారము
**2.దక్షిణము** : సోమ,శనివారములు
**3.పడమర** : బుధ,గురువారములు
**4.ఉత్తరము** : ఆది,శుక్రవారములు



### 卐 సర్వార్ధ సిద్ధి యోగములు 卐

| వారము | నక్షత్రములు |
|---|---|
| ఆది | అశ్విని-పుష్యమి-ఉత్తర-హస్త-మూల-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర |
| సోమ | రోహిణి-మృగశిర-పుష్యమి-అనురాధ-శ్రవణము |
| మంగళ | అశ్విని-కృత్తిక-ఆశ్లేష-ఉత్తరాభాద్ర |
| బుధ | కృత్తిక-రోహిణి-మృగశిర-హస్త-అనురాధ |
| గురు | అశ్విని-పునర్వసు-పుష్యమి-అనురాధ-రేవతి |
| శుక్ర | అశ్విని-పునర్వసు-అనురాధ-శ్రవణము-రేవతి |
| శని | రోహిణి-స్వాతి-శ్రవణము |





## ప్రయాణములకు ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని | యోగము | రోజులు | ఫలితము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | మృగ॥ | ఆశ్లేష | హస్త | అను॥ | ఉ.షా | శతభిష | ఆనంద | 15 | కార్యసిద్ధి |
| భరణి | ఆరుద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి॥ | పూ॥భా | కాలదండ | 27 | కార్యహాని |
| కృత్తిక | పున॥ | పుబ్బ | స్వాతి | మూల | శ్రవణం | ఉ॥భా | ధూమ్ర | 8 | ధననష్టము |
| రోహిణి | పుష్యమి | ఉత్తర | విశాఖ | పూ॥షా | ధనిష్ఠ | రేవతి | ధాత్రి | 4 | కార్యసిద్ధి |
| మృగ॥ | ఆశ్లేష | హస్త | అను॥ | ఉ॥షా | శత॥ | అశ్విని | సౌమ్య | 30 | సర్వసౌఖ్యము |
| ఆరుద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి॥ | పూ॥భా | భరణి | ధ్వాంక్ష | 5 | కార్యహాని |
| పున॥ | పుబ్బ | స్వాతి | మూల | శ్రవణం | ఉ॥భా | కృత్తిక | ధ్వజ | 10 | కార్యసిద్ధి |
| పుష్యమి | ఉత్తర | విశాఖ | పూ॥షా | ధనిష్ఠ | రేవతి | రోహిణి | శ్రీవత్స | 3 | లాభము |
| ఆశ్లేష | హస్త | అను॥ | ఉ॥షా | శత॥ | అశ్విని | మృగ॥ | వజ్ర | 2 | కార్యహాని |
| మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి॥ | పూ॥భా | భరణి | ఆరుద్ర | ముద్గర | 1 | కలహము |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవణం | ఉ॥భా | కృత్తిక | పున॥ | ఛత్ర | 3 | స్త్రీలాభము |
| ఉత్తర | విశాఖ | పూ॥షా | ధనిష్ఠ | రేవతి | రోహిణి | పుష్యమి | మిత్ర | 5 | మిత్రలాభము |
| హస్త | అను॥ | ఉ॥షా | శత॥ | అశ్విని | మృగ॥ | ఆశ్లేష | మానస | 2 | కార్యలాభము |
| చిత్త | జ్యేష్ఠ | అభి॥ | పూ॥భా | భరణి | ఆరుద్ర | మఖ | పద్మ | 1 | ఐశ్వర్యప్రదము |
| స్వాతి | మూల | శ్రవణం | ఉ॥భా | కృత్తిక | పున॥ | పుబ్బ | లంబ | 3 | కష్ట-నష్టము |
| విశాఖ | పూ॥షా | ధనిష్ఠ | రేవతి | రోహిణి | పుష్యమి | ఉత్తర | ఉత్పాత | 4 | ద్రవ్యనాశనము |
| అను॥ | ఉ॥షా | శత॥ | అశ్విని | మృగ॥ | ఆశ్లేష | హస్త | మృత్యు | 10 | సర్పదర్శనము |
| జ్యేష్ఠ | అభి॥ | పూ॥భా | భరణి | ఆరుద్ర | మఖ | చిత్త | కాల | 5 | అవమానము |
| మూల | శ్రవణం | ఉ॥భా | కృత్తిక | పున॥ | పుబ్బ | స్వాతి | సిద్ధి | 7 | కార్యసిద్ధి |
| పూ॥షా | ధనిష్ఠ | రేవతి | రోహిణి | పుష్యమి | ఉత్తర | విశాఖ | శుద్ధి | 6 | పనియగును |
| ఉ॥షా | శత॥ | అశ్విని | మృగ॥ | ఆశ్లేష | హస్త | అను॥ | అమృత | 2 | కార్యజయము |
| అభి॥ | పూ॥భా | భరణి | ఆరుద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | ముసల | 8 | దుఃఖము |
| శ్రవణం | ఉ॥భా | కృత్తిక | పున॥ | పుబ్బ | స్వాతి | మూల | గదా | 40 | చెఱుపు |
| ధనిష్ఠ | రేవతి | రోహిణి | పుష్యమి | ఉత్తర | విశాఖ | పూ॥షా | మాతంగ | 2 | అశ్వలాభము |
| శత॥ | అశ్విని | మృగ॥ | ఆశ్లేష | హస్త | అను॥ | ఉ॥షా | రాక్షస | 9 | మిత్రకలహము |
| పూ॥భా | భరణి | ఆరుద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి॥ | చల | 8 | దుర్వార్తలు |
| ఉ॥భా | కృత్తిక | పున॥ | పుబ్బ | స్వాతి | మూల | శ్రవణం | స్థిర | 3 | మిశ్రమఫలము |
| రేవతి | రోహిణి | పుష్యమి | ఉత్తర | విశాఖ | పూ॥షా | ధనిష్ఠ | వర్ధమాన | 10 | శివదర్శనము |

## ప్రయాణ విషయమై అమృతాది యోగములు

అమృత–అమృతయోగము,ప్రబల–ప్రబలారిష్టయోగం,సిద్ధ–సిద్ధయోగం,మృత్యు–మృత్యుయోగం

| నక్షత్రము | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | అమృత | అమృత | సిద్ధ |
| భరణి | ప్రబల | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| కృత్తిక | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృత | మృత్యు | సిద్ధ | అమృత |
| రోహిణి | సిద్ధ | అమృత | అమృత | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృత |
| మృగశిర | సిద్ధ | అమృత | సిద్ధ | సిద్ధ | అమృత | సిద్ధ | సిద్ధ |
| ఆరుద్ర | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | సిద్ధ |
| పునర్వసు | సిద్ధ | అమృత | సిద్ధ | సిద్ధ | అమృత | సిద్ధ | సిద్ధ |
| పుష్యమి | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృత | మృత్యు | సిద్ధ |
| ఆశ్లేష | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | మృత్యు |
| మఖ | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | అమృత | అమృత | అమృత |
| పుబ్బ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృత | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| ఉత్తర | అమృత | సిద్ధ | అమృత | అమృత | మృత్యు | సిద్ధ | మృత్యు |
| హస్త | అమృత | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృత | మృత్యు |
| చిత్త | సిద్ధ | ప్రబల | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| స్వాతి | సిద్ధ | అమృత | సిద్ధ | సిద్ధ | అమృత | సిద్ధ | అమృత |
| విశాఖ | మృత్యు | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| అనురాధ | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| జ్యేష్ఠ | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | ప్రబల | మృత్యు | సిద్ధ |
| మూల | అమృత | సిద్ధ | అమృత | మృత్యు | సిద్ధ | అమృత | సిద్ధ |
| పూర్వాషాఢ | సిద్ధ | ప్రబల | సిద్ధ | అమృత | సిద్ధ | ప్రబల | సిద్ధ |
| ఉత్తరాషాఢ | సిద్ధ | ప్రబల | సిద్ధ | అమృత | సిద్ధ | ప్రబల | సిద్ధ |
| శ్రవణము | అమృత | అమృత | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ |
| ధనిష్ఠ | మృత్యు | సిద్ధ | సిద్ధ | ప్రబల | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శతభిషము | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృత |
| పూర్వాభాద్ర | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృత | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| ఉత్తరాభాద్ర | అమృత | సిద్ధ | అమృత | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| రేవతి | అమృత | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృత | ప్రబల |

**నిర్హ్య విషయములు :** నిషిద్ధ కాలమందు తప్పనిసరియై ప్రయాణమైనచో, ఆదివారము బంగారము, సోమవారము వస్త్రము, మంగళవారము ఆయుధము, బుధవారము పుస్తకము, గురువారము గొడుగు, టోపి, శుక్రవారము చెప్పులు లేదా వాహనము, శనివారము కంఠమున ధరించు ఆభరణము ప్రయాణ మార్గమందలి ఎవరింటనైనా నిర్హ్యముంచుకొని, శుభ శకునము చూసుకొని ప్రయాణమై వెళ్ళవచ్చు.





## గౌరీపంచాంగము

| వారము | కాలము | 6.00మొదలు 7.30వఱకు | 7.30మొదలు 9.00వఱకు | 9.00మొదలు 10.30వఱకు | 10.30మొదలు 12.00వఱకు | 12.00మొదలు 1.30వఱకు | 1.30మొదలు 3.00వఱకు | 3.00మొదలు 4.30వఱకు | 4.30మొదలు 6.00వఱకు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | పగలు | ఉద్యోగము | లాభము | విషము | అమృతము | శుభము | ధనము | అమృతము | విషము |
| | రాత్రి | శుభము | అమృతము | జ్వరము | రోగము | కలహము | లాభము | ఉద్యోగము | రోగము |
| సోమ | పగలు | అమృతము | విషము | ఉద్యోగము | లాభము | జ్వరము | అమృతము | ఆదాయము | ధనము |
| | రాత్రి | రోగము | లాభము | ఉద్యోగము | రోగము | ధనము | అమృతము | విషము | జ్వరము |
| మంగళ | పగలు | రోగము | ఉద్యోగము | జ్వరము | లాభము | అమృతము | ఉద్యోగము | విషము | లాభము |
| | రాత్రి | జ్వరము | ఉద్యోగము | కలహము | లాభము | రోగము | లాభము | ఉద్యోగము | ధనము |
| బుధ | పగలు | విషము | అమృతము | శుభము | ఉద్యోగము | రోగము | శుభము | ధనము | అమృతము |
| | రాత్రి | లాభము | రోగము | విషము | ఉద్యోగము | శుభము | లాభము | ధనము | లాభము |
| గురు | పగలు | ఉద్యోగము | విషము | జ్వరము | లాభము | అమృతము | విషము | కలహము | జ్వరము |
| | రాత్రి | శుభము | రోగము | కలహము | లాభము | ఉద్యోగము | జ్వరము | విషము | ఉద్యోగము |
| శుక్ర | పగలు | రోగము | జ్వరము | అమృతము | కలహము | లాభము | సుఖము | ధనము | అమృతము |
| | రాత్రి | అమృతము | జ్వరము | కలహము | లాభము | శుభము | ధనము | అమృతము | విషము |
| శని | పగలు | విషము | అమృతము | జ్వరము | ఉద్యోగము | శుభము | లాభము | ధనము | లాభము |
| | రాత్రి | విషము | ఉద్యోగము | శుభము | అమృతము | కలహము | రోగము | అమృతము | లాభము |

**సూచన :** పగటిప్రమాణమును 8భాగములుచేసి ఒక్కొక్కభాగమును సూర్యోదయ సమయమునకు కలుపుకుని పగటిఫలితములను, రాత్రిప్రమాణమును 8భాగములుచేసి ఒక్కొక్కభాగమును సూర్యాస్తమయ సమయమునకు కలుపుకుని రాత్రిఫలితములను గ్రహించవలెను.

# శ్రీ విళంబి (2018-19) లో పండుగలు

**మార్చ్ 2018 : 18.** శ్రీ విళంబి నామ తెలుగు సంవత్సరాది, ఉగాది పర్వదినము, **19.** చంద్రదర్శనము **20.** రజ్జబ్ నెల ప్రా॥ **22.** శ్రీ పంచమి, మత్స్య జయంతి **25.** శ్రీ రామనవమి **26.** ధర్మరాజ దశమి **31.** రేవతి కార్తె ప్రా॥, మదన పూర్ణిమ.

**ఏప్రిల్ : 3.** సంకటహర చతుర్థి **6.** గుడ్‌ఫ్రైడే **8.** ఈస్టర్ సండే **14.** అశ్విని కార్తె ప్రా॥, మేష సంక్రమణము, శని త్రయోదశి, అంబేడ్కర్ జయంతి, మాస శివరాత్రి **16.** సర్వ అమావాస్య, పిం.పి.యజ్ఞః **17.** చంద్ర దర్శనము **18.** అక్షతృతీయ, త్రేతా యుగాది, సింహాచల చందనోత్సవము, పరశురామ జయంతి, షాబాన్ నెల ప్రా॥ **20.** శ్రీ శంకరాచార్య జయంతి **22.** భాను సప్తమి **25.** శ్రీ వీర బ్రహ్మేంద్రస్వామి వారి జయంతి **26.** అన్నవరం శ్రీ సత్యదేవుని కళ్యాణము, అన్నవరప్పాడు శ్రీ వేంకటేశ్వర స్వామి వార్ల కళ్యాణము **27.** భరణి కార్తె ప్రా॥ **28.** శని త్రయోదశి, నృసింహ జయంతి **30.** వైశాఖ పూర్ణిమ, బుద్ధ పూర్ణిమ.

**మే : 1.** మేడే **3.** సంకటహర చతుర్థి **4.** డొల్లు కర్తరి ప్రారంభము **10.** శ్రీ హనుమ జ్జయంతి **11.** నిజ కర్తరి ప్రా॥, కృత్తిక కార్తె ప్రా॥ **14.** మాస శివరాత్రి **15.** వృషభ సంక్రమణము, పిం.పి.యజ్ఞః, **16.** చంద్ర దర్శనము **17.** బుద్ధ జయంతి, కల్కి జయంతి, రంజాన్ నెల ప్రారంభం **25.** రోహిణి కార్తె ప్రారంభము **28.** కర్తరి ఆఖరు.

**జూన్ : 2.** సంకటహర చతుర్థి, తెలంగాణా రాష్ట్ర ఆవిర్భావ దినోత్సవము **8.** మృగశిర కార్తె ప్రారంభము, ఆంధ్రప్రదేశ్ పునర్నిర్మాణ అవతరణ దినోత్సవము **12.** మాస శివరాత్రి **15.** చంద్రదర్శనము, మిధున సంక్రమణము **16.** షవ్వాల్ నెల ప్రారంభము, రంజాన్ పండుగ **22.** దశపాపహర దశమి, గంగావతరణ దినోత్సవము, ఆరుద్ర కార్తె ప్రారంభము **23.** నిర్జల ఏకాదశి, కూర్మ జయంతి **28.** ఏరువాక పూర్ణిమ.

**జూలై : 2.** సంకటహర చతుర్థి **6.** పునర్వసు కార్తె ప్రారంభము **11.** మాస శివరాత్రి **13.** గాట్ల అమావాస్య, పిం.పి.యజ్ఞః **14.** చంద్రదర్శనము, పూరి శ్రీ జగన్నాథ రథోత్సవము **15.** జిలకాజ్ నెల ప్రారంభము **16.** కర్కాటక సంక్రమణము **17.** స్కంద పంచమి **18.** కుమార షష్ఠి **20.** పుష్య కార్తె ప్రారంభము **23.** తొలి ఏకాదశి **24.** చాతుర్మాస వ్రతారంభము **25.** వరాహ జయంతి **27.** వ్యాస పూర్ణిమ, గురు పూర్ణిమ, సంపూర్ణ చంద్రగ్రహణము **29.** సిద్ధాంతి గారి జన్మదినము **31.** సంకటహర చతుర్థి

**ఆగస్ట్ : 3.** ఆశ్లేష కార్తె ప్రారంభము **11.** పిం.పి.యజ్ఞః **12.** చంద్రదర్శనము **13.** జిలహేజ్ నెల ప్రారంభము **15.** నాగ పంచమి, భారత స్వాతంత్ర్య దినోత్సవము, అరవిందుని జయంతి **17.** మఖ కార్తె ప్రారంభము, సింహ సంక్రమణము **21.** మంగళ గౌరీ వ్రతము **22.** బక్రీద్ **24.** వరలక్ష్మీ వ్రతము **25.** ఉపాకర్మ **26.** శ్రావణ పూర్ణిమ, రక్షాబంధన్, జంధ్యాల పూర్ణిమ **30.** సంకటహర చతుర్థి, పుబ్బ కార్తె ప్రారంభము

**సెప్టెంబర్ : 2.** శ్రీ కృష్ణాష్టమి **5.** ఉపాధ్యాయ దినోత్సవము **8.** శని త్రయోదశి, మాస శివరాత్రి **9.** పోలాల అమావాస్య, పిం.పి.యజ్ఞః **11.** చంద్రదర్శనము **12.** బలరామ జయంతి, హిజరీ (1439) నెల ప్రారంభము **13.** శ్రీ సిద్ధి వినాయక చవితి, ఉత్తర కార్తె ప్రారంభము **14.** ఋషి పంచమి **15.** శ్రీ సూర్య షష్ఠి **16.** భాను సప్తమి **17.** కన్యా సంక్రమణము **20.** వామన జయంతి **21.** మొహరమ్ **22.** శని త్రయోదశి **27.** ఉండ్రాళ్ళ తద్దె, బృహత్యుమా వ్రతము, హస్త కార్తె ప్రా॥ **28.** సంకటహర చతుర్థి.

**అక్టోబర్ : 2.** గాంధీ జయంతి **7.** మాస శివరాత్రి **9.** మహాలయ అమావాస్య, పిం.పి. యజ్ఞః **10.** చంద్రదర్శనము, శరన్నవరాత్రులు ప్రారంభము, కలశ స్థాపన,





చండీ పూజారంభము, చిత్త కార్తె ప్రారంభము, తిరుమల తిరుపతి శ్రీవారి నవరాత్ర బ్రహ్మోత్సవములు ప్రారంభము **11.** సఫర్ నెల ప్రారంభము **12.** భీమరధీ (తామ్రపర్ణి) నదీ పుష్కరోత్సవములు ప్రారంభము **14.** సరస్వతి ఆవాహనము **15.** దేవి త్రిరాత్ర వ్రతము, సరస్వతి దేవి పూజ **17.** దుర్గాష్టమి, తులా సంక్రమణము **18.** మహార్నవమి, శ్రీవారి చక్రస్నానము **19.** విజయ దశమి, శమీ పూజ, దుర్గాదేవి ఉద్వాసన **21.** పద్మనాభ ద్వాదశి, గోద్వాదశి, పశ్చాదస్తమిత శుక్ర మూఢమి ప్రారంభము **23.** భీమరధీ (తామ్రపర్ణి) నదీ పుష్కరోత్సవములు ఆఖరు **24.** స్వాతి కార్తె ప్రారంభము, కోశాగార పూర్ణిమ **27.** అట్లతద్దె, సంకటహర చతుర్థి **31.** ప్రాగుదయ శుక్ర మూఢమి ఆఖరు

**నవంబర్ : 5.** ధనత్రయోదశి **6.** నరక చతుర్దశి, మాస శివరాత్రి, విశాఖ కార్తె ప్రారంభము **7.** దీపావళి అమావాస్య, కేదార వ్రతము, ధనలక్ష్మీ వ్రతము **8.** ఆకాశ దీపారంభము, బలిపాడ్యమి, బలిపూజ **9.** చంద్రదర్శనము, యమ విదియ, భగినీ హస్త భోజనము **10.** త్రిలోచన గౌరీ వ్రతము, రబ్బీలవ్వల్ నెల ప్రారంభము **11.** నాగుల చవితి **12.** పశ్చాదస్తమిత గురు మూఢమి ప్రారంభము **14.** నెహ్రూ జయంతి **16.** వృశ్చిక సంక్రమణము **17.** కృత యుగాది **19.** అనురాధ కార్తె ప్రారంభము **20.** చిలుకు ద్వాదశి, చాతుర్మాస వ్రత సమాప్తము, క్షీరాబ్ది పూజలు **21.** మిలాదున్-నబి **23.** జ్వాలా తోరణము, కార్తీక పౌర్ణమి **26.** సంకటహర చతుర్థి

**డిసెంబర్ : 3.** జ్యేష్ఠ కార్తె ప్రా॥ **5.** మాస శివరాత్రి **7.** పిం.పి.యజ్ఞః **8.** చంద్రదర్శనము **9.** రబ్బీసాని నెల ప్రా॥ **10.** ప్రాగుదయ గురుమూఢమి పూర్తి **13.** శ్రీ సుబ్రహ్మణ్య షష్ఠి **14.** మిత్ర సప్తమి **16.** మూల కార్తె ప్రా॥, ధనుస్సంక్రమణము, ధనుర్మాసారంభము **19.** మోక్ష ఏకాదశి, ముక్కోటి (వైకుంఠ) ఏకాదశి, శ్రీరంగమున ద్వారదర్శన మహోత్సవము, గార్మీషరీఫ్ **20.** శ్రీ హనుమద్వ్రతము **22.** శ్రీ దత్తాత్రేయ జయంతి **25.** సంకటహర చతుర్థి, క్రిస్టమస్ **29.** పూర్వాషాఢ కార్తె ప్రారంభము

**జనవరి 2019 : 1.** ఆంగ్ల సంవత్సరాది 4. మాస శివరాత్రి **5.** పిం.పి.యజ్ఞః **7.** చంద్ర దర్శనము **8.** జమాదీ లవ్వల్ నెల ప్రా॥ **11.** ఉత్తరాషాఢ కార్తె ప్రా॥ **13.** భాను సప్తమి **14.** మకర సంక్రమణము, భోగి **15.** సంక్రాంతి పండుగ **16.** కనుమ **17.** ముక్కనుమ, సావిత్రి గౌరీ వ్రతము, బొమ్మల నోము ప్రా॥, **19.** శని త్రయోదశి **24.** సంకటహర చతుర్థి, శ్రవణ కార్తె ప్రా॥ **26.** రిపబ్లిక్ డే **27.** భాను సప్తమి

**ఫిబ్రవరి : 2.** శనిత్రయోదశి **3.** మాస శివరాత్రి **4.** చొల్లగి అమావాస్య, పిం.పి.యజ్ఞః **6.** చంద్ర దర్శనము, ధనిష్ఠ కార్తె ప్రారంభము **7.** జమాదిస్సాని నెల ప్రారంభము **12.** రథ సప్తమి **13.** కుంభ సంక్రమణము, భీష్మాష్టమి **16.** భీష్మ ఏకాదశి, అంతర్వేది తీర్థము **19.** మహామాఘి, శతభిష కార్తె ప్రారంభము **22.** సంకటహర చతుర్థి

**మార్చ్ : 4.** మాస శివరాత్రి, మహా శివరాత్రి, శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి,గోవిందమాంబల వార్ల కళ్యాణము **5.** పూర్వాభాద్ర కార్తె ప్రారంభము **6.** సర్వేషాం అమావాస్య, పిం.పి.యజ్ఞః, ద్వాపర యుగాది **7.** జగత్ ప్రసిద్ధ శ్రీ జలదుర్గా గోకర్ణేశ్వర స్వామి వార్ల కళ్యాణ మహోత్సవములు (కొల్లేటికోట తిరునాళ్ళు) ప్రారంభము **8.** చంద్ర దర్శనము **9.** రజ్జబ్ నెల ప్రారంభము **15.** మీన సంక్రమణము **18.** ఉత్తరా భాద్ర కార్తె ప్రారంభము, శ్రీ కొల్లేటికోట జలదుర్గా గోకర్ణేశ్వర స్వామి వార్ల కళ్యాణము **20.** హోలికా పూర్ణిమ **21.** వసంతోత్సవము, కొల్లేటికోట తిరునాళ్ళు ఆఖరు **24.** సంకటహర చతుర్థి **31.** రేవతి కార్తె ప్రారంభము.

**ఏప్రిల్ : 3.** మాస శివరాత్రి **5.** పిం.పి.యజ్ఞః **6.** శ్రీ వికారి నామ తెలుగు సంవత్సరాది.

**శ్రీకరం ! శుభకరం !! జయకరం !!!**







"ఓం శ్రీ మహా గణపతయే నమః"
"ఓం శ్రీ హనుమతే నమః"
"ఓం శ్రీ బ్రహ్మదేవాయ మమ గురుభ్యో నమః"

## శ్రీ విళంబి నామ సంవత్సర సౌరచంద్రజ్యోతిష్

# గంటల పంచాంగము

శ్లో॥ వందే విశ్వేశ్వరం దేవం గణనాథం గజాననమ్ ।
ధ్యానేన యస్య ప్రత్యూహా విలయం యాంతి దూరతః ॥

| | |
|---|---|
| సృష్ట్యాది గతాబ్దములు | 195,58,85,119 |
| కలియుగాబ్దములు | 5,119 |
| శాలివాహన శకాబ్దములు | 1,940 |
| విక్రమార్క శకాబ్దములు | 2,075 |
| శ్రీ శంకరాచార్యాబ్దములు | 2,090 |
| శ్రీ రామానుజాబ్దములు | 1001 |
| హిజరీ శకాబ్దములు | 1439-40 |
| శ్రీ మధ్వాచార్యాబ్దములు | 902 |
| భారత స్వాతంత్ర్యాబ్దములు | 71 |
| ఉమ్మడి ఆంధ్రరాష్ట్ర అవతరణాబ్దములు | 62 |
| నవీన ఆంధ్రరాష్ట్ర అవతరణాబ్దములు | 04 |
| తెలంగాణారాష్ట్ర అవతరణాబ్దములు | 04 |
| ఆంగ్ల సంవత్సరములు | 2018-19 |
| ప్రభవాబ్దములు | 32 |





## శ్రీ విళంబి నామ సంవత్సర ఫలము

ప్రభవాది 60 సంవత్సరముల కాలచక్రములో పంచవత్సరాత్మకమగు ద్వాదశ యుగములలో..... ప్రస్తుతము **"పిత్ర"** దేవతాకమగు సప్తమ యుగము నడుస్తున్నది. ఇందు ద్వితీయ సంవత్సరము శ్రీ **"సూర్య"**దేవుని ఆధిపత్యముతో **"పరివత్సర"** నామము గల **"విళంబి"** నామ సంవత్సరము అయినది. ఈ విళంబి నామ సంవత్సరము నందు **"యవలు"** దానము చేయుటవలన సర్వ అరిష్టములు నివారణగును. ఈ సంవత్సరము ప్రజలందరూ **"శ్రీ సూర్యనారాయణమూర్తి"** ని విధిగా ఆరాధించుట వలన ఆయురారోగ్య ఐశ్వర్యభాగ్యములు సిద్ధించి ప్రజాసంక్షేమము కలుగును.

ఈ సంవత్సరము రాజ-ధాన్యాధిపత్యములు **సూర్యునికి,** మంత్రిత్వము **శనికి,** సేనా-అర్ఘ-మేఘాధిపత్యములు **శుక్రునకు,** సస్యాధి పత్యము **కుజునకు,** రసాధిపత్యము **బుధుడుకు,** నీరసాధిపత్యము **చంద్రునికి** ప్రాప్తించినవి. ఈ నవనాయకులలో ఐదుగురు శుభులు, నలుగురు పాపులు అగుటచే ఈ సంవత్సరము ప్రజలకు అన్నివిధాలా అనుకూల కాలముగా ఉన్ననూ, ప్రజలు పాలకులపై విశ్వాసము కోల్పోవుదురు.

ఈ సంవత్సరము కూడా **పశుపాలకుడుగా యముడు, పశుకాపరిగా శ్రీకృష్ణుడు** ఉండుట వలన... తృణ సమృద్ధి, క్షీర సంపదలు చేకూరిననూ పశువుల అభివృద్ధి క్షీణించును. పాలధరలు పెరుగును. పాలు-పెరుగు-నెయ్యి కల్తీలు ఎక్కువగును. ప్రకృతి విపత్తులచే పశునష్టములు.

ఈ సంవత్సరము కూడా **2** కుంచముల వర్షము కురియును. అందు **10** భాగములు **సముద్రము** నందు, **7** భాగములు **పర్వతముల** యందు, **3** భాగములు **భూమి** యందు వర్షించును. ఈ సంవత్సరము వర్షాకాల ప్రారంభము నందు భారీ నుండి అతిభారీ వర్షములు కురియుట వలన నదీతీర ప్రాంతీయులకు మరియు పల్లపు ప్రాంతముల వారికి వరద ముప్పులు కలుగును. ఈ సంవత్సరము **1** తూము గాలివీచుటవలన మరియు మేఘాధిపత్యము శుక్రునికి పట్టుటవలన తుఫాన్ ప్రమాదములు అంతగా ఉండవు. వేసవికాలము నందు మాత్రము తీవ్ర వడగాల్పులు మరియు ఎండలు అధికముగా ఉండుటచే అగ్ని-ప్రాణ నష్టములుండును.

**16** వీసముల పంటకు **9** వీసముల పంట నిలుచును. రెండవ పంట కంటే మొదటి పంట తీవ్ర నష్టమును కలిగించును. ఎఱ్ఱని భూములు-ఎఱుపు వంగడములు విరివిగా ఫలించును. దుంపలు-ముల్లుగల ధాన్యములు-మిర్చి-గోధుమలు-కందులు-కుసుమలు-వెల్లుల్లి-మిరియములు-ఆవాలు బాగుగా ఫలించును.

ఈ సంవత్సరము రాష్ట్ర ఆదాయము **99** గాను, వ్యయము **93** గాను ఉండుట వలన ప్రభుత్వ ఖజానా అభివృద్ధి చెందును. రాష్ట్ర కీర్తి **48** గాను, అపకీర్తి **48** గాను ఉండుటచే ప్రభుత్వ కీర్తి-ప్రతిష్టలు సామాన్యము.

**"చిరంజీవి"** అయిన **"శ్రీ అభయాంజనేయస్వామి"** దేశమును, రాష్ట్రమును, ప్రజలందరను సర్వదా రక్షించునుగాక!

## కర్తరి నిర్ణయము

**డొల్లుకర్తరి** : ది.04-05-2018 వైశాఖ బహుళ పంచమి శనివారము నుండి, ది.11-05-2018 వైశాఖ బహుళ ఏకాదశి శుక్రవారము వరకు డొల్లుకర్తరి ఉండును.

**నిజకర్తరి** : ది.11-05-2018 వైశాఖ బహుళ ఏకాదశి శుక్రవారము నుండి, ది.28-05-2018 అధిక జ్యేష్ఠ శుక్ల చతుర్దశి సోమవారము వరకు నిజకర్తరి ఉండును.

**సూచన** : ఈ కర్తరి రోజులలో... అందునా నిజకర్తరిలో భూమి పూజ,కర్ర,ఇటుక,మట్టి,శిల,సిమెంట్,తాటాకు కప్పులు,రేకు కప్పులు, బావులు-చెఱువులు త్రవ్వుట,క్రొత్తవాహనములు కొనుట-నడుపుట చేయరాదు.

## మౌఢ్య నిర్ణయము

**గురుమూఢమి** : ది.12-11-2018 కార్తీక శుక్ల పంచమి సోమవారము నుండి, ది.10-12-2018 మార్గశిర శుక్ల తదియ సోమవారము వరకు పశ్చాదస్తమిత గురుమూఢమి.

**శుక్రమూఢమి** : ది.21-10-2018 ఆశ్వయుజ శుక్ల ద్వాదశి ఆదివారము నుండి, ది.31-10-2018 ఆశ్వయుజ బహుళ సప్తమి (తత్కాల అష్టమి) బుధవారము వరకు పశ్చాదస్తమిత శుక్రమూఢమి.

**సూచన** : గురు-శుక్ర మౌఢ్య దినములలో వివాహాది శుభకార్యములు,నూతన వస్తు-వస్త్ర-వాహన-భూషణ ధారణలు చేయరాదు.

## పుష్కర నిర్ణయము

ది.12-10-2018 ఆశ్వయుజ శుక్ల చవితి శుక్రవారము ఉదయము గం॥ 8-18 ని॥లకు **"ఖగోళ దృగ్గణిత తంత్రమ్"** (అముద్రితము) గ్రంథోక్త అయనాంశములచే గురుడు వృశ్చికరాశి ప్రవేశము చేయుచున్నాడు. కావున ది.12-10-2018 శుక్రవారము నుండి 12 రోజుల పాటు అనగా ది.23-10-2018 మంగళవారము వరకు **"శ్రీ భీమరధీ (తామ్రపర్ణి) నదీ పుష్కరోత్సవములు"** జరుగును.

**పుష్కరప్రదేశము** : బాణతీర్థము (తమిళనాడు)





## చాంద్రమానాబ్ద ఫలము

చాంద్రమానమున ఈ సంవత్సరము ప్రభవాది 32 వది శ్రీ **"విళంబి"** నామ సంవత్సరము అగుట వలన... ప్రజలకు శత్రు-రోగ-ఋణ బాధలు అధికమగును. అల్పవర్షము మరియు దొంగల భయము ఉండును. శారీరక-మానసిక బలహీనులగుదురు. పొట్టకూటికై వలసలు పోవుదురు. వ్యాపారులకు-శిల్పులకు-రచయితలకు-వైద్యులకు-జ్యోతిషులకు-ఉపాధ్యాయులకు మరియు విద్యా-వైద్యాలయములకు అభివృద్ధి కలుగును.

## బార్హస్పత్యమానాబ్ద ఫలము

బార్హస్పత్యమానమున ఈ సంవత్సరము ప్రభవాది 45 వది **"విరోధికృత"** నామ సంవత్సరము అగుట వలన... ప్రజలకు పరస్పర విరోధములు వచ్చును. రాజులకు యుద్ధభయములు కలుగును. ఎండలు అధికముగా ఉండును. ప్రముఖులపై విషప్రయోగములు జరుగును. పంటలు-ధరలు సామాన్యముగా ఉండును. రోడ్డు-రైలు-వాహన-వాతావరణములచే ప్రమాదములు అధికము.

## గురూదయాబ్ద ఫలము

గురూదయవశమున ఈ సంవత్సరము **"వైశాఖాబ్దము"** అగుట వలన... ప్రజలకు-ప్రభువులకు ధర్మాసక్తి కలుగును. భూమి పూర్ణమగు ఫలములను ఇచ్చును. యజ్ఞయాగాది క్రతువులు విరివిగా జరుగును.

## గ్రహణ నిర్ణయము

**సంపూర్ణ చంద్రగ్రహణము** : ది.27-07-2018 ఆషాఢ శుక్ల పూర్ణిమా శుక్రవారము కేతుగ్రస్త సంపూర్ణ చంద్రగ్రహణము సంభవమగును. దక్షిణ గోళము(చంద్రుడు). ఉత్తర శరము.

| | | | |
|---|---|---|---|
| గ్రహణ స్పర్శకాలము | : రాత్రి గం॥ 11-55 ని॥లు | IST PM | |
| గ్రహణ నిమీలన కాలము | : రాత్రి గం॥ 1-00 ని॥లు | IST AM | |
| గ్రహణ మధ్యకాలము | : రాత్రి గం॥ 1-52 ని॥లు | IST AM | |
| గ్రహణ ఉన్మీలన కాలము | : రాత్రి గం॥ 2-44 ని॥లు | IST AM | |
| గ్రహణ మోక్ష కాలము | : రాత్రి గం॥ 3-50 ని॥లు | IST AM | |
| గ్రహణ ఆద్యంత పుణ్యకాలము | : గం॥ 3-55 ని॥లు. | |  |
| బింబాదర్శన కాలము | : గం॥ 1-44 ని॥లు. | | |

**సూచన :** ఈ చంద్రగ్రహణము ఉత్తరాషాఢ మరియు శ్రవణా నక్షత్రము నందు సంభవించుట వలన ఆయా నక్షత్రముల వారు మరియు మకరరాశి నందు జన్మించిన వారు గ్రహణమును చూడరాదు. మరుదినము శివాలయము నందు శాంతి చేయించుకొనుట మంచిది.

**శాంతి విధానము :** గ్రహణ శాంతి ఆవశ్యము గలవారు వెండితో చంద్రబింబమును మరియు సర్పప్రతిమను చేయించి, రాగి లేదా కంచు పాత్రలో నెయ్యి పోసి ఆ పాత్రనందు చంద్రబింబమును మరియు నాగ ప్రతిమను ఉంచవలెను. తిల-తండూలములతో కూడిన మరొక పాత్రనందు ఈ కంచు లేదా రాగిపాత్రను ఉంచి... "మమ జన్మరాశి, జన్మనక్షత్ర, అరిష్టస్థాన గ్రహణ సంభవ సూచిత సర్వారిష్ట దోష నివారణార్థం, మమ జన్మరాశ్యాత్ ఏకాదశ స్థాన స్థిత గ్రహణ సంభవ సూచిత సర్వ శుభఫల ప్రాప్త్యర్థం ఇతి బింబదానము కరిష్యామి." అను సంకల్పముతో చంద్ర-రాహు-కేతువులను స్మరించుకుని... "తమోమయ మహాభీమ సోమ సూర్య విమర్దన హేమతారా ప్రదానేన మమ శాంతి ప్రధోభవ విధుంతుద నమస్తుభ్యం సింహికానంద నాచ్యుత దానే అనానేన నాగస్య రక్షమాం వేదజాత్భయాత్" అను మంత్రమును స్మరించి నాగప్రతిమ మరియు చంద్ర బింబముతో కూడిన రాగి లేదా కంచు పాత్రను శివాలయము నందు బ్రాహ్మణులకు దానము చేయవలెను.

**గ్రహణ గోచారము :** ఈ సంపూర్ణ చంద్రగ్రహణము ప్రభావము వలన రాబోవు మూడు నెలల లోపులో, ద్వాదశ రాశుల వారికి సంభవించు గ్రహణ ఫలితములు ఈ క్రింది విధముగా ఉండును.

1. మేషరాశి : సామాజిక-రాజకీయ-ఉద్యోగ-పదవీ లాభములు.
2. వృషభరాశి : నిరాశా-నిరుత్సాహ-సానుభూతికర సంఘటనలు.
3. మిధునరాశి : అవమానము-ప్రమాదములు-ప్రాణగండములు.
4. కర్కాటకరాశి : వైవాహిక సమస్యలు-వ్యాపార భాగస్వామ్య పేచీలు.
5. సింహరాశి : శత్రుజయము-ఆరోగ్యము-ఆనందము-అభివృద్ధి.
6. కన్యారాశి : సంతాన సమస్యలు-ఆందోళనలు-మనోరుగ్మతలు.
7. తులారాశి : వాహన,వాతావరణ ప్రమాదములు-అనారోగ్యములు.
8. వృశ్చికరాశి : ఉద్యోగ,అభీష్ట విజయములు-ఆర్థిక,అంగబలము.
9. ధనుస్సరాశి : కుటుంబ సమస్యలు-ధన,మాన హాని-ఆస్తి గొడవలు.
10. మకరరాశి : శారీరక పీడలు-పనులలో జాప్యములు-తొందరలు.
11. కుంభరాశి : అధిక ధనవ్యయ,ప్రయాసలు-అనవసర వివాదములు.
12. మీనరాశి : సన్మాన సత్కారములు-మనోవాంఛాప్రాప్త్యర్థములు.

**గమనిక** : ఈ సంవత్సరము మనకు కనిపించు సూర్య గ్రహణములు లేవు.







## శ్రీవిళంబి నామ సంవత్సరము 2018-19 వర్ష కార్తెలు - ఫలితములు

| కార్తెలు | ప్రవేశతేది | ఫలితసూచనలు |
|---|---|---|
| 1. అశ్విని | ది. 14-04-2018 | పగలు ఎండలు అధికము. వడగాల్పులు. పర్వతప్రాంత వర్షములు. దట్టమైన మేఘములు |
| 2. భరణి | ది. 27-04-2018 | ఆకస్మిక వర్షములు. ఉత్తర దిశా గాలులు. కొన్నిచోట్ల అతి భారీ వర్షములు. అల్పపీడనం. |
| 3. కృత్తిక | ది. 11-05-2018 | అగ్ని ప్రమాదములు. ఖండప్రాంత వర్షములు. పగలు ఎండలు-రాత్రిళ్ళు జల్లులుండును. |
| 4. రోహిణి | ది. 25-05-2018 | తీవ్ర ఉష్ణోగ్రతలు. స్వల్ప జల్లులు. పశు-ప్రాణ నష్టములు. అగ్ని ప్రమాదములు. గాలులు. |
| 5. మృగశిర | ది. 08-06-2018 | విచిత్ర వాతావరణము. రైతులకు నిరాశ. ఎండలు అధికము. పిడుగుపాటులు-వడగండ్లు. |
| 6. ఆరుద్ర | ది. 22-06-2018 | పర్వతప్రాంత వర్షములు. మేఘచలనములు. స్వల్పజల్లులు. పిడుగుపాటులు-వడగండ్లు. |
| 7. పునర్వసు | ది. 06-07-2018 | పగలు పొడిగా ఉండి రాత్రిళ్ళు ఆకస్మిక భారీ వర్షములు. కొన్నితావుల వరద భయములు. |
| 8. పుష్యమి | ది. 20-07-2018 | పర్వతప్రాంత వర్షములచే వరదముప్పులు. గాలి-వానలు. కొన్నిచోట్ల అతి లేదా అనావృష్టి. |
| 9. ఆశ్లేష | ది. 03-08-2018 | గాలులతో కూడిన మేఘములు. చాలా ప్రాంతములందు అనావృష్టి. రైతులకు నిరాశ. |
| 10. మఖ | ది. 17-08-2018 | ఖండప్రాంత మరియు అటవీప్రాంత వర్షములు. మొత్తము మీద సామాన్య వర్షపాతము. |
| 11. పుబ్బ | ది. 30-08-2018 | ప్రతికూల వాతావరణము. పర్వతప్రాంత వర్షములు-వరదముప్పులు. పగటి ఉష్ణోగ్రతలు. |
| 12. ఉత్తర | ది. 13-09-2018 | వాతావరణములో ఆకస్మిక మార్పులు. పశ్చిమ గాలులు. దట్టమైన మేఘాలు. స్వల్పవృష్టి. |
| 13. హస్త | ది. 27-09-2018 | కొన్ని తావుల వృష్టి. మరికొన్ని తావుల అనావృష్టి పిడుగులు-వడగండ్లు. పంట నష్టములు. |
| 14. చిత్త | ది. 10-10-2018 | అనావృష్టి భూకంపాది ప్రకృతి విపత్తులు. అగ్ని ప్రమాదములు. విచిత్రమైన వాతావరణము |
| 15. స్వాతి | ది. 24-10-2018 | చాలాచోట్ల భారీ వర్షములు కురియును. తూర్పుదిశా గాలులు వీచును. చెట్లు కూలును. |
| 16. విశాఖ | ది. 06-11-2018 | ఖండప్రాంతపు వర్షములు. సామాన్య వాతావరణము. ప్రకృతి విపత్తులు. భారీ గాలులు. |
| 17. అనురాధ | ది. 19-11-2018 | పెనుగాలులు. వడగండ్ల వర్షములు. పంట నష్టములు. కొన్ని తావుల భూప్రకంపనలు. |
| 18. జ్యేష్ఠ | ది. 03-12-2018 | ఖండప్రాంతపు జల్లులు. దట్టమైన మేఘచలనములు. చలిగాలులు వీచును. తుషార వృష్టి. |

ఈ సంవత్సరము రవి రాజగుట వలన పాలకులకు నియంతృత్వ పోకడలు.



## నవనాయక ఫలములు

**1.రాజు-రవి :** రాచరిక గ్రహము రాజగుట వలన పరిపాలన సమర్ధవంతముగా సాగిననూ ప్రజలకు రాజభయము కలుగును. చోరాగ్ని, యుద్ధ భయములు ఉంటాయి. దేశఖ్యాతి ఇనుమడించును. పరిపాలనలో నియంతృత్వ పోకడలు ఉండును. గోధుమలు-కొబ్బరి-బంగారము-సుగంధ ద్రవ్యములకు వెలలు పెరుగును. ప్రభువులకు ప్రమాదములు జరుగును.

**2.మంత్రి-శని :** సేవకా గ్రహము మంత్రి అగుట వలన మంత్రులు ప్రభువునకు ఊడిగము చేయుదురు. మంత్రులకు పరిపాలనా దక్షత కొఱవడును. ప్రజలకు మేలు కంటే కీడు అధికమగును. పంటలకు క్రిమి-కీటకాది బాధలు కలుగును. మంత్రులకు ప్రమాదములు జరుగును. వివిధ అభియోగములచే మంత్రులకు శిక్షలు పడును. ఇనుము-నూనె-బొగ్గు-మత్తు పదార్థములు-మాంసాదులకు ధరలు అధికమగును.

**3.సేనాధిపతి-శుక్ర :** దేశ సైన్యము వృద్ధి అగును. సైనిక సంక్షేమ కార్యక్రమములు జరుగును. సైనిక-పోలీస్-రక్షణ వ్యవస్థలలో స్త్రీల ప్రాముఖ్యత పెరుగును. స్త్రీ-పురుషులు కామకేళీ విలాసాదులలో మునుగుదురు. మహిళా సంఘాలకు, ప్రాధాన్యత పెరుగును. విలాస వస్తువులకు ధరలు పెరుగును. అధికారులు విందు-వినోద-విలాసాదులలో ఉన్మత్తులగుదురు.

**4.సస్యాధిపతి-కుజ :** సస్యానుకూల వర్షములు కురియును. కుందులు-శనగలు-మిర్చి-దుంపజాతులు బాగుగా ఫలించును. ఎఱ్ఱని నేలలు-ఎఱుపు విత్తనములు ఫలవంతమగును. పగడముల ధరలు పెరుగును. నీటి సంబంధిత రుగ్మతలు ఎక్కువగును. గజములు- అశ్వములు-గోవులు-గార్ధభములు-ఒంటెలు మొదలగు జంతువులకు మంచి కాలము. నూతన సస్య పరికరములు-యంత్రములు వృద్ధియగును.

**5.ధాన్యాధిపతి-రవి :** మొదటి పంట కంటే రెండవ పంట అంతగా యోగించదు. ఎఱ్ఱని భూములు-ఎఱుపు జాతులు వృద్ధి యగును. ప్రత్తి-ఆవాలు-కుంకుళ్ళు-గోధుమలు-అరటి-ఉల్లి-కుసుమలు-మిరియములు చక్కగా పండును. మధ్యమ వర్షములు కురియును. అపరాలకు ధరలు పెరిగిననూ రైతులకు గిట్టుబాటు కాదు.

**6.అర్ఘ్యాధిపతి-శుక్ర :** తెల్లని ధాన్యములు-వస్త్రములు-విలాస వస్తువులు-కాస్మోటిక్స్-సెంట్లు-సబ్బులు-చింతపండు-తేనె-వెన్న-మత్తు పానీయములు భూషణ వస్తువులకు మంచి ధరలు పలుకును. అలసందలు-మామిడి-నిమ్మ ద్రాక్ష-దాడిమ మొదలగు ఫలజాతులు వృద్ధియగును. సస్యానుకూల వర్షములు ఉండును. ద్విజులకు మంగళకరమగును.

**7.మేఘాధిపతి-శుక్ర :** చక్కని వర్షములు కురియును. తృణ-క్షీర



సంక్రాంతి పురుషుని వలన శుభాశుభములు తెలియవచ్చును.



సమృద్ధి కలుగును. ఆంధ్రప్రదేశ్-తమిళనాడు-ఒరిస్సా రాష్ట్రములలో అధిక వర్షపాతము ఉండును. వాయువ్య ప్రాంతములకు నష్టములు కలుగును. అనుకూల వాతావరణము. ప్రజా-పశు-పక్ష్యాదులకు మేలుగా ఉండును.

**8.రసాధిపతి-బుధ :** మాదీఫలములు-జాజికాయ-మాలతీ,జాజి పుష్పములు-కర్పూరము-గుగ్గిలము-అగరు-బెల్లము-చెఱకు-ఏలకులు-మరాఠీ మొగ్గలు-సుగంధ ద్రవ్యములు-రంగులు-పేపరు-వెదురు జాతులు- కుడ్య చిత్రములకు మంచి ధరలు పలుకును.

**9.నీరసాధిపతి-చంద్ర :** సువర్ణ, రజిత వస్తువులకు-ముత్యములకు-రత్నములకు వృద్ధిగా ఉండును. వస్త్ర-వస్త్ర-భూషణాది ధరలు ప్రియముగా ఉండును. దేశములో సెక్స్ సామర్ధ్యమును పెంచు మందులు అధికమగును. యువతీ-యువకులు వివాహము కాకుండా తరచూ రహస్య రతీ కార్యకలాపములలో మునిగి తేలుదురు.

## సంక్రాంతి పురుషుడు - "ధ్వాంక్ష" నామధేయుడు



ది. 14-01-2019 శ్రీ **"విళంబి"** నామ సంవత్సర పుష్యమాస శుక్ల పక్ష అష్టమి సోమవారము అశ్విని నక్షత్ర, సిద్ధ యోగ, బవ కరణ యుక్త కన్యా లగ్నము నందు రాత్రి గం॥ 10-30 ని॥లకు **"ధ్వాంక్ష"** నామధేయుడైన **సంక్రాంతి పురుషుడు** (శ్రీ సూర్యభగవానుడు) **సింహ** వాహనారూఢుడై **మకర రాశి** ప్రవేశము చేయును.

**"ధ్వాంక్ష"** నామము వలన వైశ్యులకు హాని. **చందన** స్నానముచే సుభిక్షము. **శ్వేత** వస్త్ర ధారణచే ఆరోగ్యము. **కస్తూరి** గంధ లేపనముచే పుణ్యాస్త్రీలకు అరిష్టము. **సువర్ణ** పాత్రలో భుజించుటచే దుర్భిక్షము. **కొబ్బరి కాయ** తినుట వలన ధరలు పెరుగును. **అన్నము** భుజించుటచే కరువు. **సింహ** వాహనము నెక్కుటచే మహాభయము. **కూర్చుని** ఉండుట వలన మధ్యమ ధరలు. **చిరు** నగుమోముచే సర్వశుభము. **తెల్లని** గొడుగు ధరించుటచే ఆరోగ్యము. **పొన్న** పుష్ప ధారణచే కీర్తిహాని. **మాణిక్య** రత్నధారణచే రత్న నాశనములు. **భిశుండి** ఆయుధ ధారణచే ఆకలి బాధలు. **తూర్పు** దిశా గమనముచే తూర్పు దిశా ప్రాంతీయులకు అరిష్టము.

**శుక్ల పక్షము**లో వచ్చుటచే క్షామము. **అష్టమి** తిథిచే అల్పవృష్టి. **సోమ వారము** ప్రవేశమగుటచే సుభిక్షము. **అశ్విని** నక్షత్రము వలన సువృష్టి. **సిద్ధ యోగము**చే శుభదాయకము. **బవ కరణము**చే అధిక ధరలు. **కన్యా లగ్నము**చే స్త్రీ చింత. **రాత్రి** ప్రవేశముచే కరువు-కాటకములు.

**ఈ మకర సంక్రమణ ఉత్తరాయణ పుణ్యకాలమందు ప్రజలు తమ యథాశక్తి నవధాన్యములు, కూష్మాండాది సువర్ణ దానములు, అన్నదానములు, గోదానములు చేసిన ఎడల దోష ఫలముల తీవ్రత నశించి సకల జనులకు శుభము జరుగును.**

## ద్వాదశ రాశులకు ఆదాయ-వ్యయాదులు

| రాశులు | రాబడి | పోబడి | రాశులు | కీర్తి | అపకీర్తి |
|---|---|---|---|---|---|
| మేషరాశి | 2 | 14 | మేషరాశి | 5 | 7 |
| వృషభరాశి | 11 | 5 | వృషభరాశి | 1 | 3 |
| మిధునరాశి | 14 | 2 | మిధునరాశి | 4 | 3 |
| కర్కాటకరాశి | 8 | 2 | కర్కాటకరాశి | 7 | 3 |
| సింహరాశి | 11 | 11 | సింహరాశి | 3 | 6 |
| కన్యారాశి | 14 | 2 | కన్యారాశి | 6 | 6 |
| తులారాశి | 11 | 5 | తులారాశి | 2 | 2 |
| వృశ్చికరాశి | 2 | 14 | వృశ్చికరాశి | 5 | 2 |
| ధనుస్సురాశి | 5 | 5 | ధనుస్సురాశి | 1 | 5 |
| మకరరాశి | 8 | 14 | మకరరాశి | 4 | 5 |
| కుంభరాశి | 8 | 14 | కుంభరాశి | 7 | 5 |
| మీనరాశి | 5 | 5 | మీనరాశి | 3 | 1 |

**సర్వ ఆదాయము = 99, సర్వ వ్యయము = 93, దేశ కీర్తి = 48, దేశ అపకీర్తి = 48**

## కందాయ ఫలములు

| నక్షత్రము | ప్రథమ | ద్వితీయ | తృతీయ | నక్షత్రము | ప్రథమ | ద్వితీయ | తృతీయ |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 0 | 1 | 2 | స్వాతి | 2 | 0 | 4 |
| భరణి | 3 | 2 | 0 | విశాఖ | 5 | 1 | 2 |
| కృత్తిక | 6 | 0 | 3 | అనురాధ | 0 | 2 | 0 |
| రోహిణి | 1 | 1 | 1 | జ్యేష్ఠ | 3 | 0 | 3 |
| మృగశిర | 4 | 2 | 4 | మూల | 6 | 1 | 1 |
| ఆరుద్ర | 7 | 0 | 2 | పూర్వాషాఢ | 1 | 2 | 4 |
| పునర్వసు | 2 | 1 | 0 | ఉత్తరాషాఢ | 4 | 0 | 2 |
| పుష్యమి | 5 | 2 | 3 | శ్రవణము | 7 | 1 | 0 |
| ఆశ్లేష | 0 | 0 | 1 | ధనిష్ఠ | 2 | 2 | 3 |
| మఖ | 3 | 1 | 4 | శతభిషము | 5 | 0 | 1 |
| పుబ్బ | 6 | 2 | 2 | పూర్వాభాద్ర | 0 | 1 | 4 |
| ఉత్తర | 1 | 0 | 0 | ఉత్తరాభాద్ర | 3 | 2 | 2 |
| హస్త | 4 | 1 | 3 | రేవతి | 6 | 0 | 0 |
| చిత్త | 7 | 2 | 1 | - | - | - | - |

**సూచన :** ఒక్కొక్క కందాయము సంవత్సరాది లగాయతు నాలుగు మాసములు ఉండును. ఇందలి బేసిసంఖ్యలు ధనలాభమును, సరిసంఖ్యలు సమఫలమును, సున్న శూన్యఫలమును ఇచ్చును.





## శ్రీ విళంబి లో ఆంధ్రప్రదేశ్ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | శుక్ర 17° కేతు 02° | రవి 23° | బుధ(వ) 09° గురు 28° |
| లగ్నము 12° | నవ్యాంధ్రప్రదేశ్ ఆవిర్భావ కుండలి 8-06-2014 ఆదివారము గం॥ 00.00 అమరావతి | | |
| | | | |
| | | రాహు 02° శని(వ) 24° | చంద్ర 14° కుజ 17° |

| | | | |
|---|---|---|---|
| రవి 03° చంద్ర 03° బుధ 21° శుక్ర 19° | | | |
| | వర్షలగ్నకుండలి 17-03-2018 శనివారము సాయంత్రము 6-41 అమరావతి | | రాహు 19° |
| కేతు 19° | | | |
| కుజ 06° శని 14° | | గురు(వ) 29° | లగ్నము 09° |

వర్తమానమున ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునకు చంద్రమహాదశ నడుస్తున్నది. ఇందు మే నెల వరకు బుధ భుక్తి, తదుపరి కేతు భుక్తి నడుచును. బుధుడు పంచమ-అష్టమాధిపతిగా రాహు నక్షత్రములో శుక్ర కక్ష్యనందు సంచరించుట వలన... రాష్ట్రములో సానుభూతికర సంఘటనలు చోటుచేసుకొనును. రాజకీయ అనిశ్చితి-ప్రకృతి విపత్తులు ఉండును. జూన్ నెల నుండి కేతు భుక్తి ప్రారంభమగుటచే రాష్ట్ర పరిస్థితులు ఆశాజనకముగా ఉండవు.

వర్తమానమున టి.డి.పి ప్రభుత్వమునకు పంచవర్ష దశావిభాగమును అనుసరించి ఈ సంవత్సరము సెప్టెంబర్ నెల వరకు శుక్ర దశయు, తదుపరి డిసెంబర్ వరకు రవి దశయు, ఆ తదుపరి చంద్ర దశయు నడుచును. షష్ఠ-లాభాధిపతి అయిన శుక్రుడు భరణి నక్షత్రములో కేతు కక్ష్యనందు 5దింట సంచరించుట వలన...మంత్రులకు-పాలకునికి గండములు కలుగును. భరణి నక్షత్ర జాతకుడైన నారా లోకేష్ వలన ప్రభుత్వమునకు చెడ్డ పేరు వచ్చును. లేదా అతనికి విపత్తులు కలుగును. రవి దశలో ప్రభుత్వము బలపడును. చంద్ర దశలో కీలకమైన మార్పులు రాజకీయ అనిశ్చితలు చోటుచేసుకొనును. ప్రభుత్వములో కీలక వ్యక్తికి ముప్పు కల్గును.

నవ్యాంధ్రప్రదేశ్ లగ్నమునకు వర్షకుండలి లగ్నము 8వది అగుటయు, జన్మలగ్నాధిపతి వర్షకుండలిలో కుజునితో కలసి 4గింట ఉన్నాడు. జన్మ లగ్న-లగ్నాధిపతుల యొక్క కక్ష్యాధిపతులు ఇరువురు కలసి వర్షలగ్నకుండలి నందు 7వ భావములో ఉన్నారు. వర్షకుండలినందు లగ్నాధిపతి మరియు లగ్న-లగ్నాధిపతుల యొక్క కక్ష్యాధిపతులు ముప్పురు కలసి లగ్నాత్తు 7డింట ఉన్నారు. లగ్నముపై రాహు-కేతువుల నాడీ దృష్టి ఉంది. ఈ విధమైన గ్రహసంచారమును సూక్ష్మపరిశీలన చేయగా...ఈ సంవత్సరము ఆంధ్ర

ప్రదేశ్‌కు ప్రతికూల కాలము. విపత్కర మరియు సానుభూతి ఘటనలు ఉంటాయి. రైతులకు-ప్రజలకు-పంటలకు నష్టములు వాటిల్లును. ఏప్రిల్ లేదా డిసెంబర్ నెలలో ఘోరమైన రోడ్డు-రైలు లేదా అగ్ని ప్రమాదము వలన ఆస్తి-ప్రాణ నష్టములు ఉండును. టూరిజం మరియు కళారంగము నందు అభివృద్ధి ఉండును. ప్రజలపై పన్నుల భారము పడును. నిత్యావసర వస్తుధరలు ఆకాశాన్నంటును. ప్రభుత్వ పనితీరు నిరాశాజనకముగా ఉండును. చాలాచోట్ల కరువు తాండవించును. వివిధ రకాల అంటువ్యాధులచే జన-పశు-పక్ష్యాదులకు ముప్పు వాటిల్లును. వేసవి కాలము నందు అత్యధిక ఉష్ణోగ్రతలు-వడగాల్పులచే రికార్డు స్థాయిలో ప్రాణ నష్టములు ఉండును.

ధన-లాభాధిపతి అయిన గురుడు శనికక్ష్యలో ఉన్నాడు. అట్టి శని వర్ష లగ్నకుండలి నందు 4గింట కుజునితో కలసి శుక్ర కక్ష్యలో సంచరించుట వలన...ఆర్థిక పరిస్థితులు బాగుండవు. నూతన ఆర్థిక మరియు భూ సంస్కరణలచే ప్రజలు ఇబ్బందులు. భూమి ధరలు-రిజిస్ట్రేషన్ ఖర్చులు పెరుగును. డిసెంబర్ నెల నుండి రూ. 2000 నోట్లు రద్దయ్యే అవకాశముంది

తృతీయ రాజ్యాధిపతి అయిన కుజుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి కుజుడు వర్షకుండలి నందు 4గింట శనిలో కలసి శని కక్ష్యలో సంచరించుట వలన...విజయనగరం-విశాఖ-పశ్చిమగోదావరి జిల్లాలలో ఘోరమైన రోడ్డు-రైలు లేదా జల ప్రమాదములు ఉండును. ప్రజా ఉద్యమములు చెలరేగి హింసాత్మక ఘటనలు చోటు చేసుకొనును. రవాణా-కమ్యూనికేషన్ ఛార్జీలు పెరుగును. ముఖ్యమంత్రి గారికి గండకాలము.

చతుర్థ-భాగ్యాధిపతి అయిన శుక్రుడు కేతు కక్ష్యలో ఉన్నాడు. అట్టి కేతువు వర్షలగ్న కుండలి నందు 5దింట చంద్ర కక్ష్యలో సంచరించుట వలన...ప్రకృతి విపత్తులు-మతపరమైన ఆందోళనలు ఉండును. కొన్నిచోట్ల అతివృష్ఠి, మరికొన్ని చోట్ల అనావృష్ఠి కలుగును. కొన్నితావుల భూమి కంపించును. విమాన ప్రమాదములో ప్రముఖ స్త్రీ లేదా కళాకారిణి మరణించును.

పంచమ-అష్టమాధిపతి అయిన బుధుడు శుక్ర కక్ష్యలో ఉన్నాడు. అట్టి శుక్రుడు వర్షలగ్న కుండలి నందు 7డింట, రవి-చంద్ర-బుధులతో కలసి సూర్య కక్ష్యలో సంచరించుట వలన...చలనచిత్ర కళాకారులకు విమాన ప్రమాదములు. కళాకారులు రాజకీయరంగ ప్రవేశము చేయుదురు. నూతన విద్యా సంస్కరణలు అమలగును. విద్యార్థులకు జలగండములు ఉండను. నూతన విద్యాసంస్థలు అధికమగును. మరణాల రేటు ఎక్కువగును.

షష్ఠాధిపతి అయిన చంద్రుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి చంద్రుడు వర్షలగ్నకుండలి నందు, 7డింట రవి-బుధ-శుక్రులతో కలసి గురు కక్ష్యలో





సంచరించుట వలన...రక్షణ వ్యవస్థ మరియు గూఢచర్య వ్యవస్థలు బలపడినను చాలామంది రక్షక భటులకు-అధికారులకు ప్రమాదములు పొంచి ఉన్నవి. ఎయిడ్స్ రోగుల సంఖ్య అధికమగును.

సప్తమాధిపతి అయిన సూర్యుడు శని కక్ష్యలో ఉన్నాడు. అట్టి శని వర్ష లగ్న కుండలి నందు 4గింట కుజునితో కలసి శుక్ర కక్ష్యలో సంచరించుట వలన...కళాకారులకు గుర్తింపు కలుగును. బహుభార్యత్వ కేసులు అధికమగును. పొరుగు రాష్ట్రముతో జల వివాదములు పరిష్కారము కావు.

**2018 మార్చ్ :** ఎండల తీవ్రత పెరుగును. శని-కుజుల సమాగము వలన ఉష్ణోగ్రతలు తీవ్రమగును. కుజ-రాహు-కేతువుల మధ్య నాడీ దృష్ఠి వలన అగ్ని-వాహన-జల ప్రమాదములచే ప్రాణనష్టములు. విపత్తుల యందు ప్రభుత్వము సత్వర చర్యలు చేపట్టును. ప్రతిపక్షానికి యోగించును.

**ఏప్రిల్ :** రాష్ట్ర సాధారణ పరిస్థితులు ఆందోళన కలిగించును. ప్రభుత్వ వ్యతిరేకత అధికమగును. సమ్మెలు-స్ట్రయిక్‌లు-రాస్తారోకోలు జరుగును. అధిక ఉష్ణోగ్రతలచే పశు-ప్రాణ నష్టములుండును. ఘోరమైన అగ్ని లేదా వాహన ప్రమాదములు జరుగును. అంటువ్యాధులు ప్రబలులను.

**మే :** విద్యాసంస్థలలో అవకతవకలు. విద్యార్థులకు ప్రమాదములు. బస్సు ప్రమాదములు. పాలకునికి లేదా మంత్రులకు ప్రమాదములు. సానుభూతి కర సంఘటనలు. వాతావరణములో ఉష్ణ ప్రభావములో మార్పు లేదు. కొన్నితావుల తీవ్ర నీటి ఎద్దడిచే జన-పశు-పక్ష్యాది ప్రాణ నష్టములు.

**జూన్ :** వాతావరణములో మార్పులు రైతులకు అనుకూలించును. చాలా ప్రాంతములందు గాలులతో కూడిన వర్షములు ఉంటాయి. ప్రభుత్వమునకు ఆదాయము పెరుగును. హైకోర్టు తీర్పు సంచలనము కలిగించును. విదేశీ ప్రముఖులు రాష్ట్ర సందర్శనము చేయుదురు. ఆర్థిక సంస్కరణలు.

**జూలై :** ప్రతికూల వాతావరణము. ఒక ప్రముఖ నాయకుని మరణము సంచలనము కలిగించును. ప్రజలలో వర్గ పోరాటములు ప్రబలును. గనుల యందు, నదుల యందు ప్రమాదములు సంభవించును. రైతులకు నష్టములు కలుగును. రద్దీగల ప్రదేశముల నందు ప్రమాదములు జరుగను.

**ఆగస్ట్ :** ప్రభుత్వమునకు అనుకూల కాలము. నూతన సంస్కరణలు చేపడుదురు. రాజకీయ పార్టీలు ఎన్నికల వాగ్దానములతో ప్రజలను ప్రలోభ పెట్టెదరు. సామాన్య వర్షపాతము ఉంటుంది. కొన్నితావుల అతివృష్ఠి, మరి కొన్నితావుల అనావృష్ఠి ఉండును. ప్రముఖులకు అనారోగ్య సమస్యలు.

**సెప్టెంబర్ :** గాలులతో కూడిన వర్షములు కురియును. తుఫాన్ సంభవమగు సూచన. పారిశ్రామిక వేత్తలకు నష్టములు వచ్చును. నిత్యావసర

పశ్చిమగోదావరి, విశాఖ, విజయనగరం, నెల్లూరు జిల్లాలకు అరిష్టము.



వస్తువులు, కూరగాయల ధరలు ఆకాశాన్నంటును. కమ్యూనికేషన్ వ్యవస్థలకు వాతావరణ అంతరాయములు. పశ్చిమ గోదావరి జిల్లాకు దుర్యోగము.

**అక్టోబర్ :** ప్రముఖుల ఇంట వైవాహిక సమస్యలు రచ్చకెక్కును. విదేశాలలో పనిచేయు వారిపై ప్రభుత్వము శ్రద్ధ పెట్టవలసి ఉండును. ప్రతికూల వాతావరణము. వాతావరణములో చలితీవ్రత పెరుగును. తూర్పుగాలులు వీచును. మరణాల రేటు పెరుగును. ఇనుప వస్తువుల ధరలు పెరుగును.

**నవంబర్ :** ప్రభుత్వము ఆర్థికాభివృద్ధిలో పయనించును. రాబోవు ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని ప్రజాసంక్షేమ పథకములను వెల్లడించును. కొన్నితావుల తుఫాన్ లేదా వరద ప్రమాదములు సంభవమగును. మరికొన్ని తావుల భూమి స్వల్పముగా కంపించును. ప్రయాణాలలో దోపిడీలు.

**డిసెంబర్ :** నిత్యావసర వస్తు ధరలు భారీగా పెరుగును. చలిగాలులు తీవ్రమగును. దట్టమైన పొగమంచుచే ప్రమాదములు ఉండును. పొరుగు రాష్ట్రములతో చర్చలు ఫలవంతమగును. నూతన ప్రచార-ప్రసార మాధ్యములు పుట్టును. వివిధ పార్టీల రాజకీయ నాయకుల కప్పదాట్లు ఉండును.

**2019 జనవరి :** వాతావరణములో ఆకస్మిక మార్పులు అల్పపీడనము లేదా తుఫాన్‌కు దారి తీయవచ్చు. రాజకీయముగా తల పండిన పెద్దలకు యోగించును. రైతులకు పశువులపై ఋణ సదుపాయములు చేకూరును. ఘోరమైన రైలు లేదా రోడ్డు ప్రమాదము విస్మయమును కలిగించును.

**ఫిబ్రవరి :** రాష్ట్రములో ఎన్నికల వేడి ప్రారంభమగును. ప్రముఖ వ్యక్తి ఒకరు మరణించును. యజ్ఞయాగాది క్రతువులు విరివిగా జరుగును. పాలధరలు పెరుగును. మీడియా రంగము వారికి సమస్యలు ఉత్పన్నమగును. అనుకూల వాతావరణముచే మెట్ట పంటలకు మేలు జరుగును.

**మార్చ్ :** రాష్ట్ర సాధారణ పరిస్థితులు అనుకూలము. నిత్యావసర వస్తు ధరలు ప్రజలకు అందుబాటులో ఉండును. ప్రజలకు ఆదాయము వృద్ధియగును. పాడి-పంట-పరిశ్రమలు అభివృద్ధి గాంచును. సినిమా రంగము వారికి యోగించును. నూతన చలనచిత్రమొకటి సంచలనము కలిగించును.

**ఏప్రిల్ :** రాష్ట్ర సాధారణ పరిస్థితులు ఆందోళన కలిగించును. వర్గపోరాటములు-ప్రముఖుల ఆకస్మిక మరణములు విస్మయమును కలిగించును. బహిరంగ దాడులు జరుగును. ప్రకృతి విపత్తులు సంభవమగును. నాయకుల కిడ్నాప్‌లు విభ్రాంతిని కలగించును. అవాంఛనీయ ఘటనలుండును.



ఈ సంవత్సరము తెలంగాణా నందు క్షామ పరిస్థితులు అధికము.



# శ్రీ విళంబి లో తెలంగాణ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | శుక్ర 11° కేతు 02° | రవి 18° | బుధ 08° గురు 26° |
| లగ్నము 06° | తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ కుండలి 2-06-2014 | | చంద్ర 02° |
| | సోమవారము గం॥ 00.00 హైదరాబాద్ | | |
| | | రాహు 02° శని(వ) 24° | కుజ 16° |

| | | | |
|---|---|---|---|
| రవి 03° చంద్ర 03° బుధ 21° శుక్ర 19° | | | |
| | వర్షలగ్నకుండలి 17-03-2018 | | రాహు 19° |
| కేతు 19° | శనివారము సాయంత్రము 6-41 హైదరాబాద్ | | |
| కుజ 06° శని 14° | | గురు(వ) 29° | లగ్నము 07° |

వర్తమానమున తెలంగాణా రాష్ట్రమునకు శని మహాదశలో శని భుక్తి నడుస్తున్నది. ఈ శని భుక్తి ఈ సంవత్సరము సెప్టెంబర్ వరకు నడుచును. తదుపరి బుధ భుక్తి ప్రారంభమగును. శని భుక్తి నందు రాష్ట్రాభివృద్ధి మందగించును. ప్రజా సంక్షేమ పథకములు, నిధుల కొఱతతో ముందుకు సాగవు. పాలకునికి లేదా ప్రముఖ మంత్రికి అనారోగ్యము లేదా ప్రమాదములు కలుగును. బుధ భుక్తిలో కొంత ఆశాజనకముగా ఉండును. అక్టోబర్ నుండి ప్రభుత్వ పనులకు అంతరాయములు తొలగి సంక్షేమ పథకములు ముందుకు నడుచును. అయితే ఈ సమయముతో ప్రభుత్వము కోర్టు వ్యవహారములను ఎదుర్కొనవలసి ఉంటుంది.

వర్తమానమున టి.ఆర్.ఎస్ ప్రభుత్వమునకు పంచవర్ష దశా విభాగములో ఈ సంవత్సరము జూలై వరకు రాహు దశ నడుచును. తదుపరి గురు దశ ప్రారంభమగును. రాహుదశ నందు అనగా జూలై లోపు ప్రభుత్వ వ్యతిరేకత అధికముగా ఉంటుంది. హోమ్‌మినిస్టర్ గారికి ప్రమాదము. అధినేతకు అనారోగ్యము. వాతావరణ నష్టములు ఉండును. తదుపరి వచ్చు గురుదశ మంచి ఫలితములు ఇచ్చును. ప్రభుత్వ కీర్తి పెరుగును.

తెలంగాణా జన్మలగ్నమునకు వర్షకుండలి లగ్నము 8వది అగుటయు, జన్మలగ్న-వ్యయాధిపతి అయిన శని వర్షకుండలిలో కుజునితో కలసి 4గింట శుక్రకక్ష్యలో సంచరిస్తున్నాడు. జన్మలగ్న కక్ష్యాధిపతి అయిన బుధుడు వర్షకుండలి నందు 7డింట రవి-చంద్ర-శుక్ర గ్రహములతో కలసి చంద్ర కక్ష్యలో సంచరించుట వలన...ఈ సంవత్సరము తెలంగాణా రాష్ట్ర పరిస్థితులు ఆందోళన కలిగించును. క్షామ పరిస్థితులు-రైతు సమస్యలు పరిష్కా

అధికార ప్రభుత్వమునకు ప్రజావ్యతిరేకత అధికమగు సూచన.



రమగుట కష్టము. రోడ్డు-రైలు-జల ప్రమాదములు సంభవమగును. ప్రభుత్వ వ్యతిరేకత పెరుగును. ప్రజలకు నూతన అనారోగ్యములు వచ్చును.

ధన-లాభాధిపతి అయిన గురుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి గురుడు వర్షలగ్న కుండలి నందు 3డింట కేతు కక్ష్యలో వక్ర సంచారము చేయుటచే... రాష్ట్ర ఆదాయము అనుకున్నంతగా పెరగదు. రాష్ట్రములో పెట్టుబడులకు ఆటంకములు. శాసన సభ్యులకు ప్రమాదములు ఉండును.

తృతీయ-రాజ్యాధిపతి అయిన కుజుడు చంద్ర కక్ష్యలో ఉన్నాడు. అట్టి చంద్రుడు వర్షలగ్నకుండలి నందు 7డింట రవి-బుధ-శుక్రులతో కలసి గురు కక్ష్యలో సంచరించుట వలన...జల ప్రమాదములు జరుగును. పాలకు లకు అనారోగ్యము కలుగును. నూతన రాజకీయ పార్టీలు లేదా రాజకీయ సమాఖ్యలు ఏర్పడును.

చతుర్థ-భాగ్యాధిపతి అయిన శుక్రుడు శని కక్ష్యలో ఉన్నాడు. అట్టి శని వర్షలగ్న కుండలి నందు 4గింట కుజునితో కలసి శుక్ర కక్ష్యలో సంచరించుట వలన...రైతులకు-ప్రభుత్వ పరముగా మేలు జరిగిననూ ప్రకృతి విపత్తులచే పంట నష్టములు ఉండును. గనుల యందు ప్రమాదములు జరుగును. వేసవి ఉష్ణోగ్రతలు రికార్డు స్థాయిలో ఉండి, నీటి యెద్దడిచే ప్రజలు-ప్రాణులు ఇక్కట్లు పడుదురు. పరిశ్రమలలో అగ్నిప్రమాదములు జరుగును. రియల్ ఎస్టేట్ రంగము కొంత పుంజుకొనును.

పంచమ-అష్టమాధిపతి అయిన బుధుడు, శుక్ర కక్ష్యలో ఉన్నాడు. అట్టి శుక్రుడు వర్షలగ్నకుండలి నందు 7డింట రవి-చంద్ర-బుధులతో కలసి సూర్య కక్ష్యలో సంచరించుట వలన...ప్రముఖ మంత్రికి గండము కలుగును. మరణాల రేటు పెరుగును. చలనచిత్ర పరిశ్రమకు రాయితీలు-ప్రోత్సాహ కాలు లభించును. ప్రముఖుల వివాహాది కార్యక్రమములలో అపశృతులు జరుగును. వివిధ ఘటనలచే విద్యార్థులకు ప్రమాదములు జరుగును. క్రీడా కారులకు అంతర్జాతీయ గుర్తింపు వచ్చును.

షష్ఠాధిపతి అయిన చంద్రుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి చంద్రుడు వర్షకుండలి నందు 7డింట రవి-బుధ-శుక్రులతో కలసి గురు కక్ష్యలో సంచరించుట వలన...విదేశీ ఋణ సదుపాయములు చేకూరును. రక్షణ వ్యవస్థ పటిష్టముగా ఉన్ననూ పోలీసులకు ప్రమాదములు పొంచి ఉన్నవి. ప్రజలకు ఉదర-కిడ్నీ-సుఖరోగ సంబంధిత రుగ్మతలు ఎక్కువగును.

సప్తమాధిపతి అయిన సూర్యుడు గురు కక్ష్యలో ఉన్నాడు. అట్టి గురుడు



రాష్ట్రాభివృద్ధి మందగించును. పెట్టుబడులకు అంతరాయములు.



వర్షలగ్నకుండలి నందు 3డింట కేతుకక్ష్యలో సంచరించుట వలన...ప్రభుత్వము సామూహిక వివాహములు ప్రోత్సహించును. ప్రముఖుల ఇంట శుభ సంఘటనలు జరుగును. విమాన-రోడ్డు ప్రమాదములలో ప్రముఖులు ఇరుక్కొందురు. విదేశీ దౌత్యములు మందగించును.

**2018 మార్చ్ :** రాష్ట్ర సాధారణ పరిస్థితులు ఆందోళన కలిగించును. చోరాగ్ని భయములు కలుగును. ప్రభుత్వ కార్యాలయము లందు అగ్ని ప్రమాదములు. కొన్నితావుల ఆకస్మిక వర్షసూచనలు. వడగండ్లు పడును. పగటి ఉష్ణోగ్రతలు పెరుగును. రాష్ట్ర ఆర్థిక పరిస్థితులు ప్రతికూలము.

**ఏప్రిల్ :** నూతన సంస్కరణలు-సంక్షేమ పథకములు అమలు జరుగును. పండితులకు-కళాకారులకు సన్మాన-సత్కారములు. అనుకూల వాతావరణము రైతులకు మేలు చేయును. కొన్నితావుల వర్షములు పడును. పొరుగు రాష్ట్రములతో లేదా విదేశములతో దౌత్యములు ఫలించును.

**మే :** అధిక ఉష్ణోగ్రతలచే ప్రాణ నష్టములు. అవాంఛనీయ సంఘటనలు జరుగును. ప్రకృతి విపత్తులకు అవకాశముంది. ప్రముఖ వ్యక్తి మరణించును. సానుభూతికర సంఘటనలు చోటుచేసుకొనును. రాష్ట్ర సాధారణ పరిస్థితులు తీవ్ర ఆందోళన కలిగించును. అంటువ్యాధులు ప్రబలును.

**జూన్ :** ప్రముఖుల ఇంట శుభకార్యములు జరుగును. వాతావరణములో ఆకస్మిక మార్పులు చోటుచేసుకొనును. ఉత్తర లేదా దక్షిణ దిశ నుండి బలమైన గాలులు వీచును. కొన్నితావుల పిడుగులుతో కూడిన వర్షములు కురియును. వివిధ ఘటనలచే మరణాల రేటు అధికమగును.

**జూలై :** ప్రభువుకు అస్వస్థత కలుగును. రాజకీయ అనిశ్చితి చోటుచేసుకొనును. యజ్ఞ-యాగాది క్రతువులు జరుగును. రాష్ట్ర సాధారణ పరిస్థితులు అనుకూలించును. క్రీడాకారులకు యోగించును. రాష్ట్ర ఆదాయము పెరుగును. చలనచిత్ర ప్రముఖులకు-కళాకారులకు అనుకూల కాలము.

**ఆగస్ట్ :** ప్రకృతి విపత్తులు చోటుచేసుకొనును. వాహన-విమాన ప్రమాదములు సంభవమగును. గాలులతో కూడిన వర్షములు కురియును. అల్ప పీడనము తుఫాన్‌గా మారవచ్చు. కోర్టు సంబంధమైన వివాదములు. పొరుగు రాష్ట్రములతో పేచీలు వచ్చును. రైతులకు-శ్రామికులకు కష్టకాలము.

**సెప్టెంబర్ :** కళాకారులకు-చిత్రపరిశ్రమకు యోగించును. రైతులకు అను కూల వాతావరణము మేలు చేయును. పంటలు బాగుగా ఫలించును. నూతన విద్యా సంస్కరణలు అమలగును. కళాకారులకు జాతీయ పురస్కా

రములు వచ్చును. జననాల రేటు పెరుగును. స్త్రీలకు యోగించును.

**అక్టోబర్ :** మన రాష్ట్రమునకు మంచి పేరు వచ్చును. ప్రభుత్వము నిర్మాణాత్మక చర్యలతో ముందంజ వేయును. నూతన వ్యాపార-పారిశ్రామిక-వ్యవసాయ రంగములు అభివృద్ధి గాంచును. కళాకారులకు-రచయితలకు-ఉపాధ్యాయులకు యోగించును. ప్రాంతీయ సినిమాకు ఉన్నతి.

**నవంబర్ :** ఘోరమైన ప్రకృతి విపత్తుచే జన-పశు-ప్రాణ-ఆస్తి నష్టములు కలుగును. కొన్నితావుల భారీ నుండి అతిభారీ వర్షములచే ముంపులు వచ్చును. తుఫాన్ పట్టును. ప్రభుత్వ వ్యతిరేకతలు పెరుగును. సామూహిక ప్రమాదములు విభ్రాంతిని కలిగించును. జల-అగ్ని-వాహన ప్రమాదములు.

**డిసెంబర్ :** రాష్ట్ర సాధారణ పరిస్థితులు చక్కపడును. నూతన ప్రచార-ప్రసార మాధ్యమములు పుట్టుకొచ్చును. పొరుగు రాష్ట్రములతో దౌత్యములు ఫలించును. చలిగాలుల తీవ్రత పెరుగును. కళాకారులకు-స్త్రీలకు యోగించును. నూతన మార్గముల అభివృద్ధి జరుగును. ప్రశాంత వాతావరణము.

**2019 జనవరి :** పగటి ఉష్ణోగ్రతలు పెరుగును. కొన్నితావుల భారీ అగ్ని ప్రమాదములు సంభవించును. రాజకీయ-సామాజిక వర్గ పోరాటములు ప్రబలును. విద్యార్థులకు-కళాకారులకు ప్రమాదములు జరుగును. పోలీస్ ప్రముఖులకు గండములు. సమ్మెలు-స్ట్రయిక్‌లు-రాస్తారోకోలు జరుగును.

**ఫిబ్రవరి :** రాత్రిళ్ళు బలమైన శీతల గాలులు వీచును. పగటి ఉష్ణోగ్రతలు పెరుగును. పాలకులకు-మంత్రులకు-ప్రముఖులకు ప్రమాదములు జరుగును. నిత్యావసర వస్తు ధరలు పెరుగును. రాజకీయ నాయకుల కప్పదాట్లు అధికమగును. ఎన్నికల దృష్ట్యా ప్రజలను ప్రలోభాలకు గురి చేయుదురు.

**మార్చ్ :** ప్రకృతిలో వాతావరణ మార్పులు గోచరమగును. పాలకులు విదేశీ ప్రయాణములు చేయుదురు. ప్రజలకు వరాలు అందును. ప్రముఖుల ఇంట శుభకార్యములు జరుగును. అధికార పూర్వక ఉత్సవాలు చేయుదురు. ప్రముఖులు లేదా కేంద్ర మంత్రులు రాష్ట్ర సందర్శనములు చేయుదురు.

**ఏప్రిల్ :** వ్యాపార రంగము అభివృద్ధి గాంచును. విద్యార్థులకు మేలు జరుగును. నూతన రాజకీయ పార్టీలకు ప్రజల నుండి మంచి స్పందన వచ్చును. రాష్ట్ర సాధారణ పరిస్థితులు అనుకూలముగా ఉండును. శాస్త్ర-సాంకేతికా భివృద్ధి జరుగును. నూతన కోర్టు నిర్మాణములు పూర్తగును.





## శ్రీ విళంబి లో భారతదేశ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | | లగ్నము 08° రాహు 05° | కుజ 07° |
| | స్వతంత్ర భారత ఆవిర్భావ కుండలి 15-08-1947 శుక్రవారము గం॥ 00.00 న్యూఢిల్లీ | | రవి 28° చంద్ర 04° బుధ 14° శుక్ర 22° శని 21° |
| | | | |
| | కేతు 05° | గురు 26° | |

| | | | |
|---|---|---|---|
| చంద్ర 07° బుధ(వ) 11° | రవి 00° శుక్ర 23° | | లగ్నము 16° |
| | జగల్లగ్నకుండలి 14-04-2018 శనివారము ఉదయము 10-45 న్యూఢిల్లీ | | రాహు 17° |
| కేతు 17° | | | |
| కుజ 21° శని 15° | | గురు(వ) 27° | |

వర్తమానమున భారతదేశమునకు చంద్ర మహాదశ నడుస్తున్నది. ఇందు అక్టోబర్ వరకు రాహుభుక్తియు, తదుపరి గురుభుక్తియు నడుచును. రాహువు లగ్నభావము నందు కృత్తికా నక్షత్రములో సూర్యకక్ష్య నందు సంచరించుట వలన...దేశమునకు శుభాశుభ మిశ్రమ ఫలితములుండును. అధికారము వలన ప్రముఖ నాయకులకు ప్రమాదములు జరుగును. రక్షణ మంత్రికి రక్షణ అవసరము. పాకిస్తాన్-చైనా-బంగ్లాదేశ్ కవ్వింపు చర్యలతో యుద్ధ వాతావరణము నెలకొనును. జలవివాదములు తలఎత్తును. గురువు 7వ భావములో గురు నక్షత్రములో బుధకక్ష్య నందు సంచరించుట వలన... అక్టోబర్ నుండి విదేశీ దౌత్యములు ఫలించును. శత్రుదేశములపై ఆధిపత్యము కలుగును. ఆర్థిక విజయములు చేకూరును. ప్రముఖుని మరణము దిగ్భ్రాంతిని కలుగచేయును. ఈ విళంబి సంవత్సరములో భారతదేశము 71-72 సంవత్సరములో ఉండుట వలన కుజ-రాహు ఆధిపత్యములతో చాలా సమస్యలను, వర్గపోరాటములను, ఉగ్రవాద ముప్పులను, ప్రకృతి విపత్తులను ఎదుర్కొనవలసి ఉంటుంది.

వర్తమానమున బి.జె.పి ప్రభుత్వమునకు పంచవర్ష దశావిభాగము నందు ఏప్రిల్ వరకు శనిదశయు, తదుపరి బుధదశయు నడుచును. శని ఉచ్చములోను, బుధుడు స్వస్థానములోను ఉండుట వలన ఎన్ని ఆటు- పోటులు వచ్చిననూ ప్రభుత్వము సమర్థవంతముగా ఎదుర్కొనును. 2018 జూన్ 22,23,24 తేదీలందు మరియు 2019 మార్చ్ 16,17 తేదీలందు బి.జె.పి ప్రభుత్వమునకు లేదా ప్రజలకు షాకింగ్ సమస్యలు వచ్చును.

స్వతంత్ర్య భారతదేశ ఆవిర్భావ లగ్నమునకు, జగల్లగ్నము 2వదిగా ఉదయిస్తున్నది. ఆవిర్భావ లగ్న కక్ష్యాధిపతి అయిన చంద్రుడు జగల్లగ్న కుండలి నందు 10వ ఇంట బుధ కక్ష్యలో సంచరిస్తున్నాడు. జగల్లగ్నమునకు కుజ-గురు-శనుల దృష్టి ఉంది.

ప్రకృతి విపత్తులు-ఉగ్రవాదుల ముప్పుచే భారీ జననష్టములు.



భారతదేశ లగ్న షష్ఠాధిపతి అయిన శుక్రుడు కేతుకక్ష్యలో ఉన్నాడు. అట్టి కేతువు జగల్లగ్నకుండలి నుండి 8వ ఇంట చంద్రకక్ష్యలో సంచరించుట వలన...ఈ సంవత్సరము భారతదేశ సాధారణ పరిస్థితులు ఆందోళన కలిగించును. వర్గపోరాటములు-మతవిద్వేషములు-అంతర్యుద్ధములు చెలరేగును. ఫ్లూ వంటి అంటురోగములు విజృంభించుట వలన మరియు భూకంపమలు-తుఫానులు-సునామీలు వంటి ప్రకృతి విపత్తులు సంభవించుట వలన జన-ప్రాణ-ఆస్తి నష్టములు ఉంటాయి. పొరుగు దేశములైన పాకిస్తాన్-చైనా-బంగ్లాదేశ్‌లతో ఒకానొక సమయములో యుద్ధ వాతావరణము నెలకొనును. ఉల్కాపాతములు-పిడుగుపాటులు అధిక మగును. పుకార్లు ప్రజలను భయభ్రాంతులను చేయును. లగ్నమునకు గురుదృష్టి ఉండుట వలన ప్రభుత్వము నష్టనివారణకై చేయు ప్రయత్నములు ఫలించును.

ధన-పంచమాధిపతి అయిన బుధుడు శని కక్ష్యలో ఉన్నాడు. అట్టి శని జగల్లగ్నకుండలి నందు 7డింట కుజునితో కలసి ఉండి గురు కక్ష్యలో సంచరించుట వలన...దేశ ఆర్థికాభివృద్ధి ఆటు-పోటులకు గురి యగును. షేర్ మార్కెట్ హెచ్చుతగ్గులతో కొనసాగును. ధన స్థానములో రాహు ప్రభావము వలన ఆర్థిక సంస్కరణలు ఋజు ఫలితములను ఇవ్వవు. జాతీయ చలనచిత్ర ప్రముఖుడొకరు కాలము చేయును. పంచమములో గురుడుండి పంచమాధిపతి లాభములో ఉండుటవలన జాతీయ చలనచిత్రమొకటి అంతర్జాతీయ ఖ్యాతి పొందును. భారతీయ చిత్ర పరిశ్రమకు చెందిన ఒక వ్యక్తికి అంతర్జాతీయ పురస్కారము లభించును.

తృతీయాధిపతి అయిన చంద్రుడు కుజకక్ష్యలో ఉన్నాడు. అట్టి కుజుడు జగల్లగ్నకుండలి నందు 7డింట శనితో కలసి ఉండి బుధకక్ష్యలో సంచరించుట వలన...మీడియా ప్రముఖులకు నష్టములు వాటిల్లును. రోడ్డు-రైలు-విమాన ప్రమాదములు సంభవమగును. సమాచార-సాంకేతిక శాఖలయందు లొసుగులు బయటపడును. పొరుగు దేశములు కవ్వింపుకు పాల్పడును. మీడియా రంగపు స్టింగ్ ఆపరేషన్ నందు ప్రముఖులు ఇరుక్కొందురు. క్రీడా ప్రాంగణమునందు క్రీడాకారులకు ప్రమాదములు జరుగును.

చతుర్థాధిపతి అయిన సూర్యుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి సూర్యుడు జగల్లగ్నకుండలి నందు 10వ భావములో కుజకక్ష్యలో సంచరించుట వలన... ప్రతిపక్షము బలపడే సూచనలు కనిపిస్తున్నాయి. ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలు జరుగును. వాతావరణములో ఆకస్మిక మార్పులు వచ్చును. వేసవి నందు తీవ్ర ఉష్ణోగ్రతల వలన జననష్టములు జరుగును. వర్షాకాలము నందు భారీ వర్షముల వలన కొన్ని నగరములు ముంపుకు గురియగును.

సప్తమ-వ్యయాధిపతి అయిన కుజుడు శుక్ర కక్ష్యలో ఉన్నాడు. అట్టి శుక్రుడు జగల్లగ్నకుండలి నందు 11వ భావములో స్వకక్ష నందు సంచరించుట వలన...బలప్రదర్శన వలన విదేశీ దౌత్యములు ఫలించును.



ప్రధాని శ్రీ నరేంద్ర మోదీ గారు క్రమేపి జనాదరణ కోల్పోవు సూచనలు.



దేశములో ఉగ్రవాద దాడుల వలన ప్రముఖులు మరియు రక్షణ సైనికులు మరణించెదరు. ప్రముఖుల వివాహము రచ్చకెక్కును. పార్లమెంట్ సభ్యులపై సెక్స్  స్కాండల్స్ ఆరోపణలు వచ్చును. అంతర్జాతీయ వ్యాపార లావాదేవీలందు సమస్యలు ఉత్పన్నమగును.

అష్టమ-లాభాధిపతి అయిన గురుడు బుధకక్ష్యలో ఉన్నాడు. అట్టి బుధడు జగల్లగ్నకుండి నందు 10వ భావములో, కేతుకక్ష్యనందు వక్ర సంచారము చేయుటవలన...ఈ సంవత్సరము మరణాల రేటు పెరుగును. ప్రధానమంత్రి గారికి, పార్లమెంట్ సభ్యులకు గండములు. ఉత్తరాది రాష్ట్రములలో భూకంపములచే జననష్టములు కలుగును. కేతు గ్రహము వలన ప్రసిద్ధ పుణ్యక్షేత్రములందు జల-అగ్ని ప్రమాదములు సంభవమగును.

భాగ్య-రాజ్యాధిపతి అయిన శని కేతుకక్ష్యలో ఉన్నాడు. అట్టి కేతువు జగల్లగ్నకుండలి నందు 8వ భావములో చంద్ర కక్ష్యలో సంచరించుట వలన...నూతన శాస్త్ర-సాంకేతిక పరిశోధనలు. సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి ఒకరు సమస్యలలో ఇరుక్కొందురు. మతపరమైన వివాదముల వలన మరియు విమాన ప్రమాదముల వలన జన నష్టములు.

**2018 మార్చ్ :** ఉత్తర లేదా ఈశాన్య రాష్ట్రములందు భూకంపము లేదా వాతావరణ పరమైన ముప్పు వాటిల్లుటచే జన-ఆస్తి-ప్రాణ నష్టములు జరుగును. సముద్రము ముందుకు చొచ్చుకుని వచ్చును. చాలాచోట్ల విష జంతువుల వలన ప్రాణనష్టములు సంభవమగును. విమాన ప్రమాదములు.

**ఏప్రిల్ :** కొన్ని రాష్ట్రముల యందు ఆకస్మిక వాతావరణ దుర్యోగములు సంభవమగును. దేశ సాధారణ పరిస్థితులు ప్రశాంతముగానే ఉండును. నిత్యావసర వస్తుధరలు ప్రజలకు అందుబాటులో ఉండును. నూతన రోడ్డు-రైలు మార్గముల పనులు జరుగును. అన్ని పంటలు సమృద్ధిగా ఫలించును.

**మే :** ఉగ్రవాదుల వలన ముప్పు కలుగును. రక్షణాధికారులకు ప్రమాదములు సంభవమగును. కొన్నితావుల ఘోరమైన అగ్నిప్రమాదములచే జన-ఆస్తి-ప్రాణ నష్టములు సంభవమగును. దేశమంతా తీవ్రమైన ఉష్ణోగ్రతలు నమోదగును. ప్రభుత్వము రక్షణ వ్యవస్థను పటిష్టపరుచును.

**జూన్ :** ఆకస్మిక వాతావరణ మార్పులు జనజీవన స్రవంతిని అతలాకుతలం చేయును. చాలా రాష్ట్రములందు భారీ వర్షములు కురియును. కొన్నితావుల వరదలు లేదా సునామీ హెచ్చరికలు జారీ యగును. ప్రమాదములు ఎక్కువగా ఉండును. రక్షణ వ్యవస్థ నందు బలహీనతలు.

**జూలై :** ప్రశాంత వాతావరణము ఉండును. కొన్ని రాష్ట్రములందు వరద ముంపులు కలుగును. నదులు ఉధృతముగా ప్రవహించును. రాజకీయముగా ప్రముఖ స్త్రీలకు గుర్తింపు కలుగును. వర్షములచే పంటలు పాడగును. పాలకులు విదేశీ ప్రయాణములు చేయుదురు. క్రీడలు యోగించును.

**ఆగస్ట్ :** రాజకీయ-సామాజిక-భద్రతా పరమైన సమస్యలు ఉత్పన్నమగును.

ఉగ్రవాదుల దాడులలో ప్రముఖులు మరణించెదరు. పొరుగు దేశములతో యుద్ధ వాతావరణము నెలకొనును. విదేశీ దౌత్యములు బెడిసికొట్టును. కొన్నితావుల తీవ్రమైన అగ్నిప్రమాదములు సంభవమగును.

**సెప్టెంబర్ :** వాతావరణములో నూతన మార్పులు వచ్చును. కొన్నితావుల చలితీవ్రత పెరుగును. ఆర్థిక సంస్కరణలు అమలగును. దేశ తలసరి ఆదాయము పెరుగును. నిత్యావసర వస్తు ధరలు ఆకాశాన్నంటును. ప్రముఖుల ఇంట శుభకార్యములు జరుగును. గనులు-జల ప్రమాదములు.

**అక్టోబర్ :** దేశ సాధారణ పరిస్థితులు సామాన్యముగా ఉండును. నిత్యావసర వస్తు ధరలలో మార్పులు కలుగును. వెండి ధరలు పెరుగును. పంటలు లాభసాటిగా ఉండును. స్త్రీ-శిశు సంక్షేమ పథకములు అమలగును. ప్రముఖులు విదేశీ ప్రయాణములు చేయుదురు. కొన్నితావుల వరద ముప్పులు.

**నవంబర్ :** ప్రకృతి విపత్తులు సంభవమగును. పెనుతుఫాన్‌లు వలన జన-ఆస్తి-ప్రాణ నష్టములు సంభవమగును. కొన్ని రాష్ట్రములందు ఉప్పెన లేదా సునామీ ప్రమాదములు సంభవమగును. ప్రభుత్వము తక్షణ సహాయ సహకారములు అందించును. వాయువ్య ప్రాంతములకు అరిష్టములు.

**డిసెంబర్ :** వాతావరణములో చలితీవ్రత పెరుగును. పొగమంచు వలన ప్రమాదములు జరుగును. ప్రతిపక్ష పార్టీలకు అనుకూల కాలము. విద్యాలయాలు లేదా థియోటర్ల వద్ద ప్రమాదములు సంభవమగును. ప్రముఖ రాజకీయ నాయకులపై ఆరోపణలు వచ్చును. మంత్రులకు ప్రమాదములు.

**2019 జనవరి :** నిత్యావసర వస్తు ధరలలో మార్పు కలుగును. వ్యాపార రంగము అభివృద్ధి గాంచును. వెండి-బంగారము ధరలు హెచ్చు-తగ్గులుగా సాగును. షేర్ మార్కెట్ పెరుగును. క్రీడా రంగములో విజయములు కలుగును. విదేశీ ప్రముఖులు దేశ సందర్శనము చేయుదురు.

**ఫిబ్రవరి :** భూకంపాది ప్రకృతి విపత్తు సంభవమగును. సముద్ర తీర ప్రాంతీయులు జాగ్రత్తగా ఉండవలెను. అవాంఛనీయ ఘటనలు అధికమగును. పాలక పక్షమునకు ప్రజలలో వ్యతిరేకత పెరుగును. రాజకీయ ప్రముఖులకు గండములు లేదా బంధన యోగములు సంప్రాప్తమగును.

**మార్చ్ :** కొన్ని రాష్ట్రములందు ఆకస్మిక అల్పపీడన ప్రభావముచే తుఫాన్ ప్రమాదములకు అవకాశములున్నవి. సముద్ర తీర ప్రాంతీయుల జాగ్రత్తగా ఉండవలెను. దేశ సాధారణ పరిస్థితులు అస్తవ్యస్తముగా ఉండును. రాజకీయ పార్టీల మధ్య బహిరంగ దాడులు జరుగును. నౌకా ప్రమాదములు జరుగును

**ఏప్రిల్ :** దేశ సాధారణ పరిస్థితులు ప్రశాంతముగా ఉండును. ఆదాయము కంటే ఖర్చులు అధికమగును. చాలాచోట్ల యజ్ఞ-యాగాది క్రతువులు చేయుదురు. రాజకీయముగా నూతన మార్పుకై ప్రజలు అభిలషించెదరు. భారతీయ చలనచిత్రమునకు అంతర్జాతీయ గుర్తింపు కలుగును.





## శ్రీవిళంబి (2018-19) లో గ్రహముల రాశి ప్రవేశ సమయములు

### సూర్యుడు

సంవత్సరాది నుండి మీనము

| | | | |
|---|---|---|---|
| ఏప్రిల్ | 14 | మేషము | ఉ॥10-45 |
| మే | 15 | వృషభము | ఉ॥7-41 |
| జూన్ | 15 | మిథునము | ప॥2-20 |
| జూలై | 16 | కర్కాటకము | రా॥1-18 |
| ఆగస్ట్ | 17 | సింహము | ఉ॥9-45 |
| సెప్టెంబర్ | 17 | కన్య | ఉ॥9-41 |
| అక్టోబర్ | 17 | తుల | రా॥9-37 |
| నవంబర్ | 16 | వృశ్చికము | రా॥9-22 |
| డిసెంబర్ | 16 | ధనుస్సు | ఉ॥11-57 |
| జనవరి | 14 | మకరము | రా॥10-37 |
| ఫిబ్రవరి | 13 | కుంభము | ఉ॥11-34 |
| మార్చ్ | 15 | మీనము | ఉ॥8-26 |

### కుజుడు

సంవత్సరాది నుండి ధనుస్సు

| | | | |
|---|---|---|---|
| మే | 02 | మకరము | రా॥10-07 |
| జూన్ | 26 | వక్రం మొదలు | రా॥2-27 |
| ఆగస్ట్ | 27 | వక్రం ఆఖరు | రా॥7-28 |
| నవంబర్ | 06 | కుంభము | మ॥12-57 |
| డిసెంబర్ | 23 | మీనము | సా॥4-54 |
| ఫిబ్రవరి | 05 | మేషము | తె॥3-39 |
| మార్చ్ | 22 | వృషభము | రా॥6-57 |

### బుధుడు

సంవత్సరాది నుండి మీనము

| | | | |
|---|---|---|---|
| మార్చ్ | 22 | వక్రం మొదలు | తె॥5-43 |
| ఏప్రిల్ | 15 | వక్రం ఆఖరు | మ॥2-45 |
| మే | 09 | మేషము | రా॥7-22 |
| మే | 27 | వృషభము | ఉ॥9-35 |
| జూన్ | 10 | మిథునము | ఉ॥8-37 |
| జూన్ | 25 | కర్కాటకము | రా॥7-34 |
| జూలై | 26 | వక్రం మొదలు | ఉ॥10-27 |
| ఆగస్ట్ | 19 | వక్రం ఆఖరు | ఉ॥9-49 |
| సెప్టెంబర్ | 02 | సింహము | రా॥10-40 |
| సెప్టెంబర్ | 18 | కన్య | తె॥5-32 |
| అక్టోబర్ | 06 | తుల | సా॥4-36 |
| అక్టోబర్ | 26 | వృశ్చికము | రా॥10-37 |
| నవంబర్ | 17 | వక్రం మొదలు | ఉ॥6-57 |
| డిసెంబర్ | 06 | వక్రం ఆఖరు | రా॥2-45 |
| జనవరి | 01 | ధనుస్సు | ఉ॥11-32 |
| జనవరి | 20 | మకరము | రా॥10-36 |
| ఫిబ్రవరి | 07 | కుంభము | ఉ॥11-31 |
| ఫిబ్రవరి | 25 | మీనము | ఉ॥11-02 |
| మార్చ్ | 05 | వక్రం మొదలు | రా॥11-43 |
| మార్చ్ | 14 | వక్రి కుంభము | తె॥6-01 |
| మార్చ్ | 28 | వక్రము ఆఖరు | రా॥7-23 |

### గురుడు

సంవత్సరాది నుండి తులారాశిలో వక్రము

| | | | |
|---|---|---|---|
| జూలై | 10 | వక్రం ఆఖరు | రా॥10-08 |
| అక్టోబర్ | 12 | వృశ్చికము | ఉ॥8-18 |
| నవంబర్ | 12 | పశ్చాదస్తమయం | ప॥12-23 |
| డిసెంబర్ | 10 | ప్రాగుదయము | ఉ॥9-45 |
| ఏప్రిల్ | 02 | ధనుస్సు | ఉ॥8-55 |

### శుక్రుడు

సంవత్సరాది నుండి మీనము

| | | | |
|---|---|---|---|
| మార్చ్ | 26 | మేషము | సా॥5-47 |
| ఏప్రిల్ | 19 | వృషభము | తె॥4-11 |
| మే | 14 | మిథునము | రా॥10-52 |
| జూన్ | 08 | కర్కాటకము | తె॥4-52 |
| జూలై | 04 | సింహము | తె॥4-42 |
| ఆగస్ట్ | 01 | కన్య | మ॥2-58 |
| సెప్టెంబర్ | 01 | తుల | రా॥2-44 |
| అక్టోబర్ | 05 | వక్రం మొదలు | రా॥12-32 |
| అక్టోబర్ | 21 | పశ్చాదస్తమయము | సా॥6-46 |
| అక్టోబర్ | 31 | ప్రాగుదయము | రా॥8-06 |
| నవంబర్ | 16 | వక్రం ఆఖరు | సా॥4-18 |
| జనవరి | 01 | వృశ్చికము | రా॥11-25 |
| జనవరి | 29 | ధనుస్సు | రా॥1-48 |
| ఫిబ్రవరి | 24 | మకరము | రా॥12-57 |
| మార్చ్ | 21 | కుంభము | తె॥5-52 |

### శని

ఈ సంవత్సరమంతయూ ధనుస్సు రాశిలో సంచరించును. అందు ది.18-04-2018 నుండి ది.06-09-2018 వరకు వక్ర సంచారము చేయును.

### రాహు-కేతువులు

సంవత్సరాది నుండి ది. 05-03-2019 వరకు రాహువు కర్కాటకరాశి నందు, కేతువు మకరరాశి నందు సంచరించెదరు. తదాది సంవత్సరాంతము వరకు రాహువు మిథునరాశి నందు, కేతువు ధనుస్సురాశి నందు సంచారము చేయుదురు.

## 2018-19లో 27 నక్షత్రజులకు సంవత్సర ఫలము

**1.అశ్విని :** వ్యాపారాభివృద్ధి. బంధు-మిత్ర సహకారములు. విద్యా-విజ్ఞానాభివృద్ధి. శుభవార్తలు. శత్రు విజయములు. ఆరోగ్యము. కళానైపుణ్యములు.

**2.భరణి :** అనవసర ధనవ్యయములు. ప్రమాదములు. అనూహ్య సంఘటనలు. ఆకస్మిక విరోధములు. బంధన యోగములు. అనారోగ్యములు.

**3.కృత్తిక :** స్త్రీ సౌఖ్యము. మానసిక ప్రశాంతత. నూతన వస్తు-వస్త్ర-భూషణ ప్రాప్తి. దూర ప్రయాణములు. గృహ నిర్మాణ యోగములు. దైవ సందర్శనం.

**4.రోహిణి :** కలహములు. పనులలో జాప్యము. ఉదర-నర-శల్య రుగ్మతలు. తొందరపాటు పనులు. నిరాశా-నిస్పృహలు. వాహన ప్రమాదములు.

**5.మృగశిర :** సంచారము. వ్యయప్రయాసలు. ఉష్ణతాపము. అధికారులతో పేచీలు. తండ్రితో విరోధములు. రాజకీయ గండములు. అశాంతి.

**6.ఆరుద్ర :** వివాదములు. కోర్టు సమస్యలు. రక్త దర్శనము. ధన ఒత్తిడి. వైద్య సంప్రదింపులు. రక్తపోటు. శత్రు-రోగ-ఋణ బాధలు. వాస్తు దోషము.

**7.పునర్వసు :** ఆర్థిక-మానసిక-శారీరక సమస్యలు. ఆకస్మిక ప్రమాదములు. బంధన యోగములు. కుక్షిశూల. జల-అగ్ని-వాహన గండములు.

**8.పుష్యమి :** ప్రయత్న విజయములు. వ్యాపారాభివృద్ధి. స్నేహ లాభములు. సోదర-సోదరీల సహకారములు. మంచి వార్తలు. ఋణ సదుపాయములు.

**9.ఆశ్లేష :** కుటుంబ కలహములు. భాగస్వాములతో పేచీలు. దూర ప్రయాణములలో ఇక్కట్లు. పనులయందు జాప్యములు. ప్రమాదములు.

**10.మఖ :** పాత బకాయిలు వచ్చును. మానసిక ప్రశాంతత. స్త్రీ సహకారములు. సంతాన సౌఖ్యములు. విదేశీ ప్రయాణములు. క్రీడా విజయములు.

**11పుబ్బ :** వివాదములు. వాహన గండములు. ధనవ్యయము. అనవసర సమస్యలు. నిరాశ సంఘటనలు. గుప్త రోగములు. అకారణ విద్వేషములు.

**12.ఉత్తర :** అనవసర వ్యయప్రయాసలు. శిరో-నేత్ర-హృదయ సమస్యలు. సామాజికముగా-రాజకీయముగా అవమానములు. ఉద్యోగ పతనములు.

**13.హస్త :** శుభకార్యములు. వివాహ ప్రాప్తి. నిస్సంతులకు సంతాన లాభములు. ధనాభివృద్ధి. నూతన వస్తు-వాహన సౌఖ్యములు. కుటుంబ సౌఖ్యము.





**14.చిత్త :** తర్కవితర్కములు. దైవ సందర్శనములు. దైవిక దీక్షలు. సర్ప దర్శనములు. చోరాగ్ని భయములు. మానసిక రుగ్మతలు. నిస్తేజము.

**15.స్వాతి :** స్థిర జీవన లాభము. స్థిర-చరాస్తుల వృద్ధి. ప్రియవ్యక్తుల సమాగము. అభీష్ట విజయములు. వస్తు-వాహన-భూషణ-సుఖ భోగములు.

**16.విశాఖ :** తీవ్ర ధన ఒత్తిడులు. జీవిత భాగస్వామితో పేచీలు. కోర్టు సమస్యలు. సోదర-సోదరీలతో కలహములు. అకారణ విద్వేషములు.

**17.అనురాధ :** పుణ్యక్షేత్ర సందర్శనము. నష్టద్రవ్య లాభములు. నేత్ర-చెవి-దంత రుగ్మతలు. దుష్ట స్నేహములు. సర్ప-పశు-మృగ భయములు.

**18.జ్యేష్ఠ :** విదేశీ ప్రయాణములు. శుభవార్తలు. పెద్దల ఆశీర్వాదము. సంతోష-సౌఖ్యములు. పరిశోధనలు ఫలించును. అభీష్ట విజయములు.

**19.మూల :** బంధు-మిత్ర సందర్శనములు. నూతన విద్యా-విజ్ఞానాభివృద్ధి. నిగూఢ శాస్త్ర పరిచయము. వివాహ లాభము. దూర ప్రయాణములు.

**20.పూర్వాషాఢ :** జల గండములు. అనవసర వివాదములు. మూత్ర రోగములు. దగా పడుట. పై నుండి జారిపడుట. విధవా స్త్రీతో కలహము.

**21.ఉత్తరాషాఢ :** స్థిర జీవనము. ప్రియ వ్యక్తుల సమాగము. భోగము. ఆర్థికాభివృద్ధి. భవిష్య ప్రణాళికలు. కళా నైపుణ్యము. సంతాన లాభములు.

**22.శ్రవణము :** వ్యాపార విజయములు. ఆరోగ్యము. దూర ప్రయాణములు. బంధు-మిత్ర సహకారములు. క్రీడా విజయములు. ఋణలాభము.

**23.ధనిష్ఠ :** బంధన యోగములు. అకారణ విద్వేషములు. మానసిక రుగ్మతలు. చోరాగ్ని భయములు. విష జంతు-కీటక-ప్రయోగ బాధలు.

**24.శతభిషము :** ప్రియ వ్యక్తుల సమాగము. నూతన వస్తు-వస్త్ర-భూషణ వాహన సౌఖ్యములు. పాడి-పంటల వలన యోగించును. దూర ప్రయాణము

**25.పూర్వాభాద్ర :** నూతన మైత్రీ లాభము. ఇష్టార్థ ప్రాప్తి. ప్రేమ వివాహములు. నిస్సంతులకు సంతాన యోగములు. వాహన-భూషణ సౌఖ్యములు.

**26.ఉత్తరాభాద్ర :** నష్టద్రవ్య లాభము. పశు-పక్ష్యాదుల క్రయవిక్రయములచే లాభములు. ఆకస్మిక పదవీ యోగములు. పుణ్యక్షేత్ర సందర్శనములు.

**27.రేవతి :** దైవ సందర్శనములు. సంతాన ప్రాప్తి. ప్రశాంత జీవనము. రచయితలకు-కళాకారులకు యోగించును. స్త్రీ సహకారములు. సంతోషం.

## 2018-19 లో రోజువారీ వర్షపాతము

ఈ సంవత్సరము మేఘాధిపత్యము **"శుక్రుని"**కి పట్టుట వలన పంటలకు అనుకూల కాలము. ఆగ్నేయ లేదా వాయువ్య దిశా ప్రాంతములకు వరద ముప్పులు ఉండును. ఈ సంవత్సరము వర్షాకాలములో... **గురు** గ్రహము వాయు-అతివాయు నాడులందు, **శని** గ్రహము దహన నాడినందు, **రాహు-కేతువులు** మేఘ-జల నాడులందు సంచరించుట వలన... దేశము మొత్తము మీద సాధారణ వర్షపాతము ఉండి గాలులతో కూడిన కాలానుగుణ వర్షములు ఉండును. ద్వాదశనాగులలో **"నరేంద్ర"** నామక సర్పము ఉదయించుట వలన... పూర్ణమైన వర్షములు కురియును. **"ద్రోణ"** అను పేరు గలమేఘము **"మేరు"** పర్వతమునకు **తూర్పు** దిక్భాగ మందు ఉదయించుట వలన... నిరంతర వృష్టిచే మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్ లందు వరదముప్పులు సంభవమగును. సూర్యుని **ఆరుద్రా** ప్రవేశకాల తిథి,వార,నక్షత్ర,లగ్న,గ్రహ ఫలితములను సమీక్షించి చూడగా... ఈ సంవత్సరము పర్వత ప్రాంత వర్షములు కురియుట వలన, నదీ ఉధృత ప్రవాహములచే వరద ప్రమాదములు కలుగును.

ఈ సంవత్సరము ఆంధ్రప్రదేశ్ నందు అనంతపురము, నెల్లూరు, ప్రకాశము, పశ్చిమ మరియు తూర్పు గోదావరి, విశాఖ, విజయనగరము, శ్రీకాకుళము జిల్లాలకు, తెలంగాణా నందు ఆదిలాబాద్, నిర్మల్, పెద్దపల్లె, నిజామాబాద్, రాజన్న సిరిసిల్ల, జయశంకర్, జనగాం, వరంగల్, వికారాబాద్, రంగారెడ్డి, యాదాద్రి భువనగిరి, భద్రాద్రి కొత్తగూడెం, వనపర్తి, నల్గొండ, నాగర్ కర్నూల్, జోగులాంబ గద్వాల్ జిల్లాలకు వాతావరణ పరమైన అరిష్టములు కలుగును.

**2018 మార్చ్ :** **18.**ఎండ **19.**మబ్బులు **20.**జల్లులు **21.**గాలి-జల్లులు **22.**గాలి-జల్లులు **23.**ఎండ **24.**మబ్బులు **25.**జల్లులు **26.**మబ్బులు-జల్లులు **27.** వర్షము **28.**వర్షము **29.**జల్లులు **30.**జల్లులు **31.**ఎండ.

**ఏప్రిల్ :** **1.**ఉష్ణతాపము **2.**పొడిగా **3.**మబ్బులు **4.**అల్పపీడనము **5.**గాల్పు **6.**ఉష్ణతాపము **7.**ఉష్ణతాపము **8.**మబ్బులు-జల్లులు **9.**జల్లులు **10.**వర్షము **11.**గాలి-మబ్బులు **12.**మేఘాడంబరము **13.**జల్లులు **14.**ఎండ **15.**ఎండ **16.**ఉష్ణగాలి **17.**మబ్బులు **18.**అల్పపీడనము **19.**ఉష్ణగాలి **20.**మబ్బులు-జల్లులు **21.**జల్లులు **22.**జల్లులు **23.**వర్షము **24.**వర్షము **25.**వర్షము **26.**ఎండ **27.**పొడిగా **28.**ఎండ **29.**ఎండ **30.**గాలి-జల్లులు.





**మే :** **1.**పెనుగాలి **2.**తుఫాన్ **3.**జల్లులు **4.**ఎండ **5.**మబ్బులు **6.**జల్లులు **7.** వర్షము **8.**వర్షము **9.**మేఘములు **10.**జల్లులు **11.**ఎండ **12.**ఎండ **13.**ఎండ **14.**ఎండ **15.**ఉష్ణగాలి **16.**గాల్పు **17.**మబ్బులు **18.**జల్లులు **19.**జల్లులు **20.**వర్షము **21.**వర్షము **22.**వర్షము **23.**జల్లులు **24.**ఎండ **25.**ఎండ **26.**గాల్పు **27.**గాల్పు **28.**గాల్పు **29.**గాల్పు **30.**అల్పపీడనము **31.**ఉష్ణము.

**జూన్ :** **1.**మబ్బులు **2.**జల్లులు **3.**వర్షము **4.**వర్షము **5.**వర్షము **6.**వర్షము **7.**పొడిగా **8.**పొడిగా **9.**ఉక్కపోత **10.**గాల్పు **11.**ఎండ **12.**ఎండ **13.** గాలి-వర్షము **14.**వర్షము **15.**వర్షము **16.**వర్షము **17.**వర్షము **18.**వర్షము **19.**పొడిగా **20.**పొడిగా **21.**ఎండ **22.**ఎండ **23.**గాలి **24.**మబ్బులు-జల్లులు **25.**గాలి-జల్లులు **26.**పొడిగా **27.**గాలి-మబ్బులు **28.**ఎండ **29.**మబ్బులు-జల్లులు **30.**వర్షము

**జూలై :** **1.**వర్షము **2.**పొడిగా **3.**పొడిగా **4.**పొడిగా **5.**పొడిగా **6.**ఎండ **7.** మబ్బులు **8.**పొడిగా **9.**ఎండ **10.**ఎండ **11.**గాలి-జల్లులు **12.**వర్షము **13.** వర్షము **14.**వర్షము **15.**వర్షము **16.**పొడిగా **17.**పొడిగా **18.**గాలి **19.**ఎండ **20.**ఎండ **21.**గాలి-జల్లులు **22.**గాలి-జల్లులు **23.**పొడిగా **24.**పొడిగా **25.**పొడిగా **26.**మబ్బులు-జల్లులు **27.**వర్షము **28.**వర్షము **29.**వర్షము **30.**వర్షము **31.**మబ్బులు.

**ఆగస్ట్ :** **1.**పొడిగా **2.**పొడిగా **3.**మబ్బులు-జల్లులు **4.**గాలి-జల్లులు **5.** వర్షము **6.**జల్లులు **7.**వర్షము **8.**గాలి-జల్లులు **9.**వర్షము **10.**వర్షము **11.** వర్షము **12.**వర్షము **13.**వర్షము **14.**మబ్బులు **15.**గాలి-జల్లులు **16.**పొడిగా **17.**పొడిగా **18.**అల్పపీడనము **19.**తుఫాన్ **20.**పొడిగా **21.**పొడిగా **22.**తుఫాన్ **23.**జల్లులు **24.**వర్షము **25.**వర్షము **26.**వర్షము **27.**వర్షము **28.**పొడిగా **29.**పొడిగా **30.**ఎండ **31.**జల్లులు.

**సెప్టెంబర్ :** **1.**అల్పపీడనము **2.**గాలి-వర్షము **3.**వర్షము **4.**జల్లులు **5.** వర్షము **6.**వర్షము **7.**వర్షము **8.**వర్షము **9.**వర్షము **10.**జల్లులు **11.**మబ్బులు **12.**ఎండ **13.**మబ్బులు **14.**మేఘములు **15.**తుఫాన్ **16.**జల్లులు **17.**పొడిగా **18.**పొడిగా **19.**గాలులు **20.**జల్లులు **21.**వర్షము **22.**వర్షము **23.**వర్షము **24.**జల్లులు **25.**మబ్బులు **26.**ఎండ **27.**గాలి-మబ్బులు **28.**గాలి-మబ్బులు **29.**పెనుగాలి **30.**చలిగాలి

**అక్టోబర్ :** **1.**మబ్బులు-జల్లులు **2.**వర్షము **3.**వర్షము **4.**వర్షము **5.**వర్షము **6.**వర్షము **7.**తేమగా **8.**తేమగా **9.**పొడిగా **10.**మేఘములు **11.**గాలి-మబ్బులు **12.**గాలి-మబ్బులు **13.**తుఫాన్ **14.**వర్షము **15.**పొడిగా **16.**మబ్బులు **17.** జల్లులు **18.**వర్షము **19.**వర్షము **20.**వర్షము **21.**వర్షము **22.**జల్లులు **23.**

తుషారం **24.**తుషారం **25.**మబ్బులు-జల్లులు **26.**జల్లులు **27.**శీతగాలి **28.**శీతగాలి **29.**మబ్బులు **30.**జల్లులు **31.**వర్షము.

**నవంబర్ :** **1.**వర్షము **2.**వర్షము **3.**తేమగా **4.**పొడిగా **5.**పొడిగా **6.**మబ్బులు **7.**తుఫాన్ **8.**పెనుగాలులు **9.**వర్షము **10.**వర్షము **11.**పొడిగా **12.**శీతలం **13.**శీతలం **14.**తుషారం **15.**తుషారం **16.**తుషారం **17.**తుషారం **18.**పొడిగా **19.**పొడిగా **20.**ఎండ **21.**శీతగాలి **22.**శీతగాలి **23.** శీతగాలి **24.**శీతగాలి **25.**మబ్బులు **26.**జల్లులు **27.**జల్లులు **28.**వర్షము **29.**వర్షము **30.**మబ్బులు

**డిసెంబర్ :** **1.**తేమగా **2.**తేమగా **3.**ఎండ **4.**ఎండ **5.**అల్పపీడనము **6.** వర్షము **7.**వర్షము **8.**పొడిగా **9.**మంచు **10.**మంచు **11.**పొడమంచు **12.**పొగ మంచు **13.**పొగమంచు **14.**మంచు **15.**తేమగా **16.**తేమగా **17.**ఎండ **18.** ఎండ **19.**పెనుగాలులు **20.**గాలులు **21.**గాలి-మబ్బులు **22.**జల్లులు **23.** శీతలం **24.**శీతలం **25.**శీతలం **26.**శీతలం **27.**శీతలం **28.**తేమగా **29.** తేమగా **30.**పొడిగా **31.**పొడిగా

**2019 జనవరి :** **1.**శీతగాలి **2.**తుఫాన్ **3.**గాలి-జల్లులు **4.**గాలి-జల్లులు **5.**వర్షము **6.**శీతలం **7.**శీతలం **8.**శీతలం **9.**శీతలం **10.**శీతలం **11.**మంచు **12.**మంచు **13.**తేమగా **14.**పొడిగా **15.**శీతగాలి **16.**శీతగాలి **17.**శీతగాలి **18.**శీతగాలి **19.**జల్లులు **20.** జల్లులు **21.**వర్షము **22.**వర్షము **23.**తేమగా **24.**తేమగా **25.**జల్లులు **26.**ఎండ **27.**ఎండ **28.**ఎండ **29.**శీతగాలి **30.**శీతగాలి **31.**శీతగాలి.

**ఫిబ్రవరి :** **1.**ఎండ **2.**తుషారం **3.**తుషారం **4.**వర్షము **5.**వర్షము **6.**గాలి-జల్లులు **7.**జల్లులు **8.**తేమగా **9.**ఎండ **10.**ఎండ **11.**తేమగా **12.**గాలి **13.**చలిగాలి **14.**చలిగాలి **15.**మంచు **16.**మంచు **17.**పొగమంచు **18.**పొగ మంచు **19.**పొగమంచు **20.**ఎండ **21.**ఎండ **22.**పొడిగా **23.**ఎండ **24.**ఎండ **25.**చలిగాలి **26.**చలిగాలి **27.**చలిగాలి **28.**పొగమంచు.

**మార్చ్ :** **1.**పొగమంచు **2.**పొగమంచు **3.**తుషారం **4.**తుషారం **5.**తుషారం **6.**గాలి-వర్షము **7.**పొడిగా **8.**పొడిగా **9.**ఎండ **10.**గాలి **11.**పెనుగాలి **12.**శీత గాలి **13.**శీతగాలి **14.**మబ్బులు- జల్లులు **15.**జల్లులు **16.**వర్షము **17.**వర్షము **18.**వర్షము **19.**పొడిగా **20.**పొడిగా **21.**పొడిగా **22.**తేమగా **23.**ఎండ **24.**ఎండ **25.**గాలి **26.**ఎండ **27.**గాలి-మబ్బులు **28.**ఎండ **29.**మంచు **30.**పొగమంచు **31.**పొగమంచు.

**ఏప్రిల్ :** **1.**పొడిగా **2.**పొడిగా **3.**గాలి-మబ్బులు **4.**పొడిగా **5.**మబ్బులు-జల్లులు.





# సరుకుల ధరలు 2018-2019

ఈ సంవత్సరము అర్ఘాధిపత్యము శుక్రునికి పట్టుట వలన అన్ని వస్తువుల ధరలు హెచ్చుతగ్గులుగా సాగిననూ, సంవత్సర మొత్తము మీద సమీక్షించి చూడగా గత సంవత్సరము కంటే అన్ని వస్తువుల ధరలు పెరుగుదలగా ఉండును. వస్తు నిల్వ వ్యాపారులకు మేలు జరుగును.

ఈ సంవత్సరము గత సంవత్సరము కంటే...బియ్యము8, పెసలు8, నువ్వులు9, బంగారము9, ఇంగువ9, శొంఠి10, కూరగాయలు10, పాలు11, ప్రత్తి11, ఉల్లి11, చక్కెర12, పటికబెల్లము12, మిఠాయిలు12, చెప్పులు13, పాదరసము13, గ్రుడ్లు13, పచారీ14, బాదంపప్పు14, ఏలకులు15, ఎలక్ట్రానిక్స్15, చింతపండు15, సెల్‌ఫోన్లు16, శీతల యంత్రములు16, విగ్రములు16, మేకలు-గొర్రెలు17, పాలిథిన్17, సిమెంట్స్17, జాడీలు18, సీమ వెండి18, ఇంధనములు18, కంబళ్ళు19, ఎలక్ట్రికల్స్19, ఇటుకలు20 శాతముగా సంవత్సర మొత్తము మీద సరాసరి పెరుగుదలగా ఉండును.

ఈ సంవత్సరము గత సంవత్సరము కంటే...గోధుమలు8, మినుములు8, ఉలవలు9, గ్రాసము9, కలప9, కుసుమలు10, కారము10, వెండి10, కాఫీగింజలు11, మైదా11, నెయ్యి12, తేనె12, అగరు12, పశువులు13, లెదర్‌బ్యాగ్స్13, మాంసాదులు13, పీతలు14, జీడిపప్పు14, రంగులు14, వేరుశనగ15, లిక్కర్లు15, కాస్మోటిక్స్15, అశ్వములు16, పక్షులు16, పట్టు17, నెమళ్ళు17, వైఢూర్యములు17, వంటనూనెలు18, చిత్తరువులు18, ఇనుము18, మిర్చి19, పులిచర్మాలు19 శాతముగా సంవత్సర మొత్తము మీద సరాసరి తరుగుదలగా ఉండును.

ఈసంవత్సరము...శనగలు, అలసందలు, కందులు, ధాన్యము, వెల్లుల్లి, మిరియములు, జొన్నలు, తేయాకు, చేపలు, గోవులు, బెల్లము, చందనము, పుష్యరాగములు, ఉప్మారవ్వ, పొగాకు, గ్యాస్, తమలపాకులు, ఓమ, కర్పూరము, వాహనములు, నిమ్మకాయలు, పుష్పములు, వజ్రములు, సింథటిక్స్, రంగురాళ్ళు, గోనెసంచులు, వెంట్రుకలు, కుంకుళ్ళు, సిగరెట్స్, భూములు, ఉన్ని, భారీ వాహనములు, భారీ యంత్రములు మొదలగు వస్తువుల ధరలు సంవత్సర మొత్తము మీద సరాసరి నిలబాటుగా ఉండును.

అర్ఘాధిపతి శుక్రుడు అగుట వలన దళారులకు లాభమగును.



## 2018-19 లో నెలవారీగా సరుకుల తేజీ - మాందీ శాతములు

| వస్తు కూట సంఖ్యలు ⇨ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 2018 మార్చ్ | నిలబాటు - | తేజీ 5% | తేజీ 5% | తేజీ 5% | నిలబాటు - | నిలబాటు - | తేజీ 6% | మాందీ 5% | నిలబాటు - |
| ఏప్రిల్ | మాందీ 6% | మాందీ 5% | తేజీ 6% | తేజీ 5% | మాందీ 6% | తేజీ 5% | తేజీ 6% | మాందీ 6% | మాందీ 6% |
| మే | తేజీ 6% | తేజీ 6% | తేజీ 6% | తేజీ 6% | మాందీ 7% | నిలబాటు - | తేజీ 7% | మాందీ 6% | తేజీ 7% |
| జూన్ | నిలబాటు - | మాందీ 8% | తేజీ 7% | తేజీ 7% | నిలబాటు - | మాందీ 7% | తేజీ 8% | మాందీ 8% | తేజీ 8% |
| జూలై | నిలబాటు - | మాందీ 8% | మాందీ 7% | మాందీ 7% | మాందీ 7% | మాందీ 7% | మాందీ 8% | నిలబాటు - | మాందీ 8% |
| ఆగస్ట్ | నిలబాటు - | తేజీ 7% | నిలబాటు - | నిలబాటు - | నిలబాటు - | తేజీ 7% | నిలబాటు - | తేజీ 7% | నిలబాటు - |
| సెప్టెంబర్ | తేజీ 4% | మాందీ 4% | మాందీ 5% | మాందీ 4% | తేజీ 4% | మాందీ 5% | మాందీ 5% | నిలబాటు - | మాందీ 5% |
| అక్టోబర్ | మాందీ 4% | నిలబాటు 4% | తేజీ 4% | తేజీ 4% | మాందీ 4% | తేజీ 4% | తేజీ 5% | మాందీ 5% | తేజీ 5% |
| నవంబర్ | నిలబాటు - | నిలబాటు - | మాందీ 6% | నిలబాటు - | మాందీ 6% | నిలబాటు - | నిలబాటు - | తేజీ 6% | మాందీ 6% |
| డిసెంబర్ | తేజీ 7% | తేజీ 6% | తేజీ 7% | మాందీ 6% | తేజీ 7% | మాందీ 6% | మాందీ 7% | నిలబాటు - | తేజీ 7% |
| 2019 జనవరి | తేజీ 7% | నిలబాటు - | మాందీ 7% | నిలబాటు - | తేజీ 7% | మాందీ 7% | నిలబాటు - | తేజీ 7% | తేజీ 7% |
| ఫిబ్రవరి | మాందీ 8% | నిలబాటు - | తేజీ 8% | మాందీ 8% | మాందీ 8% | నిలబాటు - | మాందీ 8% | నిలబాటు - | మాందీ 7% |
| మార్చ్ | మాందీ 8% | తేజీ 8% | మాందీ 8% | తేజీ 7% | తేజీ 8% | నిలబాటు - | తేజీ 8% | తేజీ 8% | నిలబాటు - |
| ఏప్రిల్ | మాందీ 9% | తేజీ 8% | నిలబాటు - | మాందీ 8% | నిలబాటు - | నిలబాటు - | మాందీ 8% | మాందీ 8% | నిలబాటు - |

**గమనిక :** పై పట్టికలో శిరో భాగములో పేర్కొన్న 9 సంఖ్యలను వస్తు కూటములుగా గ్రహించవలేను. ప్రక్క పేజీ నందు ఆయా సంఖ్యల వస్తువులను వ్రాయుట జరిగినది. కావున పట్టికలోని సంఖ్యల ద్వారా ఆయా నెలలో, ఆయా వస్తు ధరలు యొక్క పెరుగుదల-తరుగుదల శాతములను గ్రహించగలరు. ఈ పట్టిక నందు.....తేజీ = ధరలు పెరుగుదలను, మాందీ = ధరలు తగ్గుదలను, నిలబాటు = ధరలు నిలబాటును సూచించును. ఉదాహరణకు.....పై పట్టిక నందు 1వ సంఖ్యకు చెందిన బంగారము లేదా మిగతా వస్తువులు ఆగస్ట్ నెలనందు నిలబాటుగా ఉండి, సెప్టెంబర్ నెలనందు గతనెల కంటే 4% పెరుగును. ఈ శాతములను రూపాయలలో గ్రహించవలెను.



ఈ సంవత్సరము గతము కంటే అన్ని వస్తువుల ధరలు పెరుగును.



# వస్తు కూటముల సంఖ్యలు

1. గోధుమలు-గ్రాసము-బంగారము-ధాన్యము-ఇత్తడిపాత్రలు-కలప-లక్క-ఇంగువ-వెల్లుల్లి-కుసుమలు-ప్లాటినమ్-శొంఠి-మిరియములు-హాట్ చిప్స్-కారము-కెంపులు-రాగులు.
2. బియ్యము-నీరు-కూరగాయలు-ఆకుకూరలు-జొన్నలు-ఇడ్లీరవ్వ-ఉప్పు-వెండి-నూలువస్త్రములు-పాలు-పెరుగు-ఔషధములు-నూకలు తేయాకు-ప్రత్తి గింజలు-ప్రత్తి-కాఫీగింజలు-జలచరములు-కందమూలాది దుంపలు-మైదా పిండి-ఇసుక-శీతలపదార్ధములు-శీతలపానీయములు-జనుము-ముత్యములు-కొబ్బరి-వ్యవసాయపనిముట్లు-ఉల్లి పాయలు-టీపొడి-సైంధవలవణములు.
3. శనగలు-గోవులు-నెయ్యి-ఎండుఖర్జూరము-పంచదార-అరటిపండ్లు పట్టు వస్త్రములు-పసుపు-బంగారుఆభరణములు-పాత్రలు-బెల్లము-తేనె-కండసార-చందనము-ఫలములు-పూజాద్రవ్యములు-ఏనుగులు-అగరు-మిఠాయిలు-పుష్యరాగములు.
4. మినుములు-పశువులు-పాములు-పాదరక్షలు-శరీరకవచములు-పుట్టగొడుగులు-తోలువస్త్రములు-తోలుసంచులు-చర్మవస్తువులు-కుడ్యపాత్రలు-పాదరసము-పొగాకు-మాంసము-ఫాస్ట్‌ఫుడ్స్-ఉప్మారవ్వ-చేపలు-సహజ వాయువు-రొయ్యలు-పీతలు.
5. పెసలు-పచారీ లేదా కిరాణా మరియు ఫ్యాన్సీ వస్తువులు-తమలాకులు-ధనియాలు-జీడిపప్పు-చెఱకు-పేపరు-దుప్పట్లు-జీలకర్ర-కంచుపాత్రలు-బాదంపప్పు-మంజిష్ఠాదులు-పుస్తకములు-షేర్లు-వక్కలు-ఓమ-రంగులు-ఏలకులు-మసాలాదినుసులు-పచ్చళ్ళు-పచ్చకర్పూరము-గుగ్గిలము-సాంబ్రాణి-వేరుశనగ-గసగసాలు-మెంతులు-ప్రింటింగ్‌యంత్రములు-కంప్యూటర్లు-కాలిక్యులేటర్లు-గడియారములు-మరకతములు.
6. అలసందలు-వాహనములు-మత్తుపానీయములు-ఎండుద్రాక్షలు-చింత పండు-శృంగార ఔషధములు-అలంకారవస్తువులు-వస్త్రములు-లోదుస్తులు-సీమవెండిపాత్రలు-నిమ్మకాయలు-సెంట్లు-సబ్బులు-కాస్మోటిక్స్-చరవాణి యంత్రములు-దృశ్యవాణి యంత్రములు-వినోద పరికరములు-వెండి ఆభరణములు-పుష్పములు-అశ్వములు-శీతలీకరణయంత్రములు-ఫ్యాన్లు-కూలర్లు-తలనూనెలు-వజ్రములు.
7. ఉలవలు-పక్షులు-విగ్రహములు-గుడ్లు-మిశ్రమ వస్త్రములు-పంచలోహ పాత్రలు-పట్టు-దారములు-మేకలు-గొర్రెలు-రంగురాళ్ళు-మైకా-అభ్రకము-పాలీథీన్ వస్తువులు-డిస్పోజబుల్‌వస్తువులు-తగరము-జింకు-నార (గోనె) సంచులు-వైఢూర్యములు.
8. నువ్వులు-మట్టి-బొగ్గు-సిమెంట్-శిరోజాలు-శల్యములు-వంటనూనెలు-ఆముదాలు-చలువరాళ్ళు-రబ్బరు-స్టీల్‌పాత్రలు-మట్టిపాత్రలు-జాడీలు-కుంకుళ్ళు-మట్టివిగ్రహములు-అల్యూ మినియం(సీమవెండి)-పశువులు-ధూమపాన వస్తువులు-త్రాళ్ళు-ఇనుము-సూదంటురాయి-నీలమణులు-పురుగుమందులు-ఇంధనములు-పెట్రోల్-డీజిలాయిల్- బార్లీ.
9. కందులు-రాళ్ళు-భూములు-మిర్చి-ఆవాలు-కంబళ్ళు-రాగిపాత్రలు-ఉన్ని-పులిచర్మాలు-దంతములు-ఎలక్ట్రికల్ వస్తువులు-ఎలక్ట్రానిక్ వస్తువులు-పులిగోళ్ళు-ఇటుకలు-పెంకులు-పగడములు-రాగి-భారీయంత్రములు.

# గోచారవశమున శని దుష్ప్రభావము

**1. అర్ధాష్టమశని :** జాతకుని యొక్క జన్మరాశి లగాయతు నాల్గవ(4) రాశిలో గోచారవశమున శని సంచరించుటను **"అర్ధాష్టమశని"** అందురు. ఇది సుమారుగా రెండున్నర సంవత్సరములు ఉంటుంది. ఈ కాలములో జాతకుడు ఆస్తి సంబంధమైన, బంధు సంబంధమైన వివాదాలలో ఇరుక్కొనును. శుభ ప్రయత్నములు బెడిసికొట్టును. తగినంత సుఖము ఉండదు. మాతృ విరోధముగాని, మాతృగండముగాని కల్గును. వ్యాపార సంస్థలు మూతపడును.

**2. అష్టమశని :** జాతకుని యొక్క జన్మరాశి లగాయతు, ఎనిమిదవ (8) రాశిలో గోచారవశమున శని సంచరించుటను **"అష్టమశని"**అందురు. ఇదికూడా సుమారుగా రెండున్నర సంవత్సరములు ఉంటుంది. ఈ కాలములో జాతకుడు ఆర్థికముగా, మానసికముగా, శారీరకముగా తీవ్ర ఇబ్బందులకు గురిఅగును. వాహన ప్రమాదములు, జల గండములు మరియు వివిధరకాల ప్రాణ గండములు కలుగును. స్థానచలనము, వృత్తిభంగము జరుగును.

**3. కంటకశని :** జాతకుని యొక్క జన్మరాశి లగాయితు పదవ(10) రాశిలో గోచారవశమున శని సంచరించుటను **"కంటకశని"** అని అందురు. ఇది కూడా సుమారు రెండున్నర సంవత్సరములు ఉంటుంది. ఈ కాలములో జాతకుడు సాంఘికముగా, రాజకీయముగా అప్రతిష్ఠ పాలగును. వృత్తి భంగము జరుగును. బంధనయోగము, కోర్టు సమస్యలు ఉత్పన్నమగును. అధికారుల ఆగ్రహమునకు గురికావలసి ఉంటుంది.

**4.ఏల్నాటిశని :** ద్వాదశ రాశ్యాత్మకమగు మానవుని జీవితములో ఏడున్నర సంవత్సరముల పాటు శనిగ్రహము చూపు దుష్ప్రభావమును వ్యవహారిక భాషలో **"ఏలినాటిశని"** గా వ్యవహరింతురు.శని ఒక్కొక్క రాశిలో రెండున్నర సంవత్సరముల పాటు సంచరిస్తే... ద్వాదశ రాశులను 30 సం॥లలో చుట్టివచ్చును. అట్టి సమయములో జాతకుని జన్మరాశికి వెనుకగలట్టి రాశి (జన్మరాశి నుండి 12వది) లోనికి శని ప్రవేశించగనే... జాతకునికి ఏలినాటి శని ప్రారంభమైనట్టు గ్రహించాలి. ఆరాశిలో శని రెండున్నర సంవత్సరములు కాలము సంచరిస్తూ.. జాతకునిచే దుర్వ్యయములను చేయిస్తూ బికారిని చేయును. శుభకార్య క్రమములకు అవరోధములను కలిగించును. వ్యాపార, వృత్తి నష్టములను కలుగజేయును. స్థానచలనము, ఆస్తులను అమ్ముకొనుట మొదలగు చెడు ఫలితములు కలుగును. తదుపరి





శని జాతకుని జన్మరాశి (చంద్రుడున్నరాశి) లోనికి ప్రవేశించి... రెండున్నర సంవత్సరముల పాటు తీవ్ర అనారోగ్యములను, అపనిందలను, ప్రమాదములను కలుగచేయుటకు ప్రయత్నించును. ఆ తదుపరి శని జాతకుని జన్మరాశికి ముందుగల రాశి (జన్మరాశి లగాయతు 2వది) లోనికి ప్రవేశించి రెండున్నర సంవత్సరముల పాటు జాతకునికి తీవ్ర మానసిక క్షోభను, ధన నష్టములను, కుటుంబంలో అశాంతిని, మరణ భయమును కల్గించును.

ఈ విధముగా శని-జాతకుని జన్మరాశి లగాయతు 12,1,2, స్థానములలో గోచార రీత్యా ఏడున్నర సంవత్సరముల పాటు సంచారము సల్పి.. జాతకుని అనేక విధములు గా బాధలుపెట్టుటను **"ఏలినాటిశని"** అందురు.

**విశేషము :** ఈ ఏలినాటి శని జాతకుని జీవితములో 30 సంవత్సరముల కొకసారి చొప్పున 3 పర్యాయములు వచ్చి.. ఒక్కొక్క పర్యాయము ఏడున్నర సంవత్సరములు ఉండును. అందు మొదటి పర్యాయము ఏలినాటి శనిని **"మంగుశని"** గా వ్యవహరింతురు. ఈ కాలమందు జాతకుడు నానావిధమైన కష్టనష్టములను అనుభవించవలసి ఉంటుంది. రెండవ పర్యాయపు ఏలినాటి శనిని **"పొంగుశని"** గా వ్యవహరింతురు. ఈ కాలమందు జాతకుడు పాల పొంగువలె దినదినాభివృద్ధిని చెందును. మూడవ పర్యాయపు ఏలినాటి శనిని **"మృత్యుశని"** యని వ్యవహరింతురు. ఈ కాలమునందు జాతకుడు దీర్ఘ రోగములచే బాధపడుచూ.. ప్రాణమును విడుచును. ఈ కాలము నందు మారకదశలు రాకుంటే... ప్రాణము నిలుచును. గోచారరీత్యా గురుడు బలముగా ఉన్నప్పుడు.. ఈ ఏలినాటి శని ప్రభావము అంతగా ఉండదు. ఏది ఏమైననూ.. ఏలినాటి శని వచ్చినపుడు తగినన్ని శాంతులను చేయించాలి.

**శాంతివిధానము :** ఏలినాటి శని ప్రభావమునకులోనై విపరీతముగా బాధలు పడుచున్న వారు ఈ క్రింది శాంతులను ఆచరించినయెడల.. బాధలు నివారణయగును.

1. శనిత్రయోదశి పర్వదినమున, తూర్పుగోదావరిజిల్లా నందలి కొత్తపేట తాలూకా, రావులపాలెం మండలములోని **"మందపల్లి"** అను గ్రామములో వేంచేసియున్న శ్రీశనైశ్చరస్వామివారికి తిల,తైలాభిషేకము చేయించి, తిలదానము చేయవలెను.

2. ప్రతి నిత్యము తాను భోజనము చేసేముందు అన్నములో ముడినువ్వులను కలిపి కాకులకుగాని, నల్లకుక్కకుగాని, పెట్టవలెను. శనైశ్చరశాంతితో పాటు భూతశాంతి అగును.

## రవ్యాది నవగ్రహములకు మహాదశలు మరియు అంతర్దశల ప్రమాణ కాలముల పట్టిక

| అంతర్దశలు → | రవి భుక్తి | | | చంద్ర భుక్తి | | | కుజ భుక్తి | | | రాహు భుక్తి | | | గురు భుక్తి | | | శని భుక్తి | | | బుధ భుక్తి | | | కేతు భుక్తి | | | శుక్ర భుక్తి | | | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మహాదశలు ↓ | సం॥ | నె॥ | రో॥ | సం॥ | నె॥ | రో॥ | సం॥ | నె॥ | రో॥ | సం॥ | నె॥ | రో॥ | సం॥ | నె॥ | రో॥ | సం॥ | నె॥ | రో॥ | సం॥ | నె॥ | రో॥ | సం॥ | నె॥ | రో॥ | సం॥ | నె॥ | రో॥ | దశా సం॥ |
| 1.రవి | 0 | 3 | 18 | 0 | 6 | 0 | 0 | 4 | 6 | 0 | 10 | 24 | 0 | 9 | 18 | 0 | 11 | 12 | 0 | 10 | 6 | 0 | 4 | 6 | 1 | 0 | 0 | 6 సం॥ |
| 2.చంద్ర | 0 | 6 | 0 | 0 | 10 | 0 | 0 | 7 | 0 | 1 | 6 | 0 | 1 | 4 | 0 | 1 | 7 | 0 | 1 | 5 | 0 | 0 | 7 | 0 | 1 | 8 | 0 | 10 సం॥ |
| 3.కుజ | 0 | 4 | 6 | 0 | 7 | 0 | 0 | 4 | 27 | 1 | 0 | 18 | 0 | 11 | 6 | 1 | 1 | 9 | 0 | 11 | 27 | 0 | 4 | 27 | 1 | 2 | 0 | 7 సం॥ |
| 4.రాహు | 0 | 10 | 24 | 1 | 6 | 0 | 1 | 0 | 18 | 2 | 8 | 12 | 2 | 4 | 24 | 2 | 10 | 06 | 2 | 6 | 18 | 1 | 0 | 18 | 3 | 0 | 0 | 18 సం॥ |
| 5.గురు | 0 | 9 | 18 | 1 | 4 | 0 | 0 | 11 | 6 | 2 | 4 | 24 | 2 | 1 | 18 | 2 | 6 | 12 | 2 | 3 | 6 | 0 | 11 | 6 | 2 | 8 | 0 | 16 సం॥ |
| 6.శని | 0 | 11 | 12 | 1 | 7 | 0 | 1 | 1 | 9 | 2 | 10 | 6 | 2 | 6 | 12 | 3 | 0 | 3 | 2 | 8 | 9 | 1 | 1 | 9 | 3 | 2 | 0 | 19 సం॥ |
| 7.బుధ | 0 | 10 | 6 | 1 | 5 | 0 | 0 | 11 | 27 | 2 | 6 | 18 | 2 | 3 | 6 | 2 | 8 | 9 | 2 | 4 | 27 | 0 | 11 | 27 | 2 | 10 | 0 | 17 సం॥ |
| 8.కేతు | 0 | 4 | 6 | 0 | 7 | 0 | 0 | 4 | 27 | 1 | 0 | 18 | 0 | 11 | 6 | 1 | 1 | 9 | 0 | 11 | 27 | 0 | 4 | 27 | 1 | 2 | 0 | 7 సం॥ |
| 9.శుక్ర | 1 | 0 | 0 | 1 | 8 | 0 | 1 | 2 | 0 | 3 | 0 | 0 | 2 | 8 | 0 | 3 | 2 | 0 | 2 | 10 | 0 | 1 | 2 | 0 | 3 | 4 | 0 | 20 సం॥ |

## నక్షత్రములకు వింశోత్తరి గ్రహ మహాదశల సంవత్సరములు

| జన్మ నక్షత్రము | గ్రహ మహాదశ | దశా ప్రమాణము | జన్మ నక్షత్రము | గ్రహ మహాదశ | దశా ప్రమాణము |
|---|---|---|---|---|---|
| 1. కృత్తిక-ఉత్తర-ఉత్తరాషాఢ | రవి మహాదశ | 6 సం॥ములు | 6. పుష్యమి-అనురాధ-ఉ॥భాద్ర | శని మహాదశ | 19 సం॥ములు |
| 2. రోహిణి-హస్త-శ్రవణము | చంద్ర మహాదశ | 10 సం॥ములు | 7. ఆశ్లేష-జ్యేష్ఠ-రేవతి | బుధ మహాదశ | 17 సం॥ములు |
| 3. మృగశిర-చిత్త-ధనిష్ఠ | కుజ మహాదశ | 7 సం॥ములు | 8. అశ్విని-మఖ-మూల | కేతు మహాదశ | 7 సం॥ములు |
| 4. ఆరుద్ర-స్వాతి-శతభిషము | రాహు మహాదశ | 18 సం॥ములు | 9. భరణి-పుబ్బ-పూర్వాషాఢ | శుక్ర మహాదశ | 20 సం॥ములు |
| 5. పునర్వసు-విశాఖ-పూ॥భాద్ర | గురు మహాదశ | 16 సం॥ములు | -------------------------- | ------------ | ------------ |







# గృహవాస్తు - ముఖ్యాంశములు

ఒక గ్రామము లేదా పట్టణము నందు గృహమును నిర్మించదలచిన వారు, ఒక గృహము నందు నివాసము ఉండదలచిన వారు లేదా ఒక స్థలమును కొనదలచినవారు, ముందుగా తమ నామరాశి నుండి ఆ గ్రామము లేదా పట్టణము యొక్క నామరాశి వరకు లెక్కించగా వచ్చిన సంఖ్యను బట్టి గ్రామార్యణము తెలుసుకొని ముందుకు వెళ్ళవలెను. నామరాశి నుండి గ్రామరాశి వరకు లెక్కించగా వచ్చిన సంఖ్యలు వరుసగా ఈ క్రింది ఫలితములను తెలియచేయును.

1. స్థానబలము 2. అర్థబలము 3. అంగబలము 4. బంధుబలము 5. బుద్ధిబలము 6. శత్రు-రోగ-ఋణ బాధలు 7. రాజకీయ-కళా నైపుణ్యము 8. అష్టకష్టములు 9. అదృష్టము 10. పదవీ యోగము 11. లాభములు 12. ఖర్చులు.

స్థలమును ఎన్నుకునే ముందుగా స్థల ఆకారమును పూర్తిగా పరిశీలించ వలెను. చతురస్రాకారపు భూమి, దీర్ఘ చతురస్రాకారపు భూమి, గుండ్రని భూమి శుభమును కలిగించును. 6 కోణములు గల భూమిని, చేట మరియు విసనకర్ర ఆకారము గల భూములను కొనరాదు. సాధారణముగా తూర్పు-ఉత్తరము రోడ్ల కలయికతో ఉన్న ఈశాన్య భూమి ఉత్తమమైనది. ఏక రోడ్డుతో ఉన్న అన్ని దిక్కుల భూములు అనుకూలమైనవి. ఉత్తరము-పడమర రోడ్ల కలయికతో ఉన్న వాయువ్య భూమి సాధారణమైనది. తూర్పు-దక్షిణము రోడ్ల కలయికతో ఉన్న ఆగ్నేయ భూమి మరియు దక్షిణము-పడమర రోడ్ల కలయికతో ఉన్న నైఋతి భూమి అందరికీ ఉప యోగపడవు. మూడు రోడ్ల కలయికతో ఏర్పడిన పశ్చిమ మరియు దక్షిణ భూములు అధమమైనవి. మూడు రోడ్ల కలయికతో ఏర్పడిన తూర్పు మరియు ఉత్తర భూములు శుభమైనవి. నలుదిక్కులా నాలుగు రోడ్ల కలయి కతో ఏర్పడిన భూమి శ్రేష్ఠమైనది. ఉత్తర ఈశాన్యము-ఈశాన్యము- తూర్పు ఈశాన్యము-తూర్పు-ఉత్తరము వీధిశూలలు గల స్థలములు మంచివి. దక్షిణ ఆగ్నేయము-పశ్చిమ వాయువ్యము వీధిశూలలు గల భూములు సామాన్యమైనవి. తూర్పు ఆగ్నేయము-ఆగ్నేయము-దక్షిణము-దక్షిణ నైఋతి-నైఋతి-పశ్చిమ నైఋతి-పశ్చిమము-వాయువ్యము-ఉత్తర వాయువ్యము వీధిశూలలు గల భూములు చెడు చేయును.

భూమిని కొనేముందుగా భూ పరీక్ష చేయుట ఉత్తమము. కొనవలసిన భూమి నందు సమాన పొడవు, వెడల్పు మరియు లోతు కొలతలతో ఒక గొయ్యిని త్రవ్వవలెను. వెంటనే ఆ త్రవ్విన గొయ్యి మట్టితోనే అ గొయ్యిని పూడ్చవలెను. అలా పూడ్చగా కొంత మట్టి మిగిలినచో ఆ భూమి చాలా ఉత్తమమైనది. మట్టి మిగలకుండా సరిపడినచో ఆ భూమి మధ్యస్థమైనది. గొయ్యి పూడ్చినపుడు మట్టి కొఱత అగునచో, అనగా పూడ్చుటకు ఇంకా

మట్టి అవసరమగునచో ఆ భూమి అధమమైనది.

స్థలమును కొనుగోలు చేసాక, గృహ నిర్మాణము చేయు ముందుగా భూ శోధన చేయుట ఉత్తమము. అనగా మనిషి ఎత్తున పొడవు-వెడల్పు-నిలువుగా ఒక గొయ్యి త్రవ్వి పరిశీలన చేయగా ఎటువంటి అశుభ వస్తువులు లేదా శల్యములు అగుపడినచో, ఆ స్థలమును పూర్తిగా త్రవ్వించి ఆ త్రవ్విన మట్టిని పారబోయించి, శుభ చిహ్నములు గల క్రొత్త మట్టిని పోయించవలెను.

ఇల్లును నిర్మించదలచిన వారు ఇంటి చుట్టూ ప్రదక్షిణము చేయు వీలుగా ఖాళీ స్థలమును వదిలి నిర్మాణము చేయుట శ్రేయస్కరము. సరిహద్దు గోడలమీద గృహనిర్మాణము చేయరాదు.

గృహవాస్తు నందు నామరాశియే ప్రధానమైనది. జన్మరాశిని గ్రహించరాదు. వర్గులను బట్టి అనగా "అ-క-చ-ట- త-ప-య-శ" వర్గులలో మన యొక్క నామాక్షరము ను గ్రహించి ఆ వర్గుకు చెప్పబడిన దిశా గృహమును నిర్మాణము చేసుకొనుట మంచిది. అ-క వర్గుల వారికి తూర్పు గృహము అనగా పశ్చిమ సింహద్వారము గల గృహము, చ-ట వర్గుల వారికి దక్షిణ గృహము అనగా ఉత్తర సింహ ద్వారము గల గృహము, త-ప వర్గుల వారికి పడమర గృహము అనగా తూర్పు సింహ ద్వారము గల గృహము, మరియు య-శ వర్గుల వారికి ఉత్తర గృహము అనగా దక్షిణ సింహ ద్వారము గల గృహము ఉత్తమము.

గృహ నిర్మాణమునకు వైశాఖము-శ్రావణము-కార్తీకము-మాఘము-ఫాల్గుణ మాసములు శుభమైనవి. భార్య గర్భవతిగా ఉండగా 6వ మాసము రాకుండా భర్త గృహనిర్మాణము చేయవచ్చును. ఇల్లు కట్టి, గృహప్రవేశము చేసిన తదుపరి వివాహము చేయుట ఉత్తమము. క్రొత్త కోడలితో తొలి గృహప్రవేశము చేయరాదు. వివాహము తదుపరి 6 నెలల నుండి 12 నెలల వరకు నూతన గృహనిర్మాణము చేయరాదు.

1. గృహము కుట్టుకొను స్థలము చతురస్రముగాను లేదా దీర్ఘచతురస్రముగాను ఉండవలెను.
2. గృహము చుట్టూ దక్షిణ,పడమర దిశలలో సమాన ఖాళీ వదలి, తూర్పు రెండొంతులు,ఉత్తరము మూడొంతులు ఖాళీస్థలము ఉంచవలెను.
3. నైఋతి-ఆగ్నేయ-వాయువ్య-ఈశాన్యవిదిక్కులు క్రమశ్రేణిలో ఎత్తు తగ్గుతూ ఉండాలి. అనగా ఏ విదిక్కు నుండి చూసిననూ ఈశాన్యము పల్లముగాను, నైఋతి మెరకగాను ఉండాలి.
4. గృహగర్భము కంటే, చుట్టూ నలుదిశలా ఉన్న వాకిలి ఎత్తుగా ఉండరాదు.
5. ప్రధానగృహమునే కాకుండా ఉపగృహములను కూడా సరిహద్దు గోడలపై నిర్మించరాదు.
6. ఉపగృహములను ఏ దిశలోనూ ప్రధానగృహము కంటే ఎత్తుగా నిర్మించరాదు.
7. ప్రధానగృహమునకు ఉపగృహమునకు మధ్య ఆకాశము కనిపించునట్లుగా నిర్మాణము చేయవలెను.
8. గృహముల యొక్క చూరులు లేదా సన్‌షేడ్‌లు, సరిహద్దుగోడల పైకి ఎక్కరాదు.





9. గృహమునకుపెట్టు కిటికీలు-ద్వారములు-అరమరలు సరిసంఖ్యలోనే ఉంటూ, వాటిని మొత్తము చేయగా సరిసంఖ్యలోనే ఉండాలి.సున్నాలు (10,20,30...),బేసి సంఖ్యలు(3,5,7...) పనికిరావు.
10. గృహము యొక్క వెలుపలి భాగమును కొలిచి,9భాగములు చేసి 4,5,6 భాగములలో ద్వారములను ఉంచుట శ్రేయస్కరము.
11. వాటాలులేని గృహములకు...తూర్పు-ఉత్తరీశాన్యములు,దక్షిణఆగ్నే యము, పశ్చిమ వాయువ్యము నందు ద్వారములు పెట్టుకోవాలి. మిగిలిన విదిక్కులు పనికిరావు.
12. సింహద్వారమునకు ఎదురుగా శూలలు గాని వేధలు గాని ఉండరాదు.
13. తూర్పుసింహద్వారము గల గృహమునకు ఆగ్నేయములోను,దక్షిణ ద్వారము గల గృహమునకు మరియు పశ్చిమ ద్వారము గల గృహమునకు నైఋతి దిశలోను,ఉత్తరసింహద్వారము గల గృహమునకు వాయువ్యములోను మేడ మెట్లు కట్టుకోవలెను.
14. మెట్లు ఎక్కినపుడు దక్షిణ,పశ్చిమ దిశలకు అభిముఖముగా ఉండవలెను.
15. స్థలమునకు ఉత్తరీశాన్యములో మంచినీటి బావిని త్రవ్వించుకోవలెను.
16. ఓవర్‌హెడ్‌ట్యాంక్‌లను పశ్చిమనైఋతిలో మాత్రమే నిర్మించవలెను.
17. జాతకములో గృహనిర్మాణయోగము ఉన్నప్పుడే గృహనిర్మాణ పనులు ముందుకు సాగును.వాస్తుకంటే గ్రహస్థితి బలమైనదని గ్రహించవలెను.
18. ఇంటికి పదము,ఆయము నిర్మించుట మాయకాదు. అందులో నిగూఢ శాస్త్ర విజ్ఞానము ఉన్నదని మరువరాదు. వసారాలు లేకుండా ఇల్లు నిర్మించరాదు.
19. వరుసలు-పొరులు తప్పించి ఇంటినిర్మాణము చేయరాదు. ఉపగృహములు ప్రధాన గృహమును తాకరాదు. ఒక నైఋతిదిశ తప్ప,మిగిలిన విదిక్కులలో మూత వేయరాదు.
20. ఈశాన్యము మూత వేసినచో సంతానము లేకపోవుట లేదా పురుష సంతతి లేకుండుట,దారిద్ర్యబాధలు-అవమానములు కలుగును.
21. ఆగ్నేయము మూతవేసినచో శస్త్రచికిత్సలు-అనారోగ్యములు- కోర్టుసమస్యలు-విడాకులు-స్త్రీసంతాన అరిష్టములు-ఇంటాబయటా కలహములు.
22. వాయువ్యము మూతవేసిన యెడల ఆస్మా-ఉబ్బసము-ప్రవాసము- మనోచాంచల్యము-ఏ పని లేకుండా తిరుగుటవంటి చెడు ఫలితము లుండును.
23. ఉమ్మడి కుటుంబ జీవనము చేయునప్పుడు, అన్నదమ్ములు తండ్రితో కలసి ఒకే కప్పు క్రింద ఉండవచ్చు.
24. అన్నదమ్ములు వేరు వేరుగా సంసారములు చేయునప్పుడు, ఒకే కప్పు క్రింద కాపురము చేయరాదు. అటుల చేసిన యెడల ఆ ఇల్లు ఎవరో ఒక్కరికి మాత్రమే యోగించవచ్చును, లేదా ఇరువురికి ఉపయోగపడక పోవచ్చు.
25. అన్నదమ్ములు ఒక గృహమును పంచుకోరాదు. అన్నదమ్ములు స్థలమును మాత్రమే పంచుకోవలయును.
26. ఇల్లుకట్టించి పడగొట్టించేవాడు శాస్త్రజ్ఞుడు కాలేడు. ఫలితనిరూపణ చేయగలిగినవాడే నిజమైన వాస్తుశాస్త్రజ్ఞుడు అగును!

వివాహమునకు కేవలము నక్షత్ర పొంతన మాత్రమే సరిపోదు.



| వధూనక్షత్రము | వధువుకు అనుకూలించు వరుని నక్షత్రములు |
|---|---|
| అశ్విని | భరణి,పుష్యమి,ఆశ్లేష,మఖ,పుబ్బ,అనురాధ,పూర్వాషాఢ,శ్రవణము,ఉత్తరాభాద్ర,రేవతి. |
| భరణి | అశ్విని,కృత్తిక1,పునర్వసు,ఆశ్లేష,మఖ,పుబ్బ,ఉత్తర1,విశాఖ,జ్యేష్ఠ,మూల,పూర్వాషాఢ,ఉత్తరాషాఢ,రేవతి. |
| కృత్తిక 1 | అశ్విని,భరణి,ఆరుద్ర,పుష్యమి,పుబ్బ,ఉత్తర1,చిత్త3,4,అనురాధ,మూల,శతభిషము,ఉత్తరాభాద్ర. |
| కృత్తిక 2,3,4 | రోహిణి,పుష్యమి,మఖ,పుబ్బ,ఉత్తర,హస్త,అనురాధ,శతభిషము,ఉత్తరాభాద్ర. |
| రోహిణి | కృత్తిక2,3,4,మృగశిర,పునర్వసు,పుబ్బ,ఉత్తర,హస్త,చిత్త,జ్యేష్ఠ,శ్రవణము,ధనిష్ఠ,పూర్వాభాద్ర,రేవతి. |
| మృగశిర 1,2 | కృత్తిక2,3,4,రోహిణి,ఆరుద్ర,పుష్యమి,మఖ,ఉత్తర,హస్త,స్వాతి,అనురాధ,శ్రవణము,శతభిషము. |
| మృగశిర 3,4 | అశ్విని,కృత్తిక,రోహిణి,ఆరుద్ర,మఖ,ఉత్తర,హస్త,స్వాతి,మూల,శ్రవణము,శతభిషము. |
| ఆరుద్ర | భరణి,రోహిణి,మృగశిర,పునర్వసు1,2,3,పుబ్బ,హస్త,చిత్త స్వాతి,విశాఖ1,2,3,పూ॥షాఢ,ధనిష్ఠ3,4,పూ॥భా॥4,రేవతి. |
| పునర్వసు 1,2,3 | అశ్విని,కృత్తిక,మృగశిర,ఆరుద్ర,ఉత్తర,చిత్త,స్వాతి,విశాఖ 1,2,3,ధనిష్ఠ3,4,ఉత్తరాభాద్ర. |
| పునర్వసు 4 | అశ్విని,కృత్తిక,మృగశిర1,2,పుష్యమి,ఉత్తర2,3,4,చిత్త,స్వాతి,విశాఖ,అనురాధ,ధనిష్ఠ1,2,ఉత్తరాభాద్ర. |
| పుష్యమి | భరణి,రోహిణి,పునర్వసు4,ఆశ్లేష,హస్త,స్వాతి,విశాఖ,అనురాధ,జ్యేష్ఠ,పూర్వాభాద్ర4,ఉత్తరాభాద్ర,రేవతి. |
| ఆశ్లేష | అశ్విని,కృత్తిక,మృగశిర1,2,పునర్వసు4,పుష్యమి,ఉత్తర 2,3,4,చిత్త,అనురాధ,జ్యేష్ఠ,ధనిష్ఠ1,2,పూ॥భా॥4,ఉ॥భా॥ |
| మఖ | అశ్విని,భరణి,ఆరుద్ర,పుష్యమి,పుబ్బ,అనురాధ,జ్యేష్ఠ,మూల,పూర్వాషాఢ,శతభిషము. |
| పుబ్బ | అశ్విని,భరణి,కృత్తిక,మృగశిర3,4,మఖ,ఉత్తర1,విశాఖ,జ్యేష్ఠ,మూల,పూర్వాషాఢ,ఉత్తరాషాఢ1,పూర్వాభాద్ర,రేవతి |
| ఉత్తర 1 | అశ్విని,భరణి,కృత్తిక,రోహిణి,ఆరుద్ర,పుష్యమి,మఖ, పుబ్బ,స్వాతి,అనురాధ,పూర్వాషాఢ,ఉత్తరాషాఢ1,ఉత్తరాభాద్ర. |
| ఉత్తర 2,3,4 | కృత్తిక2,3,4,రోహిణి,ఆరుద్ర,పుష్యమి,హస్త,స్వాతి,అనురాధ,పూర్వాషాఢ,ఉత్తరాషాఢ,శ్రవణము,ఉత్తరాభాద్ర. |
| హస్త | కృత్తిక2,3,4,రోహిణి,మృగ॥,పున॥,ఆశ్లేష,ఉత్తర2,3,4,చిత్త,విశాఖ4,పూ॥షా॥,ఉ॥షా॥,శ్రవణము,ధనిష్ఠ,పూ॥భా॥4,రేవతి. |
| చిత్త 1,2 | కృత్తిక2,3,4,రోహిణి,ఆరుద్ర,హస్త,స్వాతి,విశాఖ,మూల,ఉత్తరాషాఢ1,శ్రవణము,శతభిషము. |



వివాహ పొంతనలో నక్షత్ర పొంతన ఒక సాధారణ ప్రక్రియ మాత్రమే.



| వధూనక్షత్రము | వధువుకు అనుకూలించు వరుని నక్షత్రములు |
|---|---|
| చిత్త 3,4 | అశ్విని,కృత్తిక,రోహిణి,ఆరుద్ర,మఖ,హస్త,స్వాతి,విశాఖ 1,2,3,మూల,ఉత్తరాషాఢ,శ్రవణము,శతభిషము. |
| స్వాతి | భరణి,మృగశిర,ఆరుద్ర,పునర్వసు,పుబ్బ,హస్త,చిత్త, విశాఖ 1,2,3,పూర్వాషాఢ,శ్రవణము,ధనిష్ఠ3,4,పూర్వాభాద్ర1,2,3. |
| విశాఖ 1,2,3 | అశ్విని,మృగశిర,ఆరుద్ర,పునర్వసు,పుష్యమి,చిత్త,స్వాతి,మూల,ధనిష్ఠ,శతభిషము,పూర్వాభాద్ర1,2,3. |
| విశాఖ 4 | మృగశిర1,2,పునర్వసు4,పుష్యమి,మఖ,చిత్త1,2, అనురాధ,మూల,ధనిష్ఠ,శతభిషము,పూర్వాభాద్ర. |
| అనురాధ | రోహిణి,పునర్వసు4,పుష్యమి,ఆశ్లేష,పుబ్బ,హస్త,విశాఖ4,జ్యేష్ఠ,శ్రవణము,శతభిషము,పూర్వాభాద్ర,ఉ॥భాద్ర,రేవతి. |
| జ్యేష్ఠ | కృత్తిక,మృగశిర1,2,పుష్యమి,ఆశ్లేష,మఖ,చిత్త1,2,విశాఖ4 అనురాధ,ఉత్తరాషాఢ2,3,4,ధనిష్ఠ,ఉత్తరాభాద్ర,రేవతి. |
| మూల | భరణి,మఖ,పుబ్బ,స్వాతి,పూర్వాషాఢ,శతభిషము,ఉత్తరాభాద్ర,రేవతి. |
| పూర్వాషాఢ | అశ్విని,భరణి,మృగశిర3,4,పునర్వసు,మఖ,పుబ్బ,ఉత్తర,విశాఖ,జ్యేష్ఠ,మూల,ఉత్తరాషాఢ1,పూర్వాభాద్ర,రేవతి. |
| ఉత్తరాషాఢ 1 | అశ్విని,భరణి,ఆరుద్ర,పుష్యమి,పుబ్బ,ఉత్తర,హస్త,స్వాతి,అనురాధ,మూల,పూర్వాషాఢ,శతభిషము,ఉత్తరాభాద్ర. |
| ఉ॥షాఢ 2,3,4 | అశ్విని,భరణి,ఆరుద్ర,పుష్యమి,ఉత్తర2,3,4,హస్త,స్వాతి,అనురాధ,శ్రవణము,ఉత్తరాభాద్ర. |
| శ్రవణము | భరణి,మృగశిర,పునర్వసు,ఉత్తర2,3,4,హస్త,చిత్త,జ్యేష్ఠ,ఉత్తరాషాఢ2,3,4,ధనిష్ఠ,పూర్వాభాద్ర,రేవతి. |
| ధనిష్ఠ 1,2 | అశ్విని,కృత్తిక,రోహిణి,హస్త,స్వాతి,ఉత్తరాషాఢ2,3,4,శ్రవణము,శతభిషము. |
| ధనిష్ఠ 3,4 | అశ్విని,కృత్తిక,రోహిణి,ఆరుద్ర,మఖ,ఉత్తర1,హస్త,స్వాతి,మూల,ఉత్తరాషాఢ2,3,4,శ్రవణము,శతభిషము. |
| శతభిషము | భరణి,రోహిణి,మృగశిర,పుబ్బ,చిత్త,విశాఖ,జ్యేష్ఠ,పూర్వాషాఢ,ధనిష్ఠ,పూర్వాభాద్ర1,2,3. |
| పూ॥భాద్ర1,2,3 | కృత్తిక,మృగశిర,మఖ,చిత్త,స్వాతి,విశాఖ,అనురాధ,ఉత్తరాషాఢ,ధనిష్ఠ,శతభిషము. |
| పూర్వాభాద్ర 4 | కృత్తిక2,3,4,మృగశిర,ఆరుద్ర,పునర్వసు,పుష్యమి,చిత్త 1,2,విశాఖ4,అనురాధ,ఉత్తరాషాఢ,ధనిష్ఠ1,2,ఉత్తరాభాద్ర. |
| ఉత్తరాభాద్ర | రోహిణి,ఆరుద్ర,పునర్వసు,పుష్యమి,ఆశ్లేష,హస్త, అనురాధ,జ్యేష్ఠ,పూ॥షాఢ,శ్రవణము,పూ॥భాద్ర4,ఉత్తరాభాద్ర,రేవతి. |
| రేవతి | అశ్విని,మృగశిర,పునర్వసు,పుష్యమి,ఉత్తర,చిత్త1,2,అనురాధ,జ్యేష్ఠ,మూల,ఉత్తరాషాఢ,ఉత్తరాభాద్ర.1 |

**సౌరచంద్రజ్యోతిష పంచాంగము**

| వరనక్షత్రము | వరుడుకు అనుకూలించు వధువు నక్షత్రములు |
|---|---|
| అశ్విని | భరణి,కృత్తిక1,మృగశిర3,4,పునర్వసు,ఆశ్లేష,మఖ,పుబ్బ, ఉత్తర1,చిత్త3,4,విశాఖ1,2,3,పూర్వాషాఢ,ఉత్తరాషాఢ,ధనిష్ఠ |
| భరణి | అశ్విని,కృత్తిక1,ఆరుద్ర,పుష్యమి,మఖ,పుబ్బ,ఉత్తర1,స్వాతి, మూల,పూర్వాషాఢ,ఉత్తరాషాఢ,శ్రవణము,శతభిషము. |
| కృత్తిక 1 | భరణి,మృగశిర3,4,పునర్వసు,ఆశ్లేష,పుబ్బ,ఉత్తర1,చిత్త3,4, జ్యేష్ఠ,ధనిష్ఠ,పూర్వాభాద్ర1,2,3. |
| కృత్తిక 2,3,4 | రోహిణి,మృగశిర,పునర్వసు,ఆశ్లేష,పుబ్బ,ఉత్తర,హస్త,చిత్త, జ్యేష్ఠ,ధనిష్ఠ,పూర్వాభాద్ర. |
| రోహిణి | కృత్తిక2,3,4,మృగశిర,ఆరుద్ర,పుష్యమి,ఉత్తర,హస్త,చిత్త, అనురాధ,ధనిష్ఠ,శతభిషము,ఉత్తరాభాద్ర. |
| మృగశిర 1,2 | రోహిణి,ఆరుద్ర,పునర్వసు,ఆశ్లేష,హస్త,స్వాతి,విశాఖ, జ్యేష్ఠ, శ్రవణము,శతభిషము,పూర్వాభాద్ర,రేవతి. |
| మృగశిర 3,4 | రోహిణి,ఆరుద్ర,పునర్వసు,పుబ్బ,హస్త,స్వాతి, విశాఖ1,2,3, పూర్వాషాఢ,శ్రవణము,శతభిషము,పూర్వాభాద్ర,రేవతి. |
| ఆరుద్ర | కృత్తిక1,మృగశిర,పునర్వసు1,2,3,మఖ,ఉత్తర,చిత్త,స్వాతి, విశాఖ1,2,3,ఉత్తరాషాఢ,ధనిష్ఠ3,4,పూ॥భాద్ర4,ఉ॥భాద్ర. |
| పునర్వసు 1,2,3 | భరణి,రోహిణి,ఆరుద్ర,హస్త,స్వాతి,విశాఖ1,2,3,పూర్వా షాఢ,శ్రవణము,పూర్వాభాద్ర,ఉత్తరాభాద్ర,రేవతి. |
| పునర్వసు 4 | భరణి,రోహిణి,పుష్యమి,ఆశ్లేష,హస్త,స్వాతి,విశాఖ,అను రాధ,పూర్వాషాఢ,శ్రవణము,పూర్వాభాద్ర4,ఉ॥భాద్ర,రేవతి. |
| పుష్యమి | కృత్తిక,మృగశిర1,2,పునర్వసు4,ఆశ్లేష,మఖ,ఉత్తర,విశాఖ, అనురాధ,జ్యేష్ఠ,ఉత్తరాషాఢ,పూర్వాభాద్ర4,ఉ॥భాద్ర,రేవతి. |
| ఆశ్లేష | అశ్విని,భరణి,పుష్యమి,హస్త,అనురాధ,జ్యేష్ఠ,ఉత్తరాభాద్ర. |
| మఖ | అశ్విని,భరణి,కృత్తిక2,3,4,మృగశిర,పుబ్బ,ఉత్తర1,చిత్త3,4, విశాఖ4,జ్యేష్ఠ,పూర్వాషాఢ,ధనిష్ఠ3,4,పూర్వాభాద్ర1,2,3. |
| పుబ్బ | అశ్విని,భరణి,కృత్తిక,రోహిణి,ఆరుద్ర,మఖ,ఉత్తర1,స్వాతి, అనురాధ,మూల,పూర్వాషాఢ,ఉత్తరాషాఢ1,శతభిషము. |
| ఉత్తర 1 | భరణి,కృత్తిక,రోహిణి,మృగశిర,పునర్వసు1,2,3,పుబ్బ, పూర్వాషాఢ,ఉత్తరాషాఢ1,ధనిష్ఠ3,4,రేవతి. |
| ఉత్తర 2,3,4 | కృత్తిక2,3,4,రోహిణి,మృగశిర,పునర్వసు,ఆశ్లేష,హస్త, పూర్వాషాఢ,ఉత్తరాషాఢ,శ్రవణము,రేవతి. |
| హస్త | కృత్తిక2,3,4,రోహిణి,మృగ॥,ఆరుద్ర,పుష్యమి,ఉత్తర2,3,4, చిత్త,స్వాతి,అనురాధ,ఉ॥షాఢ,శ్రవణము,ధనిష్ఠ,ఉ॥భాద్ర. |
| చిత్త 1,2 | రోహిణి,ఆరుద్ర,పునర్వసు,ఆశ్లేష,హస్త,స్వాతి,విశాఖ, జ్యేష్ఠ, శ్రవణము,శతభిషము,పూర్వాభాద్ర,రేవతి. |

**గమనిక : తారాబలము వధువు నుండి మాత్రమే లెక్కించవలెను.**





**సౌరచంద్రజ్యోతిష పంచాంగము**

| వరనక్షత్రము | వరుడుకు అనుకూలించు వధువు నక్షత్రములు |
|---|---|
| చిత్త 3,4 | కృత్తిక1,రోహిణి,ఆరుద్ర,పునర్వసు,ఆశ్లేష,హస్త,స్వాతి, విశాఖ1,2,3,శ్రవణము,శతభిషము,పూర్వాభాద్ర1,2,3. |
| స్వాతి | మృగశిర,ఆరుద్ర,పునర్వసు,పుష్యమి,ఉత్తర,చిత్త,విశాఖ 1,2,3,మూల,ఉత్తరాషాఢ,ధనిష్ఠ,పూర్వాభాద్ర1,2,3. |
| విశాఖ 1,2,3 | భరణి,ఆరుద్ర,పునర్వసు,పుష్యమి,పుబ్బ,చిత్త,స్వాతి, పూర్వా షాఢ,శతభిషము,పూర్వాభాద్ర1,2,3. |
| విశాఖ 4 | భరణి,పునర్వసు4,పుష్యమి,పుబ్బ,చిత్త1,2,అనురాధ, జ్యేష్ఠ పూర్వాషాఢ,శతభిషము,పూర్వాభాద్ర. |
| అనురాధ | అశ్విని,కృత్తిక,మృగ॥1,2,పునర్వసు4,పుష్యమి,ఆశ్లేష, మఖ, ఉత్తర,విశాఖ4,జ్యేష్ఠ,ఉ॥షాఢ,పూ॥భాద్ర,ఉ॥భాద్ర,రేవతి |
| జ్యేష్ఠ | భరణి,రోహిణి,పుష్యమి,ఆశ్లేష,మఖ,పుబ్బ,అనురాధ, పూర్వాషాఢ,శ్రవణము,శతభిషము,ఉత్తరాభాద్ర,రేవతి. |
| మూల | భరణి,కృత్తిక1,మృగశిర3,4,మఖ,పుబ్బ,చిత్త,విశాఖ, పూర్వా షాఢ,ఉత్తరాషాఢ1,ధనిష్ఠ3,4,రేవతి. |
| పూర్వాషాఢ | అశ్విని,భరణి,ఆరుద్ర,మఖ,పుబ్బ,ఉత్తర,హస్త,విశాఖ, మూల,ఉత్తరాషాఢ1,శతభిషము,ఉత్తరాభాద్ర. |
| ఉత్తరాషాఢ 1 | భరణి,పుబ్బ,ఉత్తర,హస్త,చిత్త,పూ॥షాఢ,పూ॥భాద్ర,రేవతి. |
| ఉ॥షాఢ 2,3,4 | భరణి,ఉత్తర2,3,4,హస్త,చిత్త3,4,జ్యేష్ఠ,శ్రవణము,ధనిష్ఠ, పూర్వాభాద్ర,రేవతి. |
| శ్రవణము | అశ్విని,రోహిణి,మృగశిర,ఉత్తర2,3,4,హస్త,చిత్త,స్వాతి, అనురాధ,ఉత్తరాషాఢ2,3,4,ధనిష్ఠ,శతభిషము,ఉత్తరాభాద్ర |
| ధనిష్ఠ 1,2 | రోహిణి,పునర్వసు4,ఆశ్లేష,హస్త,విశాఖ,జ్యేష్ఠ,శ్రవణము, శతభిషము,పూర్వాభాద్ర. |
| ధనిష్ఠ 3,4 | రోహిణి,ఆరుద్ర,పునర్వసు1,2,3,హస్త,స్వాతి,విశాఖ, జ్యేష్ఠ, శ్రవణము,శతభిషము,పూర్వాభాద్ర1,2,3. |
| శతభిషము | కృత్తిక,మృగశిర,మఖ,చిత్త,విశాఖ,అనురాధ,మూల, ధనిష్ఠ, పూర్వాభాద్ర1,2,3. |
| పూ॥భాద్ర1,2,3 | రోహిణి,పుబ్బ,స్వాతి,విశాఖ,అనురాధ,పూర్వాషాఢ,శ్రవ ణము,శతభిషము. |
| పూర్వాభాద్ర 4 | రోహిణి,ఆరుద్ర,పుష్యమి,ఆశ్లేష,పుబ్బ,హస్త,విశాఖ4, అనురాధ,పూర్వాషాఢ,శ్రవణము,ఉత్తరాభాద్ర. |
| ఉత్తరాభాద్ర | అశ్విని,కృత్తిక,పునర్వసు,పుష్యమి,ఆశ్లేష,ఉత్తర,అనురాధ, జ్యేష్ఠ,మూల,ఉత్తరాషాఢ,పూర్వాభాద్ర4,రేవతి. |
| రేవతి | అశ్విని,భరణి,రోహిణి,ఆరుద్ర,పుష్యమి,పుబ్బ,హస్త,అను రాధ,జ్యేష్ఠ,మూల,పూర్వాషాఢ,శ్రవణము,ఉత్తరాభాద్ర. |

**నైధనతార విషయములో వధువు నుండి వరునికి మాత్రమే వర్తించును.**

వ్యక్తి యొక్క కర్మవిపాకమును అనుసరించి జీవిత భాగస్వామి లభించును.



## వివాహ పొంతనలు - ముఖ్యాంశాలు

1. వధూవరులు ఏకనక్షత్రమైననూ ఏకరాశియైననూ వివాహము చేయరాదు. ఏకనక్షత్రమై భిన్నరాశులు అయిననూ,ఏకరాశియై భిన్న నక్షత్రమైననూ,వివాహము చేయవచ్చును. అయితే రోహిణి,ఆరుద్ర, పుష్యమి,మఖ,విశాఖ,శ్రవణము,ఉత్తరాభాద్ర,రేవతి నక్షత్రములు వధూవరులకు ఏకనక్షత్రములైన శుభము. అశ్విని,భరణి,ఆశ్లేష,పుబ్బ, స్వాతి,మూల,శతభిష నక్షత్రములు వధూవరులకు ఏకనక్షత్రములైననూ సామాన్యము. మిగిలిననక్షత్రములు ఏకనక్షత్రములైనచో అధమమము.
2. వధూవరులకు పరస్పరము నక్షత్రాధిపతుల మైత్రి, రాశ్యాధిపతుల మైత్రి, లగ్నాధిపతుల మైత్రి,యోని మైత్రి,గణ మైత్రి ఉండి వధూవర గుణమేళన చక్రమునందు 36గుణములకు 18గుణములు పైబడిన వివాహమునకు శుభము. వధూవరులిరువురూ ఏకగణములైన ఉత్తమము. దేవ-మనుష్య గణములైన యెడల శుభము. మనుష్య-రాక్షస గణములైన మధ్యమము. దేవ-రాక్షస గణములైన అధమము.
3. వధువు నక్షత్రము లగాయతు వరుని నక్షత్రము వరకు తారాబలమును లెక్కించగా సంపత్,క్షేమ,సాధన,మిత్ర,పరమమిత్ర తారలగుట ఉత్తమము. జన్మతార శుభము. విపత్,ప్రత్యక్త తారలు మధ్యమము. నైధనతార అధమము. వధువు నుండి వరుడు నైధనతార అయినచో ఎట్టిపరిస్థితులలోను వివాహము చేయరాదు. వరుని నుండి తారాబలము చూడరాదు.
4. వధూవరుల జన్మరాశులు లేదా జన్మలగ్నములు పరస్పరము శత్రు షష్ఠాష్టకములు, శత్రు ద్విర్ద్వాదశములు కారాదు. మిత్ర షష్ఠాష్టకములు, మిత్ర ద్విర్ద్వాదశములు అగుట సామాన్యము.
5. అశ్విని-జ్యేష్ఠలకు, భరణి-అనురాధలకు, కృత్తిక-విశాఖలకు, రోహిణి-స్వాతిలకు, ఆరుద్ర-శ్రవణములకు, పునర్వసు-ఉత్తరాషాఢలకు, పుష్యమి-పూర్వాషాఢలకు, ఆశ్లేష-మూలలకు, మఖ-రేవతిలకు, పుబ్బ-ఉత్తరాభాద్రలకు, ఉత్తర-పూర్వాభాద్రలకు, హస్త-శతభిషములకు పరస్పరము వేధ కలుగును. కావున ఈ వేధానక్షత్రములు వధూవరుల జన్మ నక్షత్రములైన యెడల నిత్యము కలహములు కలుగును. చిత్త,మృగశిర, ధనిష్ఠ నక్షత్రములు పరస్పర విరోధము కలిగియుండును.
6. మేష-కర్కాటక-తుల-మకర లగ్నములు చరలగ్నములగుట వలన వివాహ ముహూర్తమునకు శుభము కావు. వధూవరుల జన్మలగ్నములకు లేదా జన్మరాశులకు వివాహ ముహూర్త లగ్నము 6,8,12లగ్నములు కారాదు. వివాహ లగ్నమునకు 7డింట ఎటువంటి గ్రహములు ఉండరాదు. అష్టమశుద్ధి కూడా ఉండవలెను. చంద్రుడు పాపగ్రహములతో కూడరాదు. అశ్విని,రోహిణి,మృగశిర,మఖ,ఉత్తర, స్వాతి,అనురాధ, మూల,ఉత్తరాషాఢ,శ్రవణము,ధనిష్ఠ,ఉత్తరాభాద్ర,రేవతి నక్షత్రములు వివాహమునకు శ్రేష్ఠము. పుష్యమి,హస్త,చిత్త,శతభిష నక్షత్రములు సామాన్యము.



వ్యక్తి భవిష్యత్తుకు జాతక చక్రము ఉపయోగపడును. భార్యాభర్తల



# వధూవర గుణమేళన చక్రము

| వరుని నక్షత్రము → / వధువు నక్షత్రము ↓ | అశ్విని | భరణి | కృత్తిక 1 | కృత్తిక 3 | రోహిణి | మృగశిర 2 | మృగశిర 2 | ఆరుద్ర | పునర్వసు 3 | పునర్వసు 1 | పుష్యమి | ఆశ్లేష | మఖ | పుబ్బ | ఉత్తర 1 | ఉత్తర 3 | హస్త | చిత్త 2 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 28 | 33 | 28 | 18 | 21 | 22 | 26 | 17 | 18 | 22 | 31 | 27 | 21 | 26 | 17 | 11 | 09 | 13 |
| భరణి | 34 | 28 | 29 | 19 | 22 | 15 | 18 | 26 | 26 | 30 | 23 | 24 | 21 | 19 | 28 | 21 | 19 | 06 |
| కృత్తిక 1 | 27 | 27 | 28 | 17 | 09 | 15 | 19 | 20 | 21 | 25 | 26 | 23 | 17 | 21 | 22 | 15 | 15 | 18 |
| కృత్తిక 3 | 18 | 18 | 19 | 28 | 19 | 25 | 16 | 17 | 18 | 22 | 23 | 20 | 19 | 23 | 24 | 21 | 21 | 23 |
| రోహిణి | 23 | 23 | 10 | 19 | 28 | 36 | 27 | 23 | 23 | 27 | 26 | 13 | 12 | 26 | 28 | 25 | 26 | 20 |
| మృగశిర 2 | 22 | 13 | 15 | 27 | 34 | 28 | 20 | 25 | 23 | 26 | 19 | 22 | 21 | 17 | 25 | 23 | 27 | 13 |
| మృగశిర 2 | 27 | 18 | 21 | 18 | 25 | 20 | 28 | 33 | 31 | 19 | 10 | 15 | 24 | 20 | 28 | 30 | 34 | 21 |
| ఆరుద్ర | 19 | 27 | 21 | 18 | 24 | 26 | 34 | 28 | 25 | 13 | 20 | 13 | 23 | 29 | 22 | 24 | 24 | 27 |
| పునర్వసు 3 | 19 | 26 | 22 | 19 | 23 | 24 | 32 | 24 | 28 | 16 | 23 | 16 | 22 | 27 | 21 | 23 | 24 | 25 |
| పునర్వసు 1 | 21 | 28 | 23 | 20 | 24 | 25 | 19 | 10 | 14 | 28 | 35 | 28 | 15 | 20 | 14 | 18 | 18 | 20 |
| పుష్యమి | 30 | 21 | 26 | 23 | 24 | 17 | 10 | 18 | 21 | 35 | 28 | 30 | 18 | 14 | 23 | 26 | 27 | 12 |
| ఆశ్లేష | 25 | 23 | 22 | 19 | 12 | 21 | 13 | 12 | 15 | 28 | 28 | 28 | 15 | 15 | 17 | 20 | 20 | 26 |
| మఖ | 21 | 21 | 17 | 18 | 11 | 19 | 22 | 22 | 21 | 16 | 18 | 16 | 28 | 30 | 26 | 16 | 16 | 22 |
| పుబ్బ | 27 | 19 | 21 | 22 | 25 | 17 | 20 | 28 | 27 | 22 | 16 | 16 | 30 | 28 | 34 | 24 | 22 | 08 |
| ఉత్తర 1 | 18 | 27 | 22 | 23 | 27 | 25 | 28 | 21 | 21 | 16 | 25 | 18 | 26 | 34 | 28 | 18 | 16 | 14 |
| ఉత్తర 3 | 13 | 21 | 16 | 21 | 25 | 23 | 30 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 25 | 19 | 28 | 25 | 24 |
| హస్త | 11 | 20 | 16 | 21 | 26 | 26 | 33 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 22 | 17 | 26 | 28 | 27 |
| చిత్త 2 | 13 | 06 | 19 | 25 | 20 | 12 | 19 | 26 | 24 | 20 | 12 | 26 | 23 | 09 | 15 | 24 | 27 | 28 |
| చిత్త 2 | 22 | 15 | 28 | 23 | 20 | 12 | 13 | 20 | 18 | 20 | 12 | 26 | 25 | 10 | 17 | 17 | 20 | 21 |
| స్వాతి | 27 | 29 | 17 | 12 | 16 | 27 | 27 | 26 | 26 | 28 | 28 | 15 | 13 | 25 | 25 | 25 | 27 | 21 |
| విశాఖ 3 | 22 | 22 | 20 | 15 | 10 | 18 | 19 | 21 | 21 | 22 | 21 | 19 | 17 | 19 | 18 | 17 | 18 | 27 |
| విశాఖ 1 | 16 | 16 | 14 | 19 | 14 | 22 | 13 | 14 | 14 | 19 | 18 | 15 | 21 | 23 | 21 | 18 | 19 | 28 |
| అనురాధ | 24 | 14 | 19 | 24 | 27 | 20 | 11 | 16 | 21 | 26 | 18 | 21 | 24 | 20 | 29 | 26 | 27 | 12 |
| జ్యేష్ఠ | 12 | 18 | 24 | 29 | 22 | 22 | 13 | 03 | 06 | 10 | 20 | 26 | 31 | 23 | 16 | 13 | 12 | 25 |
| మూల | 12 | 20 | 24 | 19 | 13 | 14 | 21 | 15 | 12 | 08 | 17 | 24 | 25 | 19 | 09 | 13 | 13 | 27 |
| పూర్వాషాఢ | 27 | 20 | 19 | 13 | 20 | 12 | 18 | 26 | 26 | 23 | 13 | 17 | 21 | 19 | 27 | 27 | 26 | 11 |
| ఉత్తరాషాఢ 1 | 25 | 27 | 14 | 08 | 11 | 18 | 24 | 26 | 26 | 23 | 24 | 09 | 11 | 27 | 28 | 28 | 27 | 20 |
| ఉత్తరాషాఢ 3 | 28 | 29 | 16 | 14 | 17 | 22 | 20 | 22 | 22 | 27 | 28 | 13 | 06 | 22 | 23 | 26 | 25 | 17 |
| శ్రవణము | 27 | 26 | 13 | 10 | 17 | 26 | 23 | 21 | 23 | 28 | 26 | 15 | 17 | 18 | 20 | 23 | 25 | 18 |
| ధనిష్ఠ 2 | 20 | 10 | 26 | 23 | 20 | 12 | 08 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 05 | 12 | 16 | 18 | 16 |
| ధనిష్ఠ 2 | 20 | 11 | 26 | 30 | 27 | 19 | 10 | 19 | 19 | 14 | 05 | 20 | 25 | 11 | 19 | 17 | 21 | 18 |
| శతభిషము | 15 | 21 | 28 | 32 | 25 | 25 | 18 | 10 | 10 | 07 | 15 | 20 | 26 | 20 | 13 | 11 | 08 | 26 |
| పూర్వాభాద్ర 3 | 18 | 25 | 20 | 24 | 31 | 31 | 24 | 17 | 17 | 13 | 20 | 14 | 19 | 25 | 17 | 15 | 17 | 18 |
| పూర్వాభాద్ర 1 | 14 | 21 | 16 | 19 | 26 | 26 | 25 | 18 | 18 | 18 | 25 | 18 | 16 | 22 | 14 | 16 | 18 | 19 |
| ఉత్తరాభాద్ర | 24 | 15 | 18 | 21 | 25 | 17 | 16 | 25 | 27 | 26 | 19 | 20 | 17 | 15 | 25 | 27 | 26 | 09 |
| రేవతి | 25 | 24 | 11 | 14 | 17 | 26 | 25 | 24 | 25 | 24 | 27 | 13 | 12 | 22 | 22 | 24 | 26 | 20 |

శూద్రులకు యోనిపొంతనము, బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణకూటము, వైశ్యులకు రాశి లేక స్త్రీదీర్ఘకూటము శుభయుక్తమై ఉండి, 18గుణములకు పైనవచ్చిన యెడల వివాహమునకు శుభము.

# వధూవర గుణమేళన చక్రము

| వరుని నక్షత్రము ⇒ / వధువు నక్షత్రము ⇓ | చిత్త 2 | స్వాతి | విశాఖ 3 | విశాఖ 1 | అనురాధ | జ్యేష్ఠ | మూల | పూర్వాషాఢ | ఉత్తరాషాఢ 1 | ఉత్తరాషాఢ 3 | శ్రవణము | ధనిష్ఠ 2 | ధనిష్ఠ 2 | శతభిషము | పూర్వాభాద్ర 3 | పూర్వాభాద్ర 1 | ఉత్తరాభాద్ర | రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 22 | 26 | 22 | 19 | 26 | 15 | 13 | 27 | 24 | 26 | 24 | 21 | 21 | 15 | 16 | 14 | 24 | 26 |
| భరణి | 14 | 29 | 22 | 19 | 17 | 19 | 20 | 20 | 27 | 28 | 26 | 10 | 10 | 20 | 24 | 22 | 16 | 28 |
| కృత్తిక 1 | 27 | 15 | 19 | 16 | 20 | 26 | 24 | 19 | 14 | 15 | 10 | 25 | 25 | 27 | 19 | 17 | 19 | 11 |
| కృత్తిక 3 | 22 | 10 | 14 | 21 | 25 | 31 | 20 | 13 | 09 | 14 | 10 | 23 | 29 | 31 | 23 | 20 | 22 | 14 |
| రోహిణి | 19 | 15 | 09 | 16 | 30 | 24 | 14 | 20 | 11 | 17 | 18 | 20 | 26 | 24 | 30 | 27 | 26 | 19 |
| మృగశిర 2 | 10 | 25 | 17 | 23 | 22 | 25 | 15 | 11 | 18 | 21 | 24 | 13 | 19 | 27 | 29 | 26 | 17 | 27 |
| మృగశిర 2 | 14 | 27 | 19 | 14 | 11 | 13 | 23 | 18 | 24 | 20 | 25 | 12 | 13 | 21 | 23 | 27 | 17 | 27 |
| ఆరుద్ర | 20 | 27 | 20 | 13 | 17 | 04 | 16 | 27 | 27 | 22 | 22 | 17 | 18 | 11 | 16 | 19 | 27 | 27 |
| పునర్వసు 3 | 18 | 27 | 21 | 13 | 20 | 05 | 13 | 26 | 27 | 27 | 23 | 17 | 18 | 11 | 17 | 19 | 27 | 28 |
| పునర్వసు 1 | 20 | 27 | 20 | 19 | 26 | 10 | 08 | 20 | 21 | 28 | 27 | 21 | 12 | 07 | 11 | 17 | 25 | 25 |
| పుష్యమి | 11 | 26 | 21 | 20 | 19 | 22 | 17 | 11 | 22 | 26 | 25 | 13 | 04 | 14 | 18 | 24 | 18 | 27 |
| ఆశ్లేష | 25 | 11 | 16 | 15 | 20 | 26 | 22 | 16 | 08 | 12 | 13 | 27 | 18 | 18 | 12 | 18 | 20 | 12 |
| మఖ | 25 | 11 | 17 | 24 | 26 | 34 | 24 | 21 | 11 | 05 | 04 | 18 | 24 | 25 | 18 | 17 | 18 | 12 |
| పుబ్బ | 11 | 25 | 19 | 26 | 24 | 24 | 19 | 19 | 27 | 21 | 18 | 04 | 11 | 19 | 24 | 23 | 16 | 24 |
| ఉత్తర 1 | 17 | 26 | 17 | 24 | 32 | 19 | 10 | 27 | 28 | 22 | 20 | 11 | 18 | 12 | 16 | 15 | 26 | 24 |
| ఉత్తర 3 | 16 | 25 | 16 | 18 | 27 | 13 | 15 | 28 | 29 | 26 | 25 | 16 | 16 | 10 | 14 | 18 | 29 | 27 |
| హస్త | 19 | 26 | 17 | 19 | 26 | 12 | 14 | 26 | 27 | 23 | 24 | 19 | 19 | 07 | 14 | 19 | 27 | 27 |
| చిత్త 2 | 20 | 19 | 26 | 18 | 11 | 25 | 28 | 13 | 21 | 17 | 19 | 18 | 18 | 24 | 18 | 22 | 11 | 21 |
| చిత్త 2 | 28 | 27 | 34 | 24 | 07 | 21 | 28 | 13 | 21 | 25 | 27 | 26 | 20 | 26 | 20 | 15 | 04 | 13 |
| స్వాతి | 28 | 28 | 20 | 10 | 23 | 18 | 23 | 26 | 18 | 22 | 23 | 07 | 21 | 20 | 25 | 19 | 20 | 13 |
| విశాఖ 3 | 34 | 18 | 28 | 18 | 17 | 21 | 28 | 21 | 13 | 17 | 17 | 32 | 26 | 26 | 22 | 16 | 13 | 05 |
| విశాఖ 1 | 23 | 08 | 17 | 28 | 27 | 31 | 23 | 17 | 09 | 12 | 12 | 27 | 27 | 26 | 22 | 21 | 18 | 09 |
| అనురాధ | 07 | 22 | 17 | 28 | 28 | 31 | 16 | 14 | 22 | 25 | 26 | 12 | 12 | 22 | 24 | 24 | 18 | 27 |
| జ్యేష్ఠ | 20 | 17 | 20 | 31 | 30 | 28 | 15 | 17 | 17 | 20 | 20 | 25 | 25 | 18 | 11 | 09 | 21 | 21 |
| మూల | 27 | 21 | 27 | 24 | 26 | 16 | 28 | 27 | 25 | 15 | 15 | 21 | 25 | 21 | 14 | 17 | 25 | 27 |
| పూర్వాషాఢ | 11 | 26 | 19 | 18 | 18 | 19 | 27 | 28 | 34 | 24 | 23 | 08 | 15 | 22 | 29 | 32 | 23 | 32 |
| ఉత్తరాషాఢ 1 | 20 | 19 | 12 | 11 | 25 | 19 | 25 | 34 | 28 | 18 | 15 | 15 | 22 | 22 | 28 | 31 | 32 | 23 |
| ఉత్తరాషాఢ 3 | 24 | 23 | 16 | 14 | 28 | 22 | 16 | 25 | 19 | 28 | 25 | 25 | 17 | 17 | 23 | 30 | 32 | 23 |
| శ్రవణము | 25 | 23 | 16 | 14 | 28 | 23 | 17 | 25 | 15 | 24 | 28 | 30 | 20 | 18 | 23 | 32 | 31 | 24 |
| ధనిష్ఠ 2 | 24 | 26 | 30 | 28 | 14 | 28 | 21 | 09 | 16 | 25 | 21 | 28 | 18 | 23 | 21 | 26 | 15 | 22 |
| ధనిష్ఠ 2 | 19 | 22 | 25 | 28 | 12 | 26 | 29 | 16 | 13 | 18 | 21 | 20 | 28 | 33 | 28 | 18 | 07 | 14 |
| శతభిషము | 26 | 19 | 26 | 26 | 21 | 19 | 22 | 23 | 23 | 18 | 18 | 25 | 33 | 28 | 19 | 09 | 17 | 16 |
| పూర్వాభాద్ర 3 | 19 | 28 | 21 | 21 | 27 | 12 | 15 | 30 | 29 | 24 | 25 | 20 | 27 | 19 | 28 | 18 | 23 | 20 |
| పూర్వాభాద్ర 1 | 12 | 20 | 14 | 21 | 27 | 11 | 15 | 31 | 30 | 28 | 30 | 25 | 17 | 07 | 16 | 28 | 33 | 30 |
| ఉత్తరాభాద్ర | 03 | 19 | 12 | 19 | 20 | 22 | 24 | 22 | 31 | 29 | 29 | 14 | 06 | 16 | 21 | 33 | 28 | 34 |
| రేవతి | 13 | 11 | 05 | 12 | 27 | 22 | 27 | 30 | 21 | 19 | 22 | 22 | 14 | 16 | 18 | 29 | 33 | 28 |

శూద్రులకు యోనిపొంతనము, బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణ కూటము, వైశ్యులకు రాశి లేక స్త్రీదీర్ఘకూటము శుభయుక్తమై ఉండి, 18గుణముల కు పైనవచ్చిన యెడల వివాహమునకు శుభము.







# గ్రహమైత్రి చక్రము

| గ్రహము | మిత్రులు | సములు | శత్రువులు |
|---|---|---|---|
| రవి | చంద్ర-కుజ-గురు | బుధ | శుక్ర-శని |
| చంద్ర | రవి-బుధ | కుజ-గురు-శుక్ర-శని | లేరు |
| కుజ | రవి-చంద్ర-గురు | శుక్ర-శని | బుధ |
| బుధ | రవి-శుక్ర | కుజ-గురు-శని | చంద్ర |
| గురు | రవి-చంద్ర-కుజ | శని | బుధ-శుక్ర |
| శుక్ర | బుధ-శని | కుజ-గురు | రవి-చంద్ర |
| శని | బుధ-శుక్ర | గురు | రవి-చంద్ర-కుజ |

## ఆయా నక్షత్రముల అధిపతులు మరియు రత్నధారణాదులు

| జన్మనక్షత్రము | అధిపతి | ధరించవలసిన రత్నము | లోహము | ఏవ్రేలికి ధరించేది | ఫలితము |
|---|---|---|---|---|---|
| అశ్విని-మఖ-మూల | కేతు | వైఢూర్యము | పంచలోహం | చిటికెన(ఎడమ) | ఆధ్యాత్మికశక్తి |
| భరణి-పుబ్బ-పూర్వాషాఢ | శుక్ర | వజ్రము | బంగారము | చూపుడు(ఎడమ) | దాంపత్యఅనుకూలత |
| కృత్తిక-ఉత్తర-ఉత్తరాషాఢ | రవి | కెంపు | బంగారము | ఉంగరపు(కుడి) | ఉద్యోగము,ఆరోగ్యము |
| రోహిణి-హస్త-శ్రవణము | చంద్ర | ముత్యము | వెండి | చూపుడు(కుడి) | మానసికవికాసము |
| మృగశిర-చిత్త-దనిష్ఠ | కుజ | పగడము | రాగి | ఉంగరపు(ఎడమ) | ధైర్యము-భూలాభము |
| ఆరుద్ర-స్వాతి-శతభిషము | రాహు | గోమేధికము | సత్తులోహము | మధ్య(కుడి) | నష్టద్రవ్యలాభము |
| పునర్వసు-విశాఖ-పూ॥భా॥ | గురు | పుష్యరాగము | బంగారము | చూపుడు(కుడి) | పేరుప్రతిష్ఠలు |
| పుష్యమి-అనురాధ-ఉ॥భా॥ | శని | నీలము | ఇనుము | మధ్య(ఎడమ) | ఆయుర్లాభము |
| ఆశ్లేష-జ్యేష్ఠ-రేవతి | బుధ | మరకతము (పచ్చ) | వెండి | చిటికెన(కుడి) | విద్యా,వ్యాపారలాభం |

| హోదా | అధిగ్రహము | |
|---|---|---|
| మహారాజు | రవి | 1 |
| మహారాణి | చంద్ర | 2 |
| మంత్రి | గురు | 3 |
| సేనాధిపతి | కుజ | 9 |
| యువరాజు | బుధ | 5 |
| యువరాణి | శుక్ర | 6 |
| పురోహితుడు | కేతు | 7 |
| మాంత్రికుడు | రాహు | 4 |
| సేవకుడు | శని | 8 |
| రాజ్యం | భూమి | 0 |

## త్రివిధ మాసములు

| హిజరీ నెలలు | | అరవ నెలలు | | శాలివాహన శక నెలలు | | |
|---|---|---|---|---|---|---|
| 1. | మొహరమ్ | 1. | చిత్ర | 1. | చైత్రము | 30 |
| 2. | సఫర్ | 2. | వైయ్యాశి | 2. | వైశాఖము | 31 |
| 3. | రబ్బీలవ్వల్ | 3 | ఆని | 3. | జ్యేష్ఠము | 31 |
| 4. | రబ్బీసాని | 4. | ఆడి | 4. | ఆషాఢము | 31 |
| 5. | జమాదీలవ్వల్ | 5. | ఆరణి | 5. | శ్రావణము | 31 |
| 6. | జమాదిస్సాని | 6. | పెరటాసి | 6. | భాద్రపదము | 31 |
| 7. | రజ్జబ్ | 7. | అల్పిని | 7. | ఆశ్వయుజము | 31 |
| 8. | షాబాన్ | 8. | కార్తికి | 8. | కార్తీకము | 30 |
| 9. | రంజాన్ | 9. | మార్గశి | 9. | మార్గశిరము | 31 |
| 10. | షవ్వాల్ | 10. | తై | 10. | పుష్యము | 30 |
| 11. | జిలకాజ్ | 11. | మాసి | 11. | మాఘము | 30 |
| 12. | జిలహేజ్ | 12. | పంగుని | 12. | ఫాల్గుణము | 30 |

శాలివాహన శక సంవత్సరములో చైత్ర మాసమునకు లీపు సంవత్సరము నందు 31రోజులు ఉండును. శాలివాహన శక సంవత్సరమునకు 2 కలిపి 4చే భాగించగా శేషము లేనిచో అది లీపు సంవత్సరమగును. హిజరీ చంద్రదర్శనమైన మరునాడు ప్రారంభమగును.

## గ్రహముల శత్రు-మిత్ర-సమత్వ సంఖ్యలు

| గ్రహము | సంఖ్య | మిత్ర సంఖ్యలు | శత్రు సంఖ్యలు | సమ సంఖ్యలు |
|---|---|---|---|---|
| రవి | 1 | 2,3,4,9 | 6,8 | 5,7 |
| చంద్ర | 2 | 1,5,7 | - | 3,4,6,8,9 |
| కుజ | 9 | 1,2,3 | 5 | 4,6,7,8 |
| బుధ | 5 | 1,4,6 | 2,7 | 3,8,9 |
| గురు | 3 | 1,2,7,9 | 5,6 | 4,8 |
| శుక్ర | 6 | 5,8 | 1,2,4,7 | 3,9 |
| శని | 8 | 5,6 | 1,2,4,7,9 | 3 |
| రాహు | 4 | 1,2,8 | 5,6,9 | 3,7 |
| కేతు | 7 | 2,3,9 | 5,6,8 | 1,4 |





## నవరత్నములు - ఉంగరధారణ

**1. కెంపు :** దీనికి సూర్యుడు అధిపతి! ఇది దానిమ్మగింజ వలె ఎఱ్ఱగా ఉంటుంది. కెంపు అనునది సంఘములో కీర్తి-ప్రతిష్టలకు, రాజకీయాధికారమునకు మరియు ఆరోగ్యమునకు బాగుగా ఉపయోగపడును. కృత్తిక-ఉత్తర-ఉత్తరాషాఢ నక్షత్ర జాతకులు, 1,10,19,28 తేదీల యందు జన్మించినవారు, సూర్యుడు యోగకారకుడుగా ఉన్నవారు మరియు సూర్యమహాదశ జరుగుచున్నవారు కెంపును ధరించవలెను.

**2. ముత్యము :** దీనికి చంద్రుడు అధిపతి! తెల్లగా మంచుబిందువు వలె ఉంటుంది. మానసిక ఉల్లాసమునకు, స్త్రీసౌఖ్యమునకు, కుటుంబ సౌఖ్యమునకు, ఉత్సాహమునకు బాగుగా ఉపయోగపడును. రోహిణి-హస్త-శ్రవణనక్షత్ర జాతకులు 2,11,20,29 తేదీలందు పుట్టినవారు, చంద్రుడు యోగకారకుడుగా ఉన్నవారు మరియు చంద్రమహాదశ జరుగుచున్నవారు ముత్యమును ధరించవలెను.

**3. పగడము :** దీనికి కుజుడు అధిపతి! ఇది ఎఱ్ఱగా పండు ఇటుక రంగులో ఉంటుంది. ఇది ధైర్యమునకు, భూ లాభమునకు, అధికారమునకు, ఋణ విమోచనమునకు బాగుగా యోగించును. మృగశిర-చిత్త-ధనిష్ఠ నక్షత్రజాతకులు, 9,18,27 తేదీలందు పుట్టినవారు, కుజుడు యోగకారకుడుగా ఉన్నవారు మరియు కుజమహాదశ జరుగుచున్నవారు ధరించాలి.

**4. మరకతము(పచ్చ) :** దీనికి బుధుడు అధిపతి! రామచిలుక రెక్కల రంగును పోలియుండును. సభాజయముకు, వ్యాపారాభివృద్ధికి, విద్యాభివృద్ధికి బాగుగా ఉపయోగపడును. ఆశ్లేష-జ్యేష్ఠ-రేవతి నక్షత్రజాతకులు, 5,14,23 తేదీలందు జన్మించినవారు, బుధుడు యోగకారకుడుగా ఉన్నవారు మరియు బుధమహాదశ జరుగుచున్నవారు దీనిని ధరించాలి.

**5. పుష్యరాగము :** దీనికి గురుడు అధిపతి! ఇది లేత పసుపు రంగులోను, తెల్లగాను రెండు రకములుగా ఉండును. లేత పసువు వర్ణము గలదానిని **'కనకపుష్యరాగము'**అని, తెలుపు దానిని **'శుద్ధ పుష్యరాగము'** అనిపిలు తురు.యశస్సు, కీర్తి-ప్రతిష్టలను, స్థిరాస్తులను, భోగభాగ్యములను కలుగజేయును. పునర్వసు-విశాఖ-పూర్వాభాద్ర నక్షత్రజాతకులు 3,12,21,30 తేదీలందు జన్మించినవారు, గురుడు యోగకారకుడుగా ఉన్నవారు మరియు గురుమహాదశ జరుగుచున్నవారు దీనిని ధరించాలి.

**6. వజ్రము :** దీనికి శుక్రుడు అధిపతి! ఇది స్పటికములా తెల్లగా కాంతివంతముగా ఉండును. భార్యాభర్తల అన్యోన్యతకు, సుఖ సంసారమునకు, స్త్రీవశ్యమునకు మరియు భోగభాగ్యములకు ఉపయోగపడును. భరణి-పుబ్బ-పూర్వాషాఢ నక్షత్రజాతకులు, 6,15,24 తేదీలందు జన్మించినవారు, శుక్రుడు యోగకారకుడుగా ఉన్నవారు మరియు శుక్రమహాదశ

జరుగుచున్నవారు దీనిని ధరించవలెను.

**7. నీలము :** దీనికి శని అధిపతి! ఇది నీలవర్ణములోనే పెక్కువిధము లుగా ఉండును. మృత్యు దోషములు, గండములను నివారించుటకు, ఆయుర్వృద్ధికి ఉపయోగపడును. పుష్యమి-అనురాధ-ఉత్తరాభాద్ర నక్షత్ర జాతకులు 8,17,26 తేదీలలో పుట్టినవారు, శని యోగకారకుడుగా ఉన్నవారు మరియు శనిమహాదశ జరుగుచున్నవారు ధరించాలి

**8. గోమేధికము :** దీనికి రాహువు అధిపతి! గోమూత్రపు రంగులో ఉండును. ఇది నష్టద్రవ్యలాభము, వశీకరణము, ఇతరులపై ఆధిపత్యము కలిగించును. ఆరుద్ర-స్వాతి-శతభిష నక్షత్రజాతకులు, 4,13,22,31 తేదీలందు జననమొందినవారు, రాహువు యోగకారకుడుగా ఉన్నవారు మరియు రాహుమహాదశ జరుగుచున్నవారు ధరించాలి

**9. వైఢూర్యము :** దీనికి కేతువు అధిపతి! బూడిద రంగులో మధ్యసూత్రముతో పిల్లి కన్నువలె ఉంటుంది. చర్మరోగ నివారణకు, స్త్రీల సుఖప్రసవమునకు, మంత్రతంత్రవిద్యలకు బాగుగా యోగించును. అశ్విని-మఖ-మూల నక్షత్రజాతకులు, 7,16,25 తేదీలందు పుట్టినవారు, కేతువు యోగకారకుడుగా ఉన్నవారు మరియు కేతుమహాదశ జరుగు చున్నవారు దీనిని ధరించవలెను.

**జాతకరీత్యాగాని, గోచారరీత్యాగాని, నవగ్రహ అరిష్టములచే గాని తీవ్ర బాధలు పొందుతున్నవారు, ఈ దిగువ పటములో చూపినట్లుగా నవరత్నములను ఉంగరముగా చేయించుకుని ధరించిన యెడల...సర్వ కార్య సాఫల్యమును, మానసిక ఉల్లాస మును, ధైర్యమును, ఉత్సాహమును, సంపదలను, కీర్తి-ప్రతిష్ఠల ను, అధికారమును, వ్యాపార జయమును పొందగలరు.**








## వివాహాది శుభకార్యములకు శుభసమయములు

**1. నిశ్చయ తాంబూలములు :** 2,3,5,7,10,13 తిథులు, ఆది-బుధ-గురు-శనివారములు, అశ్విని-రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-రేవతి నక్షత్రములందు, లగ్నాత్తు పంచమ, నవమ స్థానములు శుద్ధిగా ఉన్నప్పుడు నిశ్చయతాంబూలములను తీసుకొన వలెను. సోమవారము నాడు పెళ్ళిచూపులకు వెళ్ళరాదు.



**2. వివాహము :** 2,3,5,7,10,11,13తిథులు, బుధ-గురు-శుక్రవార ములు, రోహిణి-మృగశిర-మఖ-ఉత్తర-హస్త-స్వాతి-అనురాధ-మూల-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-రేవతి నక్షత్రములు, స్థిరలగ్నములు, శుభులున్న చరలగ్నములు మంచివి. సప్తమశుద్ధి, అష్టమశుద్ధి ఉండి, గ్రహబలము ఉన్న ముహూర్తము మంచిది. శూన్యమాసములు పనికిరావు. కుమార్తె వివాహానంతరము కుమారుని వివాహము చెయ్య వచ్చు. కుమారునకు ముందు ఉపనయనము చేసి తదుపరి కుమార్తెకు వివాహము చెయ్యవలెను. ఏకోదరులకు ఒక సంవత్సరములో 6నెలల లోపులో వివాహము చేయరాదు. సంవత్సర బేధము ఉన్నపుడు 6నెలల లోపులో వివాహము చేయవచ్చును. ఇద్దరు సోదరులకై ఒకేలగ్నమందు ఒకే ఇంటిలో వివాహము గాని, ఉపనయనము గాని చేయరాదు. అటులనే కూతురుకు, కుమారునకు ఒకే లగ్నములో వివాహము చేయరాదు.



**3. పెండ్లికొడుకును,పెండ్లికూతురును చేయుటకు :** 2,3,5,7, 10,13 తిథులు, ఆది-గురు-శనివారములు, అశ్విని-పునర్వసు-పుష్యమి-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-శ్రవణము-ధనిష్ఠ నక్షత్రములు మంచివి. లగ్నాత్తు 5,9 స్థానములు శుద్ధిగా ఉండవలెను.

**4. గర్భాదానము :** 2,3,5,7,10,13 తిథులు సోమ-బుధ-గురు-శుక్ర వారములు, రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-ఉత్తరాభాద్ర నక్షత్ర ములు, వృషభ-కర్కాటక-కన్య-తుల-ధనూ-మీన లగ్నము లు మంచివి. లగ్నశుద్ధి, అష్టమశుద్ధి ఉండవలెను. పంచ పర్వములు, వ్రతదినములు, శ్రాద్ధసమయములు, సంధ్యా సమయములు పనికిరావు. భార్యాభర్తలకు తారా బలము, చంద్రబలము ఉండాలి. రాత్రిపూటమాత్రమే ఈ కార్య క్రమము జరగాలి.



**5. వివాహమునకు మృతశంక :** తండ్రి మరణించిన యెడల 12నెలలు, తల్లి మరణించినచో 6నెలలు, భార్య మరణించిన 3నెలలు, సోదరులుగాని, పుత్రులుగాని మరణించిన 2నెలలు, బంధువులు

మరణించిన 1నెల విడిచిపెట్టి వివాహము చేసుకోవచ్చు.

**6. నవవధువు ప్రవేశము :** 2,3,5,7,10,11,13 తిథులు, బుధ-శుక్ర వారములు, అశ్విని-రోహిణి-మృగశిర-పుష్యమి-ఉత్తరాత్రయము- హస్త-చిత్త-స్వాతి-అనురాధ-శ్రవణము-మఖ-మూల-జ్యేష్ఠ-ధనిష్ఠ-రేవతి నక్షత్రములు మంచివి. ద్వాదశ శుద్ధి గల స్థిర, ద్విస్వభావ లగ్నములు, కర్కాటక లగ్నములు మంచివి. వివాహము జరిగిన 6వ రోజునుండి 16రోజుల లోపు తిథి-వార-నక్షత్రములతో పనిలేదు. అనంతరము విషమ మాస-వర్షాదులను లెక్కించుకునేది.



**7. నవవధువు మెట్టినింట ఉండకూడని మాసములు :** నవ వధువు వివాహమైన మొదటి సంవత్సరము నందు జ్యేష్ఠములో అత్తవారింట ఉంటే బావగారికి, పుష్య-ఆషాఢములలో మావగారికి, అధికమాసములో భర్తకు, క్షయమాసములో వధువునకు కీడు జరుగును.

**8. పుట్టినింట ఉండకూడని మాసములు :** పెండ్లి అయిన మొదటి చైత్రమాసములో నవవధువు పుట్టింట ఉండిన ఎడల తండ్రికి హాని కలుగును.

**9. పుంస్వసీమంతములు :** 2,3,5,7,10,13,15 తిథులు, బుధ-గురు-శుక్రవారములు, రోహిణి-పునర్వసు-పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-ఉత్తరాభాద్ర-రేవతి నక్షత్రములు, మేష-మిధున-ధనుర్-తుల-కుంభ లగ్నములు మంచివి. పుంసవమునకు 3వ మాసము, సీమంతమునకు 4,6,8 మాసములు మంచివి.



**10. గాజులుపెట్టుటకు :** 5,7 బేసిమాసములు మంచివి.

**11.గర్భవతిని పురిటికి తెచ్చుటకు :** తిథి,వార,నక్షత్రములు శుభముగా ఉన్నప్పుడు 7,9 నెలలో తీసుకొని రావాలి. మొదటి రెండు పురుళ్ళు పుట్టినింట, 3వ పురుడు మెట్టినింట పోయాలి.

**12. బాలింత పథ్యమునకు :** 3,5,7,10,13,15 తిథులు, రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-అనురాధ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-ఉత్తరాత్రయము-రేవతి నక్షత్రములు, బుధ-గురు-శుక్రవారములు మంచివి. దశమస్థానము శుద్ధిగా ఉండవలెను.

**13. బాలింత స్నానము :** ఆది-మంగళ-గురువారములలో పంచాంగములు శుద్ధిగా ఉన్నప్పుడు పురుడైన 11వ రోజు చేయించాలి.

**14. శిశువునకు మొలత్రాడు కట్టుటకు :** శుభతిథులు, శుభనక్షత్రములు కూడిన మంగళవారము నాడు ఐదవ మాసములో కట్టవలెను. పురిటశుద్ధినాడే మంచిది. శిశువుకు బంగారు-వెండి-పసుపు-తెల్లని త్రాడులు మొలత్రాడుగా ఉపయోగించుట మంచిది

**15. శిశువును ఉయ్యాలలో వేయుటకు :** జననాది 1,3,5





మాసములలో పంచాంగశుద్ధి, అష్టమశుద్ధిగల శుభలగ్నముల యందు శిశువు యొక్క శిరస్సును తూర్పునకు ఉండునట్టుగా ఉయ్యాలలో పరుండపెట్టవలెను. 11,21,29 రోజులుకూడా వేయవచ్చు.



**16. శిశువునకు పేరుపెట్టుటకు :** 2,3,5,7,10,11,13 తిథులు, సోమ-బుధ-గురు-శుక్రవారములు, అశ్విని-రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-మఖ-ఉత్తరాత్రయము-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-శతభిష నక్షత్రములు, అష్టమశుద్ధి గల స్థిర లగ్నములందు, శిశువు పుట్టిన 11,21,29 రోజులలో గాని 3వ మాసములో గాని పేరు పెట్టవలెను.

**17. కేశఖండన :** 2,3,5,7,10,13 తిథులు, సోమ-బుధ-గురు-శుక్ర వారములు, అశ్విని-మృగశిర-పుష్యమి-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము నక్షత్రములు మంచివి. స్త్రీ శిశువులకు బేసి మాసములు, మగ శిశువులకు సరి మాసములు మంచివి.

**18. బిడ్డతో అత్తవారింటికి వెళ్ళుటకు :** శిశువుకు 5,7,8,9,11 నెలల వయసప్పుడు అత్తవారింటికి వెళ్ళవచ్చును. శూన్యమాసములు, మౌఢ్య దినములు పనికిరావు.



**19. అన్నప్రాశనము :** 2,3,5,7,10,13 తిథులు, సోమ-బుధ-గురు-శుక్రవారములు, అశ్విని-రోహిణి-పునర్వసు-పుష్యమి-ఉత్తరాత్రయము-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-రేవతి నక్షత్రములు, లగ్నశుద్ధి, దశమశుద్ధి కలిగిన వృషభ-మిధున-కర్కాటక-కన్య-ధను-మీన లగ్నములు మంచివి. మగశిశువునకు 6,8,10,12 మాసములలోను, స్త్రీశిశువునకు 7,9,11 మాసములలోను అన్నప్రాశనము చేయించాలి.



**20. ఉపనయనము :** అనాధ్యయరహితమైన 2,3, 5,7,10 తిథులు, బుధ-గురు-శుక్రవారములు, అశ్విని- రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-ఉత్తరాత్రయము-హస్త-స్వాతి-అనురాధ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-రేవతి తారలు, వృషభ-మిధున-కర్కాటక-కన్య-ధను-మీన లగ్నములు మంచివి. అష్టమ శుద్ధి చూడవలెను. మీన చైత్రము, ఉత్తరాయణ కాలము మంచివి. తల్లిదండ్రులకు తారా బలము ఉండాలి. బ్రాహ్మణులకు 8వ యేట, క్షత్రియులకు 11వ యేట, వైశ్యులకు 12వ యేట సాధారణముగా ఉపనయనము నిర్వహించవలెను. బ్రహ్మవర్చస్సు-సన్యాసము-పట్టాభిషేకము-గురుకులవిద్యలు మొదలైన కామ్యములను కోరినప్పుడు బ్రాహ్మణులకు 5వ యేట, క్షత్రియులకు 6వ యేట, వైశ్యులకు 8వ యేట ఉపనయనము చేయవచ్చును. బ్రాహ్మణులకు 16 సంవత్సరముల వరకును, క్షత్రియులకు 22 సంవత్సరముల వరకును, వైశ్యులకు 24



శేషుడు, షష్ఠికి కుమారస్వామి, సప్తమికి సూర్యుడు, అష్టమికి రుద్రుడు, నవమికి దుర్గ,



సంవత్సరముల వరకును ఉపనయనము చేయుటకు గౌణకాలము. గౌణకాలము దాటిన కాలాతిక్రమణ దోషము కలుగును.

**21. దత్తత స్వీకారము :** 2,3,5,7,10,11,13, తిథులు, బుధ-గురు-శుక్రవారములు, రోహిణి-పునర్వసు-పుష్యమి-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-శ్రవణము-ధనిష్ఠ-రేవతి నక్షత్రములు మంచివి. పంచమ శుద్ధి, లగ్నబల మున్న శుభలగ్నములు మంచివి.



**22. అక్షరాభ్యాసము :** 2,3,5,7,10,11,13 తిథులు, ఆది-సోమ-బుధ-గురు-శుక్రవారములు, అశ్విని-రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-శ్రవణము-రేవతి నక్షత్రములు, మేష-కర్కాటక-తుల-మకర లగ్నములు, అష్టమశుద్ధిగా ఉన్నప్పుడు ఉత్తరాయణములో 5వ సంవత్సరమున చేయించవలెను. మౌఢ్యదినములు పనికిరావు.



**23. కర్ణవేధ (చెవులు కుట్టించుట) :** 2,3,5,7,10,11,13 తిథులు, సోమ-బుధ-గురు-శుక్ర వారములు, అశ్విని-మృగశిర-పునర్వసు-పుష్యమి-హస్త-చిత్త-అనురాధ-శ్రవణము-ధనిష్ఠ నక్షత్రములు, వృషభ-మిథున-కన్య-తుల-ధనుస్సు-కుంభ-మీన లగ్నములు మంచివి. అష్టమశుద్ధితో కూడిన లగ్నమునందు కేంద్ర-కోణములందు శుభులుండగాను, 3-6-11 స్థానములందు పాపులుండగాను, మరియు గురు-శుక్ర గ్రహములు లగ్నమును బలపరచినప్పుడు చెవులు కుట్టించుట శుభప్రదము. ముఖ్యముగా చెవులు కుట్టించేటప్పుడు విషమ మాస-వర్షాదులను లెక్కించవలెను.



**24. గృహారంభము :** 2,3,5,7,10,11,13,15 తిథులు, సోమ-బుధ-గురు-శుక్రవారములు మరియు రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-ఉత్తరాత్రయము-చిత్త-స్వాతి-అనురాధ-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-రేవతి తారలు స్థిరలగ్నములు మంచివి. చతుర్థ, అష్టమ శుద్ధి ఉండాలి. వృషభ చక్రశుద్ధి, కలశ చక్రశుద్ధి ఉండాలి. ప్రథమ రెండు జాములు ప్రశస్తము.

**25. గృహప్రవేశము :** 2,3,5,7,10,11,13,15 తిథులు, సోమ-బుధ-గురు-శుక్రవారమలు, రోహిణి-మృగశిర-ఉత్తరాత్రయము-చిత్త-అనురాధ-ధనిష్ఠ-శతభిషము-రేవతి తారలు మంచివి. అష్టమశుద్ధి గల స్థిరలగ్నములో గృహప్రవేశము చేయాలి. వృషభ-కలశ చక్ర శుద్ధులు తప్పనిసరి.



**26. సమస్త విద్యారంభము :** 2,3,5,7,10,11 తిథులు, సోమ-బుధ- గురు-శుక్రవారములు, అశ్విని-మృగశిర- ఆరుద్ర-పునర్వసు-పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-మూల-శ్రవణము-రేవతి నక్షత్రములు, అష్టమశుద్ధి గల శుభ లగ్నములు మంచివి.





దశమికి యముడు, ఏకాదశికి విశ్వేదేవతలు, ద్వాదశికి విష్ణువు, త్రయోదశికి మన్మథుడు,



పగటిపూట అనధ్యాయరహిత దినములలో ప్రారంభించాలి.

**27. ఉద్యోగప్రవేశము :** 2,3,5,7,10,11,13 తిథులు, అశ్విని-పునర్వసు-పుష్యమి-హస్త-చిత్త-అనురాధ-రేవతి నక్షత్రములు, బుధ-గురు-శుక్రవారములు, స్థిర లగ్నములందు రవి,కుజులు 10-11 స్థానములలో ఉండగా మంచిది.



**28. సర్వ వ్యాపారములకు :** 2,3,5,7,10,11,13,15,16 తిథులు, ఆది-సోమ-బుధ-గురు-శుక్రవారములు, అశ్విని-రోహిణి-మృగశిర-ఆరుద్ర-పునర్వసు-పుష్యమి-మఖ-ఉత్తర-హస్త-స్వాతి-అనురాధ-మూల-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-ఉత్తరాభాద్ర- రేవతి నక్షత్రములు, వృషభ-మిథున-కర్కాటక-కన్యా-తుల-ధనుసు-మకర-కుంభ లగ్నములు, ద్వితీయ, అష్టమ స్థాన శుద్ధులు కలిగిన లగ్న బలమునందు సర్వ వ్యాపారములు మేలు.



**29. సమస్త వస్తు వినియోగములకు :** 2,3,5,7,10,11,13,15 తిథులు, సోమ-బుధ-గురు-శుక్రవారములు, అశ్విని-రోహిణి-మృగశిర- పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-అనురాధ-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-రేవతి నక్షత్రము లందు, స్థిరలగ్నములందు సమస్త వస్తువులను ఉపయోగించుకొనుట శ్రేయస్కరము.

**30. ఔషధ సేవకు :** 2,3,5,6,7,9,10,11,13,15 తిథులు, ఆది-సోమ-బుధ-గురు-శుక్ర వారములు, అశ్విని-మృగశిర-పుష్యమి-హస్త-చిత్త-అనురాధ-మూల-రేవతి నక్షత్రములందు, మిథున-కన్య-ధనుర్-మీన లగ్నములందు 6,8,12 స్థానములు శుద్ధిగా ఉన్నప్పుడు ఔషధ సేవనము శుభము.

**31. నూతన ఆభరణ ధారణము :** 2,3,5,7,10,11,13,15 తిథులు, సోమ-బుధ-గురు-శుక్ర వారములు, అశ్విని-రోహిణి-పునర్వసు-పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-ఉత్తరాషాఢ-ధనిష్ఠ-ఉత్తరాభాద్ర-రేవతి నక్షత్రములందు, వృషభ-మిథున-సింహ-కన్య-వృశ్చిక-ధను-కుంభ-మీన లగ్నములందు, 2,6,8,9 స్థానములు శుద్ధిగా ఉన్నప్పుడు నూతన ఆభరణ ధారణ చేయుట ప్రశస్తము.

**32. అప్పు తీసుకొనుటకు-ఇచ్చుటకు :** 2,3,5,7,11,13 తిథులు, అశ్విని-మృగశిర-పునర్వసు-పుష్యమి-చిత్త-స్వాతి-విశాఖ-అనురాధ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-రేవతి నక్షత్రములందు, మేష-కర్కాటక-తులా-మకర లగ్నములందు, అష్టమశుద్ధి ఉండి, 5,9 స్థానములందు శుభగ్రహము ఉండగా అప్పు ఇవ్వవలెను.

హస్తా నక్షత్రముతో కూడిన ఆదివారము నందు, మంగళవారము నందు, సంక్రమణ దినములందు అప్పు పుచ్చుకొనరాదు. బుధవారము అప్పు ఇవ్వరాదు. మంగళవారము అప్పు తీర్చుట మంచిది.

చతుర్దశికి శివుడు, పూర్ణిమకు చంద్రుడు, అమావాస్యకు పిత్రుదేవతలు అధిపతులు.



## పాడి - పంట - చెఱువులకు శుభ సమయములు

**1. క్రొత్త భూమిసాగుచేయుటకు :** 2,3,5,7,10,11,13 తిథులు, ఆది-మంగళ-బుధ-శుక్రవారములు మరియు అశ్విని-రోహిణి-మఖ-ఉత్తరాత్రయము-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-మూల-ధనిష్ఠ-రేవతి నక్షత్రములు మంచివి.



**2. ఏరువాక లేక దుక్కిదున్నుటకు :** 2,3,5,7,10,11,13 పూర్ణిమా తిథులు, ఆది-మంగళ-గురువారములు, అశ్విని-రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-మఖ-హస్త-చిత్త-స్వాతి-విశాఖ-అనురాధ-మూల-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-ఉత్తరాభాద్ర-రేవతి తారలు, వృషభ-మిధున-కన్య-ధనుర్-వృశ్చిక-మీన లగ్నములు మంచివి. మేషమున పశునష్టము, సింహమున జంతు-కీటకబాధ, మకరమున సస్యనాశనము, కర్కాటకమున అతివృష్టి, తులనందు ప్రాణహాని, కుంభమున దొంగల పాలగుట జరుగును.

**3. విత్తనములు చల్లుటకు :** బుధ-గురు-శుక్ర వారములు, అశ్విని-రోహిణి-మృగశిర-పుష్యమి-మఖ-ఉత్తరాత్రయము-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-మూల-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-రేవతి తారలు, వృషభ-మిధున-కన్య-వృశ్చిక-ధనుర్-మీన లగ్నములు యోగించును.

**4. పొలిపెట్టుటకు :** ఆది-గురు-శుక్ర వారములు 3,5,8,10,13,15 తిథులు, అశ్విని-రోహిణి-పునర్వసు-పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-మూల-రేవతి తారలు మంచివి.

**5. వరిఆకు ఊడ్చుటకు :** 4,9,14 తిథులు, సోమ-బుధ-గురు-శుక్రవారములు, అశ్విని-రోహిణి-మృగశిర-పుష్యమి-మఖ-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-మూల-రేవతి తారలు మంచివి.

**6. పంటకుప్పవేయుటకు, నూర్చుటకు :** 3,5,7,10,15 తిథులు, బుధ-గురు-శుక్ర వారములు, అశ్విని-రోహిణి-మృగశిర-పుష్యమి- చిత్త-స్వాతి-అనురాధ-మూల-శ్రవణము-ధనిష్ఠ- పూర్వాత్రయము మరియు ఉత్తరాత్రయము-రేవతి తారలు మంచివి.

**7. పొలమునుండి ధాన్యము తెచ్చుటకు :** సోమ-గురు-శుక్ర వారములు, 2,3,5,7,10,11,13 తిథులు, అశ్విని-మృగశిర-పుష్యమి-హస్త-చిత్త-అనురాధ-రేవతి తారలు శుభము.

**8. విత్తనములు నిలువచేయుటకు :** బుధ-గురు-శుక్ర వారములు, పుష్యమి-మఖ-ఉత్తర-విశాఖ-అనురాధ-మూల-ఉత్తరాషాఢ-శ్రవణము-ఉత్తరాభాద్ర-రేవతి తారలు మేలును కలిగించును.

**9. పశువులను కొనుటకు :** బుధ-గురు-శుక్ర వారములు, అశ్విని-పునర్వసు-పుష్యమి-హస్త-విశాఖ-జ్యేష్ఠ-పూర్వాషాఢ-ధనిష్ఠ-పూర్వాభాద్ర-రేవతి తారలు మంచివి.



ఆదివారమందు భరణియు, సోమవారమందు చిత్తయు, మంగళవారమందు



**10. పశువులను అమ్ముకొనుటకు :** సోమ-బుధ-గురు-శని వారములు, అశ్విని-మృగశిర-ఆశ్లేష-మఖ-పూర్వాత్రయము-విశాఖ-జ్యేష్ఠ-ధనిష్ఠ-రేవతి తారలు శుభము.

**11. పశువులను ఇంటికితెచ్చుటకు :** ఆది-మంగళ-శని వారములు, భరణి-కృత్తిక-మృగశిర-ఆరుద్ర-పునర్వసు-మఖ-చిత్త-స్వాతి-అనురాధ-మూల నక్షత్రములు మంచివి.

**12. పశుశాల వేయుటకు :** 2,3,5,7,10,11,13 తిథులు, సోమ-బుధ-గురు-శుక్ర వారములు, అశ్విని-మృగశిర-పుష్యమి-హస్త-మూల-పూర్వాభాద్ర నక్షత్రములు మంచివి. గురుపుష్య యోగము నాడు వృషభ లగ్నమందు, వృషభ నవాంశలో చతుర్థశుద్ధితో పశుశాలలను వేసినచో...పశువులు దినదినాభివృద్ధిని చెందగలవు.

13. పశువులను కట్టుట : అశ్విని-మృగశిర-పుష్యమి-హస్త-మూల-పూర్వాభాద్ర నక్షత్రములు మంచివి.

**14. భూములను కొనుటకు,అమ్ముటకు :** బుధ-గురు-శుక్ర వారములు, 1,5,7,10,11 తిథులు, మృగశిర-పునర్వసు-ఆశ్లేష-మఖ-పూర్వాత్రయము-విశాఖ-అనురాధ-మూల-రేవతి తారలు మంచివి.

**15. క్రయ,విక్రయ నక్షత్రములు :** అశ్విని-చిత్త-స్వాతి-శ్రవణము-శతభిష-రేవతి తారలు కొనుటకు, భరణి-కృత్తిక-ఆశ్లేష-పుబ్బ-విశాఖ-ఉత్తరాషాఢ-పూర్వాషాఢ నక్షత్రములు వస్తువులను అమ్ముటకు మంచివి.

**16. పడవను నిర్మించుట-నీటిలో వదులుటకు :** 2,3,5,7,10,11,13 తిథులు, ఆది-గురు-శుక్ర వారములు, మేష-కర్కాటక-తులా-వృశ్చిక-మకర-మీన లగ్నములు, అశ్విని-మృగశిర-పునర్వసు-పుష్యమి-పుబ్బ-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-మూల-పూర్వాషాఢ-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర నక్షత్రములందు పడవను నిర్మించుటకు మరియు నీటిలో వదులుటకు శుభము.

**17. చెఱువుకు నీరు పెట్టుటకు :** 2,3,5,7,9,11,12,13,15 తిథులు, సోమ-మంగళ-బుధ-గురు-శుక్ర వారములు, వృషభ-మిధున-కర్కాటక-కన్య-తుల-వృశ్చిక-మకర-కుంభ-మీన లగ్నములు, రోహిణి-ఆరుద్ర-పునర్వసు-పుష్యమి-ఆశ్లేష-ఉత్తర-హస్త-స్వాతి-విశాఖ-అనురాధ-పూర్వాషాఢ-ఉత్తరాషాఢ-శ్రవణము-శతభిషము-పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర-రేవతీ నక్షత్రములందు చెఱువుకు నీరు పెట్టుట మంచిది.

**18. చేప మరియు రొయ్యపిల్లలు వదులుటకు :** 2,3,5,7,9,11,13,15 తిథులు, సోమ-బుధ-గురు-శుక్ర వారములు, మేష-వృషభ-మిధున-కర్కాటక-కన్య-తుల-వృశ్చిక-మకర-కుంభ-మీన లగ్నములు, అశ్విని-రోహిణి-మృగశిర-పునర్వసు-పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-ఉత్తరాభాద్ర-రేవతి నక్షత్రములందు చెఱువులో చేపలు మరియు రొయ్య పిల్లలు వదులుట శుభము.

ఉత్తరాషాఢయు, బుధవారమందు ధనిష్టయు, గురువారమందు ఉత్తరయు,



## తెలుసుకోవలసిన విషయములు

**1. మూఢమి :** గురు, శుక్రులు, రవితో చేరి అస్తంగతులగుటను "మౌఢ్యమి" అందురు. దీనినే వ్యవహార భాషలో "మూఢమి" గా చెప్పుకుందురు. గురు, శుక్రమూఢమిలో.. గురు, శుక్రుల శుభత్వము రవి వలన హరించి వేయబడును. కనుక ఆ కాలములో వివాహాది శుభకార్యములను చేయరాదు.

**2. మూఢమిలో చేయదగిన పనులు :** గ్రహ, నక్షత్ర శాంతులను, జప-హోమ కార్యక్రమములను, సమస్త వ్రతములు, ఉత్పాదకదోష శాంతులను చేయవచ్చు.

**3. మూఢమిలో చేయకూడని పనులు :** వివాహము, ఉపనయనము, దేవతా ప్రతిష్ఠలు, క్రతువులు, బావులు, యజ్ఞయాగాదులు, కర్ణవేధ, నూతన వ్యాపార, గృహారంభ, ప్రవేశములు, నూతన మంత్రానుష్ఠానము మొదలగు శుభకార్యములను విసర్జించవలెను.

**4. కర్తరి :** సూర్యుడు, భరణి 3,4పాదములలో సంచరించుటను "డొల్లు కర్తరి"గాను, కృత్తిక 1,2,3,4పాదములలో మరియు రోహిణి మొదటి పాదములో సంచరించుటను "నిజకర్తరి" అందురు. డొల్లుకర్తరి అంతదోషము కాదు. కర్తరిలో గృహనిర్మాణాది వాస్తుకర్మలను ఆచరించరాదు.

**5. కర్తరిలో చేయదగిన పనులు :** కర్తరియందు ఉపనయనము, వివాహము, గృహప్రవేశము, యజ్ఞ యాగాదులను, మండపాలు నిర్మించుటను మొదలైన పనులు చేయవచ్చు.

**6. కర్తరిలో చేయకూడని పనులు :** కర్తరిలో..చెట్లునరుకుట, విత్తనములు చల్లుట, పొలము సాగుచేయుట, గృహనిర్మాణము, క్రొత్త గ్రామనిర్మాణము, బావులు-చెఱువులు త్రవ్వుట, తోటలు వేయుట, వాహనారోహణము(నూతనముగా)చేయుట మొదలైన పనులు చేయరాదు.

**7. అధికమాసము :** శుక్లపాడ్యమి నుండి అమావాస్య వరకూ గల చాంద్రమాసములో సూర్యుడు రాశి మారని యెడల దానిని "అధికమాసము" గా నిర్ణయించుదురు. ఒక అధికమాసము పుట్టిన తరువాత తిరిగి 32 నుండి 35 నెలలకు గాని మరలా అధికమాసము పుట్టదు.

**8. అధికమాసమందు చేయదగిన పనులు :** సీమంతము, పుంసవము, జాతకర్మ, రోగశాంతి, ద్వాదశాహమునందు చేయవలసిన సపిండాంతకర్మ, గ్రహణశ్రాద్ధము, అమావాస్యాది తర్పణములు, నిత్యశ్రాద్ధ క్రియ, ప్రథమమాసికము, శుద్ధమాసమునందు మృతిచెందినవారికి చేయు ప్రథమాబ్దీకము, ఇదివరకు చూసిన పుణ్యక్షేత్రముల సందర్శనము, నిత్య-



శుక్రవారమందు జ్యేష్ఠయు, శనివారమందు రేవతియు దగ్ధనక్షత్రములనబడును.



నైమిత్తిక దానములు, సంధ్యావందనాది నిత్యకర్మలను మలమాసము (అధిక) నందు చేయవచ్చు.

**9. అధికమాసమందు చేయకూడని పనులు :** వివాహము,ఉపనయనము, నూతనముగా తీర్థయాత్ర, దేవతారామ తటాకాది ప్రతిష్ఠలు, గృహారంభ ప్రవేశములు, స్నాతక, నామకరణ, దేవతోత్సవములు, ఉపాకర్మలు మొదలైనవి అధికమాసము నందు చేయరాదు.

**10. క్షయమాసము :** శుక్లపాడ్యమి నుండి అమావాస్య వరకూ గల చాంద్రమాసములో సూర్యుడు రెండు రాశులలో ప్రవేశించినట్లైతే దానిని "క్షయమాసము" గా పరిగణించాలి. క్షయమాసము 19 లేదా 141 సంవత్సరములకు వస్తుంది. క్షయమాసము పుట్టిన సంవత్సరములో 2 అధిక మాసములు వస్తాయి.

**11. శూన్యమాసము :** సూర్యుడు మీనములోఉన్న చైత్రమాసము, మిధునములో ఉన్న ఆషాఢమాసము, కన్యలో ఉన్న భాద్రపదము, ధనుసులో ఉన్న పుష్యమాసములను "శూన్యమాసము" గా పరిగణింతురు. ఇందు వివాహాది శుభకార్యములు చేయరాదు.

**12. జన్మనక్షత్రమందు చేయదగిన పనులు :** యాగము, చెవులను కుట్టుట, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, పట్టాభిషేకము, భూమి సంపాదన, అక్షరాభ్యాసము, ఇంటి పనులను చేయవచ్చు.

**13. జన్మనక్షత్రమందు చేయకూడని పనులు :** గర్భాదానము, క్షౌరము, ప్రయాణము, పుంసవనము, సీమంతము, శ్రాద్ధము, వివాహము, ఔషధసేవ మొదలగునవి చేయరాదు.

**14. గోధూళికా లగ్నము :** సూర్యలగ్నాత్తు 7వ లగ్నము "గోధూళి కాలగ్న" మగును. అందు పుష్కర సమయమును "గోధూళికా ముహూర్తము" అందురు. ఇది అన్ని ప్రయాణములకు మంచిది.

**15. అభిజర్లగ్నము :** సూర్యలగ్నాత్తు 4వ లగ్నమును "అభిజర్లగ్నము" అందురు. అందలి పుష్కర కాలమును "అభిజన్మహూర్తము" అందురు. ఇది తిథి, వార, నక్షత్ర, కరణ, యోగముల వలన జనించెడి దుష్ట ఫలములను పోగొట్టి సర్వ కార్యసిద్ధిని కలుగచేయును.

**16. సిద్ధియోగములు :** శుక్రవారము "నంద తిథులు"(1,6,11), బుధవారము "భద్ర తిథులు"(2,7,12), మంగళవారము "జయ తిథులు" (3,8,13), శనివారము "రిక్త తిథులు"(4,9,14), గురువారము "పూర్ణ తిథులు"(5,10,15) కూడినచో వీటిని "సిద్ధియోగము" లందురు. ఇవి సర్వ కార్యసిద్ధిని కలుగజేయును.

**17. శుభ శకునములు :** ముత్తయిదువు-స్త్రీ-బ్రాహ్మణులు-పంట

దగ్గ నక్షత్రములందు లగ్న బలముంటే తప్ప ముహూర్తములు పనికిరావు.



కాపు-వేశ్య-మంగళ వాయిద్యములు-కల్లుకుండలు-ఫలములు-పుష్పములు-గొడుగు-విసనకర్ర-గుర్రము-ఏనుగు-నీటిబిందెలు-అన్నము-పాలు-పెరుగు-మాంసము-శంఖానాదములు-ఘంటా నాదములు-నూతన వధూవరులు-చల్లనిగాలి-కోడి-కుక్క-పెంపుడు జంతువులు మొదలైనవి ప్రయాణములో ఎదురువచ్చుట శుభముగా గుర్తించేది.

**18. అశుభ శకునములు :** కాకి అఱుపులు వినుట లేక తన్నుట-విధవా స్త్రీ-నూనె పాత్రలు-భిక్షగాడు-అంగవైకల్యజీవులు-రోగి-ముట్టుస్త్రీ-ఒంటి తుమ్ము-వస్తువులు జారిపడుట-మరచి పోవుట-అపశృతులు కలుగుట-క్రింద పడుట-నేనుకూడా వస్తాననుట-ఈ పూట వెళ్ళవద్దనుట- భోజనము చేసి వెళ్ళమనుట-గాలి-వర్షము-ఉరుములు వచ్చుట-పొగతో కూడిన నిప్పు-కుక్క మొరుగుట-మనసులో సంకోచము-దారిమధ్యలో కలహము మొదలైన అశుభ శకునములు ప్రయాణములో ఎదురుపడినపుడు, ప్రయాణమును విరమించుకొనుట మంచిది. తప్పనిసరై ప్రయాణము చేయవలసి వచ్చినపుడు..... వెనుకకు వచ్చి, కాళ్ళు కడుక్కొని, కాసేపు కూర్చుని, భగవంతుడిని ప్రార్థించి వెళ్ళవలెను.

**19. ధృవ నక్షత్రములు :** రోహిణి-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర నక్షత్రములు.

**20. చర నక్షత్రములు :** పునర్వసు-స్వాతి-శ్రవణము-ధనిష్ఠ-శతభిష నక్షత్రములు.

**21. ఉగ్ర నక్షత్రములు :** భరణి-మఖ-పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్ర నక్షత్రములు.

**22. సాధారణ నక్షత్రములు :** కృత్తిక-విశాఖ నక్షత్రములు.

**23. క్షిప్ర నక్షత్రములు :** అశ్విని-పుష్యమి-హస్త-అభిజిత్ నక్షత్రములు.

**24. మృదు నక్షత్రములు :** మృగశిర-చిత్త-అనురాధ-రేవతి నక్షత్రములు.

**25. దారుణ నక్షత్రములు :** ఆరుద్ర-ఆశ్లేష-జ్యేష్ఠ-మూల నక్షత్రములు.

**26. ఊర్ధ్వముఖ నక్షత్రములు :** రోహిణి-ఆరుద్ర-పుష్యమి-ఉత్తర-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-ఉత్తరాభాద్ర నక్షత్రములు ఊర్ధ్వముఖము కలవి.

**27. అధోముఖ నక్షత్రములు :** భరణి-కృత్తిక-ఆశ్లేష-మఖ-పుబ్బ-విశాఖ- మూల-పూర్వాషాఢ-పూర్వాభాద్ర నక్షత్రములు అధోముఖము కలవి.

**28. తిర్యక్‌ముఖ నక్షత్రములు:** అశ్విని-మృగశిర-పునర్వసు-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-జ్యేష్ఠ-రేవతి నక్షత్రములు తిర్యక్‌ముఖము కలవి.



కేవలము గోచార ఫలితములే జాతకము కాదు! దశలను అనుసరించి ఫలితాలలో మార్పులుండును.



## గోచార శుభస్థానములు

గ్రహముల యొక్క సంచారమును "గోచారము'' అందురు. జన్మరాశి (చంద్రుడున్న రాశి) లగాయతు నవగ్రహములు ఈ దిగువ తెలిపిన స్థానములలో సంచరించునపుడు జాతకునికి అనేక శుభఫలితములు కలుగును.

**1. రవి :** జన్మరాశి లగాయతు 3,6,10,11 స్థానములో సంచరిస్తున్నపుడు ఉద్యోగమును, ఉత్సాహమును, ధైర్యమును, కీర్తి-ప్రతిష్ఠలను కలుగ జేయును. మిగతా స్థానములలో చెడు ఫలితములను కలుగజేయును.

**2. చంద్ర :** జన్మరాశి లగాయతు 1,3,6,7,10,11 స్థానములందు మానసిక ఉల్లాసమును, సంతోషమును, స్త్రీసౌఖ్యమును, సుఖభోజనమును కలుగ జేయును. మిగతా స్థానములో దుష్టఫలితములు ఉండును.

**3. కుజ :** జన్మరాశి లగాయతు 3,6,11 స్థానములందు ధైర్యము, ఉత్సాహము, ఋణ విమోచనము, భూలాభము మరియు ఆరోగ్యమును కలుగ చేయును. మిగతా స్థానములలో మంచి ఫలితములు ఉండవు.

**4. బుధ :** జన్మరాశి లగాయతు 2,4,6,8,10,11 స్థానములలో సంఘ గౌరవము, విద్యను, శుభవార్తలను, ధనలాభము మరియు ఆరోగ్యమును కలుగజేయును. మిగతా స్థానములో వ్యతిరేక ఫలములుండును.

**5. గురు :** 2,5,7,9,11 స్థానములందు వ్యవహార జయమును, స్వర్ణవస్తు లాభమును, అధికారమును, పుణ్యక్షేత్ర సందర్శనమును, యశస్సును, సన్మానములను మరియు స్థిరాస్తులను కలిగించును. మిగతా స్థానములందు మంచిది కాదు.

**6. శుక్ర :** 1,2,3,4,5,8,9,11,12 స్థానములందు వివాహమును, స్త్రీసౌఖ్యమును, ఆనందమును, విందు-విలాసాదులను, కీర్తి-ప్రతిష్ఠలను, రాజకీయాధికారమును, వాహన లాభమును కలిగించును. మిగతా స్థానములో చెడు చేయును.

**7. శని :** 3,6,11, స్థానములందు భూగృహ నిర్మాణాదులను, ఉద్యోగమును, విలువైన వస్తులాభమును, అధికారమును కలిగించును. మిగతా స్థానములలో అశుభమును కలుగజేయును. అందు 1,2,12 స్థానములు "ఏలినాటి శని" గాను, 8న "అష్టమశని" గాను, 4న "అర్ధాష్టమశని" గాను, 10న "కంటకశని" గాను విపరీత కష్టములను కలుగజేయును.

**8. రాహు-కేతువులు :** 3,6,11 స్థానములందు వారసత్వ ఆస్తులను మరియు ఆకస్మిక అదృష్టములను, ధనలాభమును, వ్యవహార జయమును ప్రసాదించును. మిగతా స్థానముల యందు చాలాచిక్కులు, చీకాకులను కలిగించును.

స్త్రీలకు జన్మలగ్నమే కాక ప్రధమ ఆర్తవ లగ్నము కూడా భవిష్యత్తును సూచించును.



## ప్రధమ రజోదర్శన శుభాశుభ సమయములు

**1. శుభ నక్షత్రములు :** అశ్విని-రోహిణి-మృగశిర-ఆరుద్ర-పునర్వసు-పుష్యమి-ఉత్తరాత్రయము-చిత్త-స్వాతి-విశాఖ-అనూరాధ-శ్రవణము-ధనిష్ఠ-రేవతి తారలు శుభమైనవి.



**2. శుభ తిథులు :** 2,3,5,7,10,11,13, బహుళ పాడ్యమి, పూర్ణిమా తిథులు శుభమైనవి.

**3. శుభ వారములు :** సోమ,బుధ,గురు,శుక్ర వారములు మంచివి.

**4. శుభ మాసములు :** వైశాఖము, శ్రావణము, ఆశ్వయుజము, మార్గశిరము, మాఘము మరియు ఫాల్గుణ మాసములందు శుభ ఫలములు కలుగును

**5. శుభ లగ్నములు :** వృషభ, మిధున, కర్కాటక, కన్య, తుల, ధనూ, మీన లగ్నములు శుభమైనవి. మతాంతరమున సింహ, వృశ్చికములు కూడా మంచివని చెప్పుదురు.

**గమనిక :** పైనపేర్కొన్న శుభ తిథులు, వారములు, నక్షత్రములు, మాస ములు లగ్నములు కాక... మిగిలిన తిథి, వార, నక్షత్ర, మాస, లగ్నములలో కన్య పుష్పవతి అయినయెడల... శాంతులు, దానములు చేయించాలి. రజో దర్శన సమయమును బట్టి రజోలగ్నమును నిర్ణయించి, గ్రహబలమును బాగుగా పరిశీలించి... కన్యయొక్క భవిష్యత్తును నిర్ణయించినయెడల... ఫలితములు అనుభవమునకు సరిపోవును.

## బాలారిష్ట మహాదశలు

జన్మలగ్న రీత్యా శని 1టిన (లగ్నమందు), సూర్యుడు 2 లేక 5 వ స్థాన మున, గురుడు 3వ ఇంట, బుధుడు 4 లేక 12 ఇంట, శుక్రుడు 6వ స్థాన మున, కుజుడు 7న, చంద్రుడు 8న, రాహువు 9న ఈ స్థానములందు న్నచో... అరిష్ట ప్రదులగుదురు. అరిష్టము లేక మారకము చేయక విడిచి పెట్టినచో వారివారి మహాదశలు వచ్చినపుడు అరిష్టము చేయుదురు. అయితే ఈ ఫలితములను స్థూలముగా గ్రహించవలెను. సూక్ష్మ ఫలితములకై జాతకచక్రమును పూర్తిగా పరిశీలన కావించి, నిర్ధారణకు రావలయును. అరిష్ట సూచన ఉన్నచో తప్పనిసరిగా శాంతులు, మృత్యుంజయ జపమును జరిపించవలెను.



పుట్టుమచ్చలలో రంగు-పరిమాణము-ఆకృతిలచే ఫలితములలో మార్పులుండును



## పుట్టుమచ్చలు - ఫలితములు

| | | |
|---|---|---|
| శిరస్సున | - | ధైర్యవంతుడు,రాజకీయలాభము. |
| నుదుటన | - | మేధావి, ప్రజ్ఞావంతుడు |
| కనుబొమ్మలమీద | - | శీఘ్రవివాహము, పురుషసంతతి |
| కన్నులలో | - | స్వార్జితధనార్జన (కుడికన్నుమేలు) |
| ముక్కుమీద | - | కోపిష్ఠి, ధర్మపరుడు |
| చెవులమీద | - | ఆయుర్దాయలాభము |
| పెదవులమీద | - | భోజనప్రియులు, కాముకులు |
| చెక్కిళ్ళు | - | సుఖదాంపత్యము |
| కణతలమీద | - | సౌందర్యఆరాధన |
| కంఠముమీద | - | వివాహలాభము, ప్రధమములో పురుషసంతానము |
| వక్షముమీద | - | మంచిప్రవర్తన |
| హృదయముమీద | - | ప్రేమవ్యవహారాలు ఎక్కువ |
| కుడిభుజము | - | కీర్తి, పేరుప్రతిష్ఠలు |
| ఎడమభుజము | - | తరచూకలహములు |
| పొట్టమీద | - | రహస్యములుదాచేవారు |
| నాభిమీద | - | ధనలాభము, పొదుపరి |
| పొత్తికడుపు | - | అనారోగ్యము |
| చేతులు | - | వ్యవసాయలాభము |
| కుడితొడ | - | ధనలాభము, లక్షాధికారి |
| ఎడమతొడ | - | స్త్రీ లంపటుడు - చంచలమనస్సు |
| మర్మాంగము | - | మన్మధసౌఖ్యము |
| వృషణములు | - | వాహనయోగము |
| కుడివృషణము | - | పురుషసంతతి |
| ఎడమవృషణము | - | స్త్రీసంతతి అధికము |
| మోకాళ్ళు | - | నాటకములపిచ్చి |
| కాలిపిక్కలు | - | శరీరశ్రమ ఎక్కువ |
| పాదములు | - | సంచారవృత్తి |
| అరికాళ్ళు | - | వివేకము, యోచనాశక్తి |
| అరిచేతులు | - | కల్పనాశక్తి, రచయితలు |
| చేతిబొటనవ్రేలు | - | స్వయంవిద్య,ఇష్టార్ధలాభము |
| పిరుదులు | - | యోగమంత్రసాధనలు |
| గడ్డముమీద | - | ధనసంపాదనాపరులు |
| పిరుదులు | - | యోగమంత్రసాధనలు |
| గడ్డముమీద | - | ధనసంపాదనాపరులు |

నవగ్రహ సమయ ఫలితములు ఆయా దశలలో అనుభవమునకు వచ్చును.



# నవగ్రహముల సమయములు

ప్రతి జాతక చక్రమునుకు సమయావస్థలను అన్ని గ్రహములకు కట్టవలయును. ఏ గ్రహము,ఏ సమయావస్థను పొందియుండునో,ఆ గ్రహమాస్వభావమును పొందియుండును. ఏ గ్రహమునకు సమయము కట్టవలయునో ఆ గ్రహము మేషాదిగా ఎన్నవరాశినందున్నదో తెలుసుకుని,ఆ రాశి సంఖ్యను మేషాది జన్మలగ్న సంఖ్యచే గుణించగా వచ్చిన మొత్తమును, ఏ గ్రహమునకు సమయము కట్టుచున్నామో ఆ గ్రహదశా ప్రమాణ సంఖ్యలచే తిరిగి గుణించగా వచ్చిన మొత్తమును 27చే భాగించవలయును. అట్లు భాగించగా లబ్దమును విడిచి శేషమును గ్రహించగా శేషసంఖ్యకు సరియగు సమయావస్థను ఆ గ్రహము యొక్క సమయముగా తెలుసుకోవలెను.

| శేష సంఖ్య | సమయము | సమయఫలము |
|---|---|---|
| 1 | స్నానసమయము | ధైర్యోత్సాహములు కలుగచేయును. |
| 2 | వస్త్రధారణ | అధికారమునిచ్చును. |
| 3 | తిలకధారణ | క్షేమము కలుగచేయును. |
| 4 | జపసమయము | శత్రుజయము |
| 5 | శివపూజ | శత్రుజయము,సౌఖ్యము |
| 6 | ఉపాసన | దుఃఖప్రాప్తి |
| 7 | విష్ణుపూజ | దిగ్విజయము |
| 8 | బ్రాహ్మణపూజ | రాజ్యప్రాప్తి |
| 9 | నమస్కారము | శుభప్రదము |
| 10 | అద్రిప్రదక్షిణ | లాభము |
| 11 | వైశ్వదేవసమయము | మంగళప్రదము |
| 12 | అతిధిపూజ | భోగభాగ్యము |
| 13 | భోజన | భోగము |
| 14 | విద్యాప్రసంగ | పాండిత్యము |
| 15 | ఆక్రోశ | వ్యసనము |
| 16 | తాంబూల | స్త్రీసౌఖ్యము |
| 17 | రాజవిలాసస్థితి | జయము |
| 18 | కిరీటధారణ | వాహనసౌఖ్యము,సుఖము |
| 19 | జలపాన | సుఖము |
| 20 | ఆలస్య | మిక్కిలిదుఃఖము |
| 21 | శయన | సౌభాగ్యవిహీనము |
| 22 | అమృతాసన | తృప్తినికలుగచేయును |
| 23 | గంధపుష్పాద్యాభరణ | ప్రభుత్వము |
| 24 | స్త్రీసల్లాప | భోగము |
| 25 | భోగ | కుటుంబవృద్ధి |
| 26 | నిద్రాసమయ | భోగవిహీనము |
| 27 | రత్నపరీక్షాసమయము | ధనప్రాప్తి |



ఏకవింశతి(21) దోషములు లేని ముహూర్త నిర్ణయము బ్రహ్మకు కూడా అసాధ్యమే.



# వివాహాది సుముహూర్తములు 2018-19

**గమనిక :** శాస్త్రమును, సంప్రదాయమును, అనుభవమును, దృష్టిలో ఉంచుకొని ఈ ముహూర్తములను నిర్ణయించుట జరిగినది. రాహుకాలమును, హోరాకాలమును ముహూర్తములందు పరిగణించరాదు. ముహూర్త నిర్ణయములో ఏకవింశతి దోషములను, వర్జ్య దుర్ముహూర్తములను మాత్రమే పరిగణించి సరిపడు తిథి, వార, నక్షత్ర, లగ్నములను రహిత పరచి, వివిధ చక్రశుద్ధులను గావించి ఆయా ముహూర్తములుంచుట మంచిది.

పాపగ్రహముల క్రాంతము మరియు వేధలు గల నక్షత్రాలు తీవ్ర దుష్పరిణామాలు కలిగించుట మా అనుభవనీయము. కావున ఎంతటి లగ్నబలము, గ్రహబలము కలిగియున్ననూ అటువంటి నక్షత్రములలో శుభ ముహూర్తములను విసర్జించుట జరిగినది.

వివాహమునకు జామిత్రశుద్ధి, సర్వ ముహూర్తములకు అష్టమశుద్ధి చూడడము జరిగినది. చరలగ్న ములు,సోమవారము వివాహ ముహూర్తములలో నిషేధించుట జరిగినది. భృగుషట్కమును వదిలి వేయడము జరిగినది. పంచకరహితము చేయుటలో సూర్యోదయాత్ సూర్యోదయ పర్యంతము ఒకేదిన(వార)ముగా లెక్కించడమైనది. పంచకరహితములో భిన్నమైన పద్ధతులు ఉన్నవి. పంచకరహితము కంటే లగ్నబలముకు ప్రాధాన్యత ఇవ్వాలి. రాహు-కేతువులను కూడా గ్రహములగానే పరిగణించుట జరిగినది.

చక్రశుద్ధులు (వివాహ-వృషభ-కలశ) లేని నక్షత్రములతో కూడిన మరియు స్థానశుద్ధి లేని లగ్నములతో కూడిన బలమైన ముహూర్తములను ద్వితీయ పక్షముగా గ్రహించవచ్చు.

ఒక వ్యక్తికి ముహూర్తమును నిర్ణయించేటప్పుడు...ముందుగా ఆ వ్యక్తి యొక్క జన్మ లేదా నామ నక్షత్రము నుండి ముహూర్త నక్షత్రము వరకు తారాబలమును లెక్కించవలెను. అనగా 2-11-20 సంపత్, 4-13-22 క్షేమ, 6-15-24 సాధన, 8-17-26 మిత్ర, 9-18-27 పరమమైత్ర తారలును మాత్రమే గ్రహించవలెను. అటులనే ఆ వ్యక్తి జన్మరాశి లేదా నామరాశి నుండి 4-8-12 రాశులలో చంద్రుడున్న ముహూర్త నక్షత్రములను త్యజించవలెను. ఎంతటి తారాబలము-గ్రహబలము ఉన్ననూ ఎట్టిపరిస్థితులలోను ముహూర్తలగ్నము, ఆ వ్యక్తి యొక్క జన్మలగ్నము నుండి 6-8-12 లగ్నములలో పడరాదు.

అన్ని ముహూర్తములకు అష్టమశుద్ధి ఉండాలి. ముహూర్త లగ్నము పాపార్గళములో గాని, పాపగ్రహ కర్తరిలో గాని పడరాదు. ముహూర్తము నాడు చంద్రుడు పాప గ్రహములతో కలవరాదు. చంద్రుడు లగ్నములో ఉండగా ఎటువంటి శుభకార్యము చేయరాదు. గృహారంభ మరియు ప్రవేశ లగ్నములకు 4-12 స్థానములలో ఎటువంటి పాప గ్రహములు ఉండరాదు. వివాహ ముహూర్తలగ్నము నుండి 7 డింట ఏ గ్రహములు ఉండరాదు. వివాహ లగ్నమునకు 7వ ఇంట సూర్యుడు-కుజుడు-రాహు- కేతువులు ఉండిన యెడల, ఆత్మహత్యలు-కోర్టు గొడవలు-వివాదములు -ఆకస్మిక మరణములు సంభవమగును. వివాహ లగ్నమునకు 7వ ఇంట చంద్రుడున్నప్పుడు, భార్యాభర్తలు అనుమానము-అపనిందలతో త్వరగా విడిపోవును. వివాహ లగ్నమునకు 7వ ఇంట బుధ-శనులు ఉన్నప్పుడు షండత్వము లేదా సంతాన హీనత కలుగును. వివాహ లగ్నమునకు 7వ ఇంట గురుడు ఉన్నప్పుడు, అవమానములు-కలహములు కలుగును. వివాహ లగ్నమునకు 7వ ఇంట శుక్రుడు ఉన్నప్పుడు, జారత్వము లేదా చెడు ప్రవర్తన కలుగును. కావున పండితులు పొరపాటుగా లగ్నమును నిర్ణయించిననూ విజ్ఞులు గ్రహించగలరు.

ఈ ముహూర్తములు రాజమండ్రికి చేయబడి, ఇండియన్ స్టాండర్డ్ టైమ్‌కు సరిచూపబడినవి. కావున...ఈ పంచాంగము లోని దేశాంతర సంస్కార చక్రము ఉపయోగించి ఆంధ్రదేశమంతటా ఆచరించవచ్చు.

ఆయా శుభకార్యములకు ఆయా స్థానశుద్ధులను తప్పక పాటించవలెను.



## 1. చైత్ర మాసము (18-03-2018 నుండి 16-04-2018 వరకు)

| | | | |
|---|---|---|---|
| రవి,చంద్ర బుధ,శుక్ర | | | |
| | చైత్ర మాస ప్రారంభ గ్రహస్థితులు | | రాహు |
| కేతు | | | |
| కుజ,శని | | గురు(వ) | |

**22-03-2018 బుధ వక్రం మొదలు**
**26-03-2018 మేష శుక్ర**
**14-04-2018 మేష రవి**
**15-04-2018 బుధ వక్రం ఆఖరు**
**గమనిక : మీన చైత్రము అగుటచే ఈ మానమంతయూ వివాహ ముహూర్తములు వ్రాయబడలేదు. గ్రహించగలరు!**

**మార్చ్ 18.** ఆది చైత్ర శు॥పాడ్యమి **ఉత్తరాభాద్ర** (రవిక్రాంతము) నూతన వ్యవహారాదీనాం-వస్త్రాభరణము-రాజదర్శనార్థము **మేష** మతాం॥ ర॥ **ఉ॥8-50.** విదియ **రేవతి** గృహారంభ-ప్రవేశాదులు **కుంభ** ర॥ **తె॥5-39. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**19.** సోమ తదియ **అశ్విని** గృహప్రవేశాదులు **తులా** మతాం॥ ర॥ **రా॥9-41. వృశ్చిక** ర॥ **రా॥10-38.** (6చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు **కుంభ తె॥5-36. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**22.** గురు పంచమి **కృత్తిక** (కేతువేధ) సాధారణపనులు **మేష** ర॥ **ఉ॥8-34.** షష్ఠి **రోహిణి** గృహప్రవేశాదులు **వృశ్చిక** ర॥ **రా॥10-25.** (7చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు **కుంభ తె॥5-23. (వృషభ చక్రశుద్ధి లేదు)**

**23.** శుక్ర సప్తమి **మృగశిర** సాధారణపనులు **తులా** ర॥ **రా॥9-25.** (8చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు **కుంభ తె॥5-20. (వృషభ చక్రశుద్ధి లేదు)**

**25.** ఆది నవమి **ఆరుద్ర** (శనివేధ) సాధారణపనులు **మేష** మతాం॥ ర॥ **ఉ॥8-23. పునర్వసు** (కుజవేధ) సాధారణపనులు **తులా** చోరః **రా॥9-17.**

**26.** సోమ ఏకాదశి **పుష్యమి** గృహారంభ-ప్రవేశాదులు **కుంభ** ర॥ **తె॥5-08.** (6చంద్రః)

**27.** మంగళ ఏకాదశి **పుష్యమి** అన్నప్రాశనాదులు **మేష** ర॥ **ఉ॥8-15.**

**28.** బుధ ద్వాదశి **ఆశ్లేష** (రాహుక్రాంతము) సాధారణపనులు **మేష** మతాం॥ ర॥ **ఉ॥8-10. మఖ** (కేతువేధ) గృహప్రవేశాదులు **తులా** మతాం॥ ర॥ **రా॥9-04.** త్రయోదశి **మఖ** (కేతువేధ) గృహారంభ-ప్రవేశాదులు **కుంభ తె.॥4-59.** (7చంద్రః) **(వృషభ చక్రశుద్ధి లేదు)**



ఒక వ్యక్తియొక్క ఆగామికర్మను అనుసరించి మూహూర్తము దొరుకును.



**29.** గురు త్రయోదశి **మఖ** (కేతువేధ) సాధారణపనులు **మేష ఉ॥8-07. పుబ్బ తులా** ర॥ **రా॥9-01. కుంభ తె॥4-56.**

**30.** శుక్ర చతుర్దశి **ఉత్తర** అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-గృహారంభ-ప్రవేశాదులు **మేష** మతాం॥ ర॥ **ఉ॥8-02.** (4రాహుః) పూర్ణిమ **ఉత్తర** గృహప్రవేశాదులు **తులా** మతాం॥ ర॥ **రా॥8-56. వృశ్చిక** ర॥ **రా॥9-53. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**31.** శని పూర్ణిమ **హస్త** (రవివేధ) సాధారణపనులు **మేష** ర॥ **ఉ॥7-58.** (6చంద్రః) బ॥పాడ్యమి **హస్త కుంభ తె॥4-47.** (8చంద్రః)

**ఏప్రిల్ 1.** ఆది బ॥పాడ్యమి **చిత్త** అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకారములు **మేష** మతాం॥ ర॥ **ఉ॥7-54.** (6చంద్రః) విదియ **చిత్త** గృహప్రవేశాదులు **తులా** చోరః **రా॥8-48. వృశ్చిక** ర॥ **రా॥9-45.** (12చంద్రః) **(కలశ చక్రశుద్ధి లేదు)**

**2.** సోమ విదియ **స్వాతి** సాధారణపనులు **మేష ఉ॥7-51.** తదియ **స్వాతి** గృహప్రవేశాదులు **తులా** ర॥ **రా॥8-45.** (1చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు **కుంభ** రాజః **తె॥4-40. (కలశ చక్రశుద్ధి లేదు)**

**3.** మంగళ తదియ **విశాఖ** సాధారణపనులు **మేష** ర॥ **ఉ॥7-47.**

**4.** బుధ చవితి **విశాఖ** సాధారణపనులు **మేష** వసుః **ఉ॥7-42.** (8చంద్రః) పంచమి **అనురాధ** (రాహువేధ) సాధారణపనులు **తులా** చోరః **రా॥8-36. వృశ్చిక** ర॥ **రా॥9-33.** (1చంద్రః)

**6.** శుక్ర సప్తమి **మూల** గృహప్రవేశాదులు **వృశ్చిక** మతాం॥ ర॥ **రా॥9-26.** గృహారంభ-ప్రవేశాదులు **కుంభ** ర॥ **తె॥4-24. (కలశ చక్రశుద్ధి లేదు)**

**8.** ఆది అష్టమి **పూర్వాషాఢ** (కుజ-శనుల క్రాంతము) సాధారణపనులు **మేష** ర॥ **ఉ॥7-27.** నవమి **ఉత్తరాషాఢ** గృహారంభ-ప్రవేశాదులు **కుంభ తె॥4-16.** (12చంద్రః)

**9.** సోమ నవమి **ఉత్తరాషాఢ** అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-గృహారంభ-ప్రవేశాదులు **మేష** మతాం॥ ర॥ **ఉ॥7-23.** గృహప్రవేశాదులు **తులా** ర॥ **రా॥8-17. శ్రవణము** (కేతుక్రాంతము) సాధారణపనులు **వృశ్చిక** ర॥ **రా॥9-14. కుంభ తె॥4-12.** (12 చంద్రః)

**10.** మంగళ దశమి **శ్రవణము** (కేతుక్రాంతము) సాధారణపనులు **మేష** ర॥ **ఉ॥7-19. తులా** మతాం॥ ర॥ **రా॥8-13. వృశ్చిక** ర॥ **రా॥9-10.**

**11.** బుధ ఏకాదశి **ధనిష్ఠ** (రాహువేధ) సాధారణపనులు **మేష** ర॥ **ఉ॥7-15. తులా** ర॥ **రా॥8-09. శతభిషము కుంభ** ర॥ **తె॥4-04.** (1చంద్రః)

ముహూర్త విషయములలో హోరాకాలమును, రాహుకాలమును పరిగణించరాదు.



## 2. వైశాఖ మాసము (17-04-2018 నుండి 15-05-2018 వరకు)

| | | | |
|---|---|---|---|
| బుధ | రవి,చంద్ర శుక్ర | | |
| | **వైశాఖ మాస ప్రారంభ గ్రహస్థితులు** | | రాహు |
| కేతు | | | |
| కుజ శని | | గురు(వ) | |

**18-04-2018 శని వక్రం మొదలు**
**19-04-2018 వృషభ శుక్ర**
**02-05-2018 మకర కుజ**
**04-05-2018 డొల్లు కర్తరి ప్రారంభము**
**09-05-2018 మేష బుధ**
**11-05-2018 నిజ కర్తరి ప్రారంభము**
**14-05-2018 మిధున శుక్ర**
**15-05-2018 వృషభ రవి**
**గమనిక :ఈ మాసములో ఉదయ లగ్నములు శుద్ధిగా లేనందున అన్నప్రాశనాది పగటి ముహూర్తములు లేవు.**

**ఏప్రిల్ 17.** మంగళ వైశాఖ శు॥విదియ **భరణి** క్రయవిక్రయాదులు **సింహ** ర॥ **ప॥3-17.**

**18.** బుధ చవితి **రోహిణి** వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **కుంభ** ర॥ **తె॥3-36. (వృషభ,కలశ చక్రశుద్ధి లేదు)**

**19.** గురు చవితి **రోహిణి** గృహప్రవేశాదులు **వృశ్చికము** ర॥ **రా॥8-33.** (7చంద్రః) పంచమి **మృగశిర** వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **కుంభ తె॥3-31. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**20.** శుక్ర పంచమి **మృగశిర** సాధారణపనులు **వృషభ** ర॥ **ఉ॥8-06.** (1చంద్రః,శుక్రః, 8కుజః,శనిః)

**21.** శని షష్ఠి **ఆరుద్ర** (కుజ,శనుల వేధ) సాధారణపనులు **సింహ** చోరః **ప॥3-01.** సప్తమి **పునర్వసు** వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **కుంభ** ర॥ **తె॥3-24. (వివాహ,వృషభ చక్రశుద్ధులు లేవు)**

**22.** ఆది అష్టమి **పుష్యమి** గృహప్రవేశాదులు **వృశ్చిక** ర॥ **రా॥8-22.** (7శుక్రః)

**24.** మంగళ దశమి **మఖ** (కేతువేధ) సాధారణపనులు **వృశ్చికము** రాజః **రా॥8-13.** వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **కుంభ** ర॥ **తె॥3-11. (వివాహ చక్రశుద్ధి లేదు)**

**25.** బుధ దశమి **మఖ** (కేతువేధ) సాధారణపనులు **వృషభ** వసుః **ఉ॥7-46.** (1శుక్రః, 8కుజః,శనిః) ఏకాదశి **మఖ** (కేతువేధ) క్రయవిక్రయాదులు **సింహ** ర॥ **ప॥2-44.** (1చంద్రః) **పుబ్బ** (రవివేధ) సాధారణపనులు **వృశ్చికము** ర॥ **రా॥8-09.**

**26.** గురు ద్వాదశి **ఉత్తర** సాధారణపనులు **సింహ** ర॥ **ప॥2-43.** (1చంద్రః)

**27.** శుక్ర ద్వాదశి **ఉత్తర** సాధారణపనులు **వృషభ** ర॥ **ఉ॥7-39.** (1శుక్రః, 8కుజః,శనిః) త్రయోదశి **హస్త** గృహప్రవేశాదులు **వృశ్చిక** రాజః **రా॥8-02.** (7శుక్రః) **(వృషభ చక్రశుద్ధి లేదు)**



తాత్కాలిక ప్రయోజనము చేకూర్చేది సరైన మూహూర్తము కాదు!



**28.** శని చతుర్దశి **హస్త** సాధారణపనులు **వృషభ** ర॥ **ఉ॥7-34. చిత్త** క్రయవిక్రయాదులు **సింహ** మతాం॥ ర॥ **ప॥2-32.** గృహప్రవేశాదులు **వృశ్చిక** ర॥ **రా॥7-57.** (7శుక్రః) **(వృషభ చక్రశుద్ధి లేదు)**

**29.** ఆది పూర్ణిమ **చిత్త** సాధారణపనులు **వృషభ** ర॥ **ఉ॥7-30.** (6చంద్రః, 8కుజః,శనిః) **స్వాతి** క్రయవిక్రయాదులు **సింహ** ర॥ **ప॥2-28.** గృహప్రవేశాదులు **వృశ్చిక** ర॥ **రా॥7-53.** (7శుక్రః, 12చంద్రః) వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **కుంభ రా॥2-51. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**30.** సోమ బ॥పాడ్యమి **స్వాతి** క్రయవిక్రయాదులు **సింహ** ర॥ **ప॥2-24.**

**మే 1.** మంగళ విదియ **విశాఖ** సాధారణపనులు **వృషభ** ర॥ **ఉ॥7-22.** (1శుక్రః, 6చంద్రః, 8కుజః,శనిః) క్రయవిక్రయాదులు **సింహ** వసుః **ప॥2-20. అనురాధ** (రవివేధ) సాధారణపనులు **వృశ్చిక** ర॥ **రా॥7-45.** (1చంద్రః) వివాహ,గృహారంభ-ప్రవేశాదులు **కుంభ రా॥2-43. (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**2.** బుధ విదియ **అనురాధ** (రవివేధ) సాధారణపనులు **వృషభ** ర॥ **ఉ॥7-19.** (1శుక్రః, 8కుజః,శనిః)

**3.** గురు చవితి **జ్యేష్ఠ** (రాహువేధ) సాధారణపనులు **సింహ** ర॥ **ప॥2-12. మూల** వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **కుంభ** ర॥ **రా॥2-35. (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**4.** శుక్ర పంచమి **మూల** క్రయవిక్రయాదులు **సింహ** మతాం॥ ర॥ **ప॥2-05.**

**5.** శని షష్ఠి **ఉత్తరాషాఢ** (కుజక్రాంతము) సాధారణపనులు **కుంభ రా॥2-28.**

**7.** సోమ సప్తమి **శ్రవణము** (కేతుక్రాంతము) సాధారణపనులు **వృషభ** చోరః **ఉ॥7-00.** (1శుక్రః, 8శనిః) **సింహ** ర॥ **ప॥1-58.** (6చంద్రః)

**8.** మంగళ అష్టమి **ధనిష్ఠ** సాధారణపనులు **వృశ్చికము** ర॥ **రా॥7-18.**

**9.** బుధ నవమి **శతభిషము** క్రయవిక్రయాదులు **సింహ** చోరః **ప॥1-49.** దశమి **శతభిషము** సాధారణపనులు **కుంభ** రాజః **రా॥2-12.** (1చంద్రః)

**10.** గురు దశమి **శతభిషము** సాధారణపనులు **వృషభ** ర॥ **ఉ॥6-47.** (1శుక్రః, 8శనిః) **పూర్వాభాద్ర** క్రయవిక్రయాదులు **సింహ** ర॥ **ప॥1-45.**

**11.** శుక్ర ఏకాదశి **పూర్వాభాద్ర** సాధారణపనులు **వృషభ** మతాం॥ ర॥ **ఉ॥6-43.** (1శుక్రః, 8శనిః) **ఉత్తరాభాద్ర** గృహప్రవేశాదులు **వృశ్చిక** ర॥ **రా॥7-06.** (7శుక్రః) ద్వాదశి **ఉత్తరాభాద్ర** వివాహ-గృహప్రవేశాదులు **కుంభ** ర॥ **రా॥2-04.**

## 3. అధిక జ్యేష్ఠ మాసము (16-05-2018 నుండి 13-06-2018 వరకు)

| | | | |
|---|---|---|---|
| | బుధ | రవి చంద్ర | శుక్ర |
| | **అధిక జ్యేష్ఠ మాస ప్రారంభ గ్రహస్థితులు** | | రాహు |
| కుజ కేతు | | | |
| శని (వ) | | గురు(వ) | |

**27-05-2018 వృషభ బుధ**
**28-05-2018 కర్తరి ఆఖరు**
**08-06-2018 కర్కాటక శుక్ర**
**10-06-2018 మిధున బుధ**
**గమనిక :-ఈ మాసములో ఉదయ లగ్నములు శుద్ధిగా లేనందున అన్న ప్రాశనాది ముహూర్తములు వ్రాయ బడలేదు.**

**మే** **16.** బుధ అధిక జ్యేష్ఠ శుక్ల విదియ **రోహిణి** సాధారణపనుల **కుంభ** ర॥ **రా॥1-44. మేష తె॥4-55.**
**17.** గురు తదియ **మృగశిర** సాధారణపనులు **కుంభ** చోరః **రా॥1-41.**
**18.** శుక్ర చవితి **పునర్వసు** సాధారణపనులు **మేష** ర॥ **తె॥4-48.**
**19.** శని పంచమి **పునర్వసు** సాధారణపనులు **సింహ** మతాం॥ ర॥ **ప॥1-09. తులా** వసుః **సా॥5-37.**
**23.** బుధ నవమి **పుబ్బ** సాధారణపనులు **తులా** రాజః **సా॥5-21.**
**24.** గురు దశమి **ఉత్తర** క్రయవిక్రయాదులు **సింహ** ర॥ **ప॥12-49. తులా** ర॥ **సా॥5-17.** (12చంద్రః) ఏకాదశి **హస్త మేషము** ర॥ **తె॥4-23.** (6చంద్రః)
**26.** శని త్రయోదశి **స్వాతి** సాధారణపనులు **మేష** ర॥ **తె॥4-21.**
**27.** ఆది త్రయోదశి **స్వాతి** క్రయవిక్రయాదులు **సింహ** ర॥ **ప॥12-38.**
**29.** మంగళ పూర్ణిమ **అనురాధ** క్రయవిక్రయాదులు **సింహ** రాజః **ప॥12-29. కన్యా** ర॥ **ప॥2-06. తులా** మతాం॥ ర॥ **సా॥4-57.**
**30.** బుధ బ॥విదియ **మూల** సాధారణపనులు **మేష తె॥3-59.**
**31.** గురు విదియ **మూల** క్రయవిక్రయాదులు **సింహ** రాజః **ప॥12-21. కన్యా** ర॥ **ప॥1-58. తులా** చోరః **సా॥4-49.**
**జూన్** **2.** శని చవితి **ఉత్తరాషాఢ** క్రయవిక్రయాదులు **తులా** ర॥ **సా॥4-43.** సాధారణపనులు **మేష తె॥3-49.**
**3.** ఆది పంచమి **ఉత్తరాషాఢ** క్రయవిక్రయాదులు **సింహ** ర॥ **ప॥ 12-11.** (6చంద్రః) **శ్రవణము** (కుజ,శనుల క్రాంతము) సాధారణపనులు **కన్యా** ర॥ **ప॥1-48.**
**4.** సోమ షష్ఠి **శ్రవణము** (కుజ,శనుల క్రాంతము) సాధారణపనులు **కన్యా** ర॥ **ప॥1-43. ధనిష్ఠ మేష** ర॥ **తె॥3-40.**
**5.** మంగళ సప్తమి **ధనిష్ఠ** క్రయవిక్రయాదులు **కన్యా** ర॥ **ప॥1-39.** (6చంద్రః) **తులా** రాజః **సా॥4-30. శతభిషము** సాధారణపనులు **మేషతె॥3-36.**
**6.** బుధ అష్టమి **శతభిషము** సాధారణపనులు **తులా** ర॥ **సా॥4-26.**
**7.** గురు నవమి **ఉత్తరాభాద్ర** సాధారణపనులు **మేష** ర॥ **తె॥3-29.** (12చంద్రః)
**8.** శుక్ర దశమి **ఉత్తరాభాద్ర** సాధారణపనులు **తులా** మతాం॥ ర॥ **సా॥4-19.** (6చంద్రః) **రేవతి మేష తె॥3-25.** (12చంద్రః)
**9.** శని ఏకాదశి **రేవతి** క్రయవిక్రయాదులు **కన్యా** మతాం॥ ర॥ **ప॥1-24. తులా** ర॥ **సా॥4-15.** (6చంద్రః)
**10.** ఆది ఏకాదశి **అశ్విని** అన్నప్రాశనాదులు **సింహ** ర॥ **ఉ॥11-43.**





## 4. నిజ జ్యేష్ఠ మాసము (14-06-2018 నుండి 13-07-2018 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | రవి | బుధ చంద్ర |
| | **నిజ జ్యేష్ఠ మాస ప్రారంభ గ్రహస్థితులు** | | శుక్ర రాహు |
| కుజ కేతు | | | |
| శని (వ) | | గురు(వ) | |

**15-06-2018 మిధున రవి**
**25-06-2018 కర్కాటక బుధ**
**26-06-2018 కుజ వక్రము మొదలు**
**04-07-2018 సింహ శుక్ర**
**10-07-2018 గురు వక్రము ఆఖరు**

**జూన్** **14.** గురు నిజ జ్యేష్ఠ శు॥విదియ **ఆరుద్ర** సాధారణపనులు **కుంభ** మతాం॥ ర॥ **రా॥11-51. మేష** ర॥ **తె॥3-02.**
**15.** శుక్ర విదియ **పునర్వసు** (శనివేధ) క్రయవిక్రయాదులు **తులా** రాజః **ప॥3-52.** తదియ **పునర్వసు** (శనివేధ) సాధారణపనులు **కుంభ** ర॥ **రా॥11-47. మేష తే॥2-58.**
**16.** శని తదియ **పుష్యమి** (రాహుక్రాంతము) సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥11-20.** (12చంద్రః) **కన్యా** చోరః **ప॥12-57.** చవితి **పుష్యమి** (రాహుక్రాంతము) **తులా** మతాం॥ ర॥ **ప॥3-48. కుంభ** ర॥ **రా॥11-43. మేష తె॥2-54.**
**17.** ఆది పంచమి **ఆశ్లేష** సాధారణపనులు **కన్యా** ర॥ **ప॥12-53. తులా** రాజః **ప॥3-44.**
**18.** సోమ షష్ఠి **మఖ** (కుజ,కేతువుల వేధ) సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥11-12.** (1చంద్రః)
**19.** మంగళ సప్తమి **పుబ్బ** సాధారణపనులు **కన్యా** ర॥ **ప॥12-45.** (12చంద్రః) **ఉత్తర** స్తంభ ప్రతిష్ఠ-గృహప్రవేశాదులు **మేష** ర॥ **రా॥2-42.**
**20.** బుధ అష్టమి **ఉత్తర** క్రయవిక్రయాదులు **కన్యా** ర॥ **ప॥12-41.** (1చంద్రః) **తులా** మతాం॥ ర॥ **ప॥3-32.** (12చంద్రః) **హస్త** స్తంభ ప్రతిష్ఠ-గృహప్రవేశాదులు **మేష రా॥2-38.** (6చంద్రః)
**21.** గురు నవమి **హస్త** క్రయవిక్రయాదులు **కన్యా** మతాం॥ ర॥ **ప॥ 12-36.** (1చంద్రః) **చిత్త** స్తంభ ప్రతిష్ఠ-గృహప్రవేశాదులు **మేష రా॥2-33.** (6చంద్రః)
**22.** శుక్ర దశమి **చిత్త** వివాహ-గృహప్రవేశాదులు **కుంభ** ర॥ **రా॥11-19.** (6శుక్రః) స్తంభ ప్రతిష్ఠ-గృహప్రవేశాదులు **మేష రా॥2-30.** (7చంద్రః) **(వివాహ చక్రశుద్ధి లేదు)**
**23.** శని ఏకాదశి **స్వాతి** సాధారణపనులు **సింహ** అగ్నిః **ఉ॥10-52.** క్రయవిక్రయాదులు **కన్యా** ర॥ **ప॥12-29. తులా** రాజః **ప॥3-20.** (1చంద్రః) వివాహ-గృహప్రవేశాదులు **కుంభ** మతాం॥ ర॥ **రా॥ 11-15.** (6శుక్రః) స్తంభ ప్రతిష్ఠ-గృహప్రవేశాదులు **మేష** ర॥ **రా॥2-26.** (7చంద్రః) **(వివాహ చక్రశుద్ధి లేదు)**

**25.** సోమ త్రయోదశి **అనురాధ** గృహప్రవేశాదులు **కుంభ** ర॥ **రా॥ 11-07. (వృషభ చక్రశుద్ధి లేదు)**

**26.** మంగళ చతుర్దశి **జ్యేష్ఠ** (రాహువేధ) సాధారణపనులు **సింహ** మతాం॥ **ర॥ ఉ॥10-39.**

**27.** బుధ పూర్ణిమ **మూల** (శనిక్రాంతము) సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥10-36.**

**29.** శుక్ర బ॥పాడ్యమి **పూర్వాషాఢ** (రవివేధ) అన్నప్రాశనాదులు **సింహ** ర॥ **ఉ॥10-29.** క్రయవిక్రయాదులు **కన్యా** మతాం॥ ర॥ **వ॥12-06.** విదియ **పూర్వాషాఢ** (రవివేధ) **తులా** వసుః **ప॥2-57. ఉత్తరాషాఢ** వివాహ-గృహప్రవేశాదులు **కుంభ** మతాం॥ ర॥ **రా॥ 10-52.** (6శుక్రః, 12చంద్రః) **(వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**30.** శని విదియ **ఉత్తరాషాఢ** అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-స్తంభ ప్రతిష్ఠ **సింహ** వసుః **ఉ॥10-25.** (6చంద్రః) క్రయవిక్రయాదులు **కన్యా** ర॥ **వ॥12-02.** తదియ **శ్రవణము** (కుజ-కేతువుల వేధ) సాధారణపనులు **కుంభ** ర॥ **రా॥10-48.** (12చంద్రః) **మేష రా॥1-59.**

**జూలై 1.** ఆది తదియ **శ్రవణము** (కుజ,కేతువుల వేధ) సాధారణపనులు **సింహ** మతాం॥ ర॥ **ఉ॥10-20.** (6చంద్రః) **కన్యా** ర॥ **ఉ॥11-57. తులా** మతాం॥ ర॥ **ప॥2-48.** చవితి **ధనిష్ఠ** వివాహ-గృహప్రవేశాదులు **కుంభ** ర॥ **రా॥10-43.** (6శుక్రః,12చంద్రః) గృహప్రవేశాదులు **మేష రా॥1-54. (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**2.** సోమ చవితి **ధనిష్ఠ** అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-స్తంభ ప్రతిష్ఠాదులు **సింహ** ర॥ **ఉ॥10-17.** (6చంద్రః) **కన్యా** మతాం॥ ర॥ **ఉ॥11-54.** (6చంద్రః) క్రయవిక్రయాదులు **తులా** ర॥ **ప॥2-45.** పంచమి **ధనిష్ఠ** గృహప్రవేశాదులు **కుంభ** ర॥ **రా॥10-40.** (1చంద్రః) **శతభిషము మేష** ర॥ **రా॥1-51. (కలశ చక్రశుద్ధి లేదు)**

**3.** మంగళ షష్ఠి **శతభిషము** గృహప్రవేశాదులు **మేష** ర॥ **రా॥1-48. (కలశ చక్రశుద్ధి లేదు)**

**4.** బుధ షష్ఠి **పూర్వాభాద్ర** సాధారణపనులు **సింహ** రాజః **ఉ॥10-10.**

**5.** గురు సప్తమి **ఉత్తరాభాద్ర** అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-స్తంభ ప్రతిష్ఠాదులు **కన్యా** మతాం॥ ర॥ **ఉ॥11-43.** (7చంద్రః) క్రయవిక్రయాదులు **తులా** ర॥ **ప॥2-34.** గృహప్రవేశాదులు **కుంభ** రాజః **రా॥10-29.** అష్టమి **ఉత్తరాభాద్ర మేష రా॥1-40.** (12చంద్రః) **(కలశ చక్రశుద్ధి లేదు)**

**6.** శుక్ర అష్టమి **రేవతి** క్రయవిక్రయాదులు **తులా** ర॥ **ప॥2-29.** (6చంద్రః) గృహప్రవేశాదులు **కుంభ** ర॥ **రా॥10-24.** (7శుక్రః) నవమి **రేవతి మేష** ర॥ **రా॥1-35.** (12చంద్రః) **(కలశ చక్రశుద్ధి లేదు)**

**7.** శని నవమి **అశ్విని** అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-స్తంభ ప్రతిష్ఠ-వివాహాదులు **సింహ** రాజః **ఉ॥9-58.** క్రయవిక్రయాదులు **తులా** చోరః **ప॥2-26.**

**8.** ఆది దశమి **భరణి** సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥9-54.**





## 5. ఆషాఢ మాసము (14-07-2018 నుండి 11-08-2018 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | | రవి |
| | **ఆషాఢ మాస ప్రారంభ గ్రహస్థితులు** | | చంద్ర,బుధ రాహు |
| కుజ(వ) కేతు | | | శుక్ర |
| శని (వ) | | గురు | |

**16-07-2018 కర్కాటక రవి**

**26-07-2018 బుధ వక్రం మొదలు**

**01-08-2018 కన్యా శుక్ర**

**జూలై 14.** శని ఆషాఢ శు॥విదియ **పుష్యమి** (రాహుక్రాంతము) సాధారణ పనులు **సింహ** రాజః ఉ॥9-31. (12చంద్రః) **కన్యా** ర॥ **ఉ॥11-08.**

**15.** ఆది తదియ **ఆశ్లేష** సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥9-27.** (12చంద్రః)

**16.** సోమ చవితి **మఖ** (కుజ,కేతువుల వేధ) సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥9-24.** (1చంద్రః) **కన్యా** మతాం॥ ర॥ **ఉ॥11-01.** (12చంద్రః)

**17.** మంగళ పంచమి **ఉత్తర** సాధారణపనులు **కన్యా** వసుః **ఉ॥10-57.** (12చంద్రః) క్రయవిక్రయాదులు **తులా** ర॥ **ప॥1-48.**

**18.** బుధ షష్ఠి **హస్త** క్రయవిక్రయాదులు **తులా** ర॥ **ప॥1-43.** (12చంద్రః) **వృశ్చిక** రాజః **ప॥2-40.**

**19.** గురు సప్తమి **చిత్త** అన్నప్రాశనాదులు **సింహ** రాజః **ఉ॥9-11. కన్యా** ర॥ **ఉ॥10-58.** (1చంద్రః) క్రయవిక్రయాదులు **తులా** చోరః **ప॥1-39.** (12చంద్రః)

**20.** శుక్ర అష్టమి **స్వాతి** సాధారణపనులు **కన్యా** వసుః **ఉ॥10-44.**

**21.** శని నవమి **స్వాతి** అన్నప్రాశనాదులు **సింహ** ర॥ **ఉ॥9-02. విశాఖ** క్రయవిక్రయాదులు **తులా** ర॥ **ప॥1-30.** (1చంద్రః)

**22.** ఆది దశమి **విశాఖ** సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥8-58. కన్యా** చోరః **ఉ॥10-35. అనురాధ** క్రయవిక్రయాదులు **తులా** మతాం॥ ర॥ **ప॥1-26.**

**23.** సోమ ఏకాదశి **అనురాధ** అన్నప్రాశనాదులు **సింహ** వసుః **ఉ॥8-55. కన్యా** ర॥ **ఉ॥10-32.**

**25.** బుధ త్రయోదశి **మూల** (శనిక్రాంతము) సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥8-47. కన్యా** మతాం॥ ర॥ **ఉ॥10-24.**

**26.** గురు చతుర్దశి **పూర్వాషాఢ** అన్నప్రాశనాదులు **సింహ** మతాం॥ ర॥ **ఉ॥8-43.**

**27.** శుక్ర పూర్ణిమ **ఉత్తరాషాఢ** (కుజక్రాంతము) సాధారణపనులు **కన్యా** ర॥ **ఉ॥10-16.**

**28.** శని బ॥పాడ్యమి **శ్రవణము** (కేతుక్రాంతము) సాధారణపనులు **సింహ** వసుః **ఉ॥8-36.** (6చంద్రః) **కన్యా** ర॥ **ఉ॥10-13.**

**29.** ఆది విదియ **ధనిష్ఠ** క్రయవిక్రయాదులు **తులా** చోరః **ప॥1-00. వృశ్చిక** ర॥ **ప॥1-57.**

**30.** సోమ తదియ **శతభిషము** అన్నప్రాశనాదులు **సింహ** ర॥ **ఉ॥8-28. కన్యా** వసుః **ఉ॥10-05.**

**ఆగస్ట్ 1.** బుధ చవితి **పూర్వాభాద్ర** సాధారణపనులు **కన్యా** ర॥ **ఉ॥9-57.** పంచమి **ఉత్తరాభాద్ర** క్రయవిక్రయాదులు **తులా** చోరః **ప॥12-48.** (6చంద్రః) **వృశ్చిక** ర॥ **ప॥1-45.**

**2.** గురు పంచమి **ఉత్తరాభాద్ర** సాధారణపనులు **కన్యా** చోరః **ఉ॥9-51.** షష్ఠి **ఉత్తరాభాద్ర** క్రయవిక్రయాదులు **తులా** మతాం॥ ర॥ **ప॥12-44.** (6చంద్రః) **రేవతి** సాధారణపనులు **కుంభ** మతాం॥ ర॥ **రా॥8-39.**

**3.** శుక్ర షష్ఠి **రేవతి** అన్నప్రాశనాదులు **కన్యా** ర॥ **ఉ॥9-50.** సప్తమి **రేవతి** క్రయవిక్రయాదులు **వృశ్చిక** ర॥ **ప॥1-38. అశ్విని** సాధారణపనులు **కుంభ** ర॥ **రా॥8-36.**

**5.** ఆది అష్టమి **భరణి** సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥8-05.**

**7.** మంగళ ఏకాదశి **రోహిణి** సాధారణపనులు **సింహ** ర॥ **ఉ॥7-58. కన్యా** మతాం॥ ర॥ **ఉ॥9-35.**







## 6. శ్రావణ మాసము (12-08-2018 నుండి 9-09-2018 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | | |
| | **శ్రావణ మాస ప్రారంభ గ్రహస్థితులు** | | రవి,బుధ(వ) రాహు |
| కుజ(వ) కేతు | | | చంద్ర |
| శని (వ) | | గురు | శుక్ర |

**17-08-2018 సింహ రవి**
**19-08-2018 బుధ వక్రం ఆఖరు**
**27-08-2018 కుజ వక్రము ఆఖరు**
**01-09-2018 తులా శుక్ర**
**02-09-2018 సింహ బుధ**
**06-09-2018 శని వక్రము ఆఖరు**

**ఆగస్ట్ 12.** ఆది శ్రావణ శుక్ల విదియ **మఖ** (కేతువేధ) క్రయవిక్రయాదులు **వృశ్చిక** ర॥ **ప॥1-02.** గృహప్రవేశాదులు **కుంభ** మతాం॥ ర॥ **రా॥8-00.** (7చంద్రః) **పుబ్బ** సాధారణపనులు **మేష** చోరః **రా॥11-11. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**13.** సోమ తదియ **పుబ్బ** సాధారణపనులు **కన్యా** రాజః **ఉ॥9-11.** (12చంద్రః) క్రయవిక్రయాదులు **తులా** ర॥ **ప॥12-02. ఉత్తర** గృహప్రవేశాదులు **మేష** ర॥ **రా॥11-08. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**14.** మంగళ చవితి **ఉత్తర** సాధారణపనులు **సింహ** చోరః **ఉ॥7-29.** క్రయవిక్రయాదులు **తులా** వసుః **ఉ॥11-57. వృశ్చిక** ర॥ **ప॥12-54. హస్త** గృహప్రవేశాదులు **మేష** ర॥ **రా॥11-03.** (6చంద్రః) **(వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**15.** బుధ పంచమి **హస్త** అన్నప్రాశన-వివాహ-గృహప్రవేశాదులు **సింహ** ర॥ **ఉ॥7-24. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)** క్రయవిక్రయాదులు **వృశ్చిక ర॥ ప॥12-49. చిత్త** గృహప్రవేశాదులు **మేష** మతాం॥ ర॥ **రా॥10-58.** (6చంద్రః) **(వృషభ చక్రశుద్ధి లేదు)**

**16.** గురు షష్ఠి **చిత్త** అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **సింహ** ర॥ **ఉ॥7-21. కన్యా** రాజః **ఉ॥8-58.** క్రయవిక్రయాదులు **వృశ్చిక** చోరః **ప॥12-46.** (12చంద్రః) **(వృషభ చక్రశుద్ధి లేదు)**

**17.** శుక్ర సప్తమి **స్వాతి** సాధారణపనులు **తులా** వసుః **ఉ॥11-45.** (1చంద్రః)

**19.** ఆది నవమి **అనురాధ** అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **కన్యా** మతాం॥ ర॥ **ఉ॥8-47.** గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు **తులా** ర॥ **ఉ॥11-38. (వివాహ చక్రశుద్ధి లేదు)**

**20.** సోమ దశమి **జ్యేష్ఠ** (రాహువేధ) సాధారణపనులు **కన్యా** ర॥ **ఉ॥8-42. మూల** (శనిక్రాంతము) సాధారణపనులు **మేష** ర॥ **రా॥10-39.**

**21.** మంగళ ఏకాదశి **మూల** (శనిక్రాంతము) సాధారణపనులు **తులా** రాజః **ఉ॥11-30. వృశ్చిక** ర॥ **ప॥12-27. మేష** ర॥ **రా॥10-36.**

**22.** బుధ ద్వాదశి **పూర్వాషాఢ** సాధారణపనులు **కన్యా** చోరః **ఉ॥8-34. తులా** ర॥ **ఉ॥11-25.**

**23.** గురు ద్వాదశి **ఉత్తరాషాఢ** (కుజక్రాంతము) సాధారణపనులు

స్వాతి-శతభిషా నక్షత్రములు గృహనిర్మాణమునకు సామాన్య ఫలములే ఇచ్చును.



**కన్యా** వసుః **ఉ॥8-30.** త్రయోదశి **ఉత్తరాషాఢ** (కుజక్రాంతము) **మేష** రాజః **రా॥10-27.**

**24.** శుక్ర త్రయోదశి **శ్రవణము** (రవివేధ,కేతుక్రాంతము) సాధారణ పనులు **తులా** ర॥ **ఉ॥11-17.** చతుర్దశి **శ్రవణము** (రవివేధ,కేతు క్రాంతము) **మేష** ర॥ **రా॥10-23.**

**25.** శని చతుర్దశి **శ్రవణము** (రవివేధ,కేతుక్రాంతము) సాధారణ పనులు **కన్యా** రాజః **ఉ॥8-22. ధనిష్ఠ** అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు **తులా** చోరః **ఉ॥11-13.** క్రయవిక్రయాదులు **వృశ్చిక** ర॥ **ప॥12-10. (కలశ చక్రశుద్ధి లేదు)**

**26.** ఆది పూర్ణిమ **ధనిష్ఠ** అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **కన్యా** ర॥ **ఉ॥8-18. (కలశ చక్రశుద్ధి లేదు)**

**27.** సోమ బ॥పాడ్యమి **శతభిషము** అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశాదులు **కన్యా** మతాం॥ ర॥ **ఉ॥8-15.** (6చంద్రః) **తులా** ర॥ **ఉ॥11-06.** క్రయవిక్రయాదులు **వృశ్చిక** మతాం॥ ర॥ **ప॥12-03. (కలశ చక్రశుద్ధి లేదు)**

**28.** మంగళ విదియ **పూర్వాభాద్ర** సాధారణపనులు **కన్యా** ర॥ **ఉ॥8-11.** (6చంద్రః)

**29.** బుధ తదియ **ఉత్తరాభాద్ర** అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశాదులు **కన్యా** ర॥ **ఉ॥8-07.** (7చంద్రః) **తులా** మతాం॥ ర॥ **ఉ॥10-58.** (6చంద్రః) చవితి **రేవతి** గృహప్రవేశాదులు **మేష** ర॥ **రా॥10-04.** (12చంద్రః) **(కలశ చక్రశుద్ధి లేదు)**

**30.** గురు చవితి **రేవతి** అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశాదులు **తులా** ర॥ **ఉ॥10-55.** (6చంద్రః) అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **వృశ్చిక** వసుః **ఉ॥11-52.** పంచమి **అశ్విని** సాధారణ పనులు **మేష** ర॥ **రా॥10-01.** (1చంద్రః) **(వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**సెప్టెంబర్1.** శని షష్ఠి **భరణి** సాధారణపనులు **తులా** మతాం॥ ర॥ **ఉ॥10-46. వృశ్చిక** ర॥ **ఉ॥11-43.**

**2.** ఆది సప్తమి **కృత్తిక** సాధారణపనులు **కన్యా** మతాం॥ ర॥ **ఉ॥7-51.** అష్టమి **రోహిణి** గృహప్రవేశాదులు **మేష** రాజః **రా॥9-48. (కలశ చక్రశుద్ధి లేదు)**

**3.** సోమ అష్టమి **రోహిణి** అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశాదులు **వృశ్చిక** రాజః **ఉ॥11-35.** (7చంద్రః) నవమి **మృగశిర (కుజ, కేతువుల వేధ)** సాధారణపనులు **మేష** మతాం॥ ర॥ **రా॥9-44. (కలశ చక్రశుద్ధి లేదు)**

**4.** మంగళ నవమి **మృగశిర (కుజ,కేతువుల వేధ)** సాధారణపనులు కన్యా ర॥ **ఉ॥7-43. తులా** చోరః **ఉ॥10-34.**

**5.** బుధ దశమి **ఆరుద్ర** సాధారణపనులు **కన్యా** వసుః **ఉ॥7-40. తులా** ర॥ **ఉ॥10-31.** ఏకాదశి **పునర్వసు** (శనివేధ) సాధారణ పనులు **మేష** ర॥ **రా॥9-37.**



ముహూర్తమునకు తారాబల-చంద్రబలములు తప్పనిసరిగా చూడవలెను.



## 7. భాద్రపద మాసము (10-09-2018 నుండి 9-10-2018 వరకు)

| | | | | |
|---|---|---|---|---|
| | | | | **17-09-2018 కన్యా రవి** |
| | భాద్రపద మాస ప్రారంభ గ్రహస్థితులు | | రాహు | **18-09-2018 కన్యా బుధ** |
| కుజ కేతు | | | రవి,చంద్ర బుధ | **05-10-2018 శుక్ర వక్రము మొదలు** |
| శని | | గురు శుక్ర | | **06-10-2018 తులా బుధ** |

**సెప్టెంబర్11.** మంగళ భాద్రపద శు॥విదియ **హస్త** సాధారణపనులు **కన్యా** మతాం॥ ర॥ **ఉ॥7-15.** (1చంద్రః) తులా ర॥ **ఉ॥10-06. వృశ్చిక మతాం॥** ర॥ **ఉ॥11-03.**

**12.** బుధ తదియ **చిత్త** అన్నప్రాశనాదులు **కన్యా** ర॥ **ఉ॥7-12.** (1చంద్రః) చవితి **చిత్త** సాధారణపనులు **మేష** ర॥ **రా॥9-09.**

**13.** గురు చవితి **స్వాతి** అన్నప్రాశనాదులు **వృశ్చిక** ర॥ **ఉ॥10-55.** (12చంద్రః) పంచమి **స్వాతి** సాధారణపనులు **మేష** మతాం॥ ర॥ **రా॥9-04.**

**14.** శుక్ర పంచమి **విశాఖ** సాధారణపనులు **తులా** ర॥ **ఉ॥9-55.** (1చంద్రః) **వృశ్చిక** మతాం॥ ర॥ **ఉ॥10-52.**

**16.** ఆది సప్తమి **జ్యేష్ఠ** (రాహువేధ) సాధారణపనులు **కన్యా** ర॥ **ఉ॥6-56.**

**17.** సోమ అష్టమి **మూల** (శనిక్రాంతము) సాధారణపనులు **తులా** ర॥ **ఉ॥9-43.**

**18.** మంగళ నవమి **పూర్వాషాఢ** సాధారణపనులు **తులా** ర॥ **ఉ॥9-39. వృశ్చిక** మతాం॥ ర॥ **ఉ॥10-36.** దశమి **పూర్వాషాఢ మేష** ర॥ **రా॥8-45.**

**19.** బుధ దశమి **పూర్వాషాఢ** అన్నప్రాశనాదులు **తులా** ర॥ **ఉ॥9-35. వృశ్చిక** చోరః **ఉ॥10-32.**

**20.** గురు ఏకాదశి **ఉత్తరాషాఢ** (కుజ,కేతువుల క్రాంతము) సాధారణపనులు **తులా** వసుః **ఉ॥9-31. శ్రవణము మేష** ర॥ **రా॥8-37.** ద్వాదశి **శ్రవణము సింహ తె॥5-03.** (6చంద్రః)

**21.** శుక్ర ద్వాదశి **శ్రవణము** అన్నప్రాశనాదులు **వృశ్చిక** ర॥ **ఉ॥10-23. ధనిష్ఠ** సాధారణపనులు **మేష** మతాం॥ ర॥ **రా॥8-32.**

త్రయోదశి **ధనిష్ఠ సింహ తె॥4-58.** (6చంద్రః)

**22.** శని త్రయోదశి **ధనిష్ఠ** అన్నప్రాశనాదులు **తులా** ర॥ **ఉ॥9-23. వృశ్చిక** చోరః **ఉ॥10-20. శతభిషము మేష** ర॥ **రా॥8-29.**

**23.** ఆది చతుర్దశి **శతభిషము** సాధారణపనులు **మేష** మతాం॥ ర॥ **రా॥8-25.**

**24.** సోమ పూర్ణిమ **పూర్వాభాద్ర** సాధారణపనులు **తులా** మతాం॥ ర॥ **ఉ॥9-15. వృశ్చిక** ర॥ **ఉ॥10-12. మేష** ర॥ **రా॥8-21.**

**26.** బుధ బ॥విదియ **రేవతి** (రవివేధ) అన్నప్రాశనాదులు **తులా** రాజః **ఉ॥9-08.** (6చంద్రః) **వృశ్చిక** ర॥ **ఉ॥10-05.** సాధారణ పనులు **మేష** ర॥ **రా॥8-14. అశ్విని సింహ తె॥4-40.**

**27.** గురు తదియ **అశ్విని** అన్నప్రాశనాదులు **తులా** ర॥ **ఉ॥9-03.**

**29.** శని పంచమి **కృత్తిక** (కుజవేధ) సాధారణపనులు **వృశ్చిక** ర॥ **ఉ॥9-52. రోహిణి సింహ** ర॥ **తె॥4-27.**

**30.** ఆది షష్ఠి **రోహిణి** సాధారణపనులు **తులా** ర॥ **ఉ॥8-50.** (8చంద్రః) **మేష** ర॥ **రా॥7-56. మృగశిర సింహ తె॥4-22.**

**అక్టోబర్1.** సోమ సప్తమి **మృగశిర** (కేతువేధ) అన్నప్రాశనాదులు **వృశ్చిక** మతాం॥ ర॥ **ఉ॥9-44. మేష** మతాం॥ ర॥ **రా॥7-53.**

**3.** బుధ నవమి **పునర్వసు** (శనివేధ) అన్నప్రాశనాదులు **తులా** ర॥ **ఉ॥8-39. మేష** ర॥ **రా॥7-45.**

**4.** గురు దశమి **పుష్యమి** (రాహుక్రాంతము) సాధారణపనులు **తులా** ర॥ **ఉ॥8-35. వృశ్చిక** రాజః **ఉ॥9-32.**









## 8. ఆశ్వయుజ మాసము (10-10-2018 నుండి 7-11-2018 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | | |
| | ఆశ్వయుజ మాస ప్రారంభ గ్రహస్థితులు | | రాహు |
| కుజ కేతు | | | |
| శని | | చంద్ర,బుధ గురు,శుక్ర(వ) | రవి |

**12-10-2018 వృశ్చిక గురు**
**17-10-2018 తులా రవి**
**21-10-2018 శుక్ర మూఢమి మొదలు**
**26-10-2018 వృశ్చిక బుధ**
**31-10-2018 శుక్ర మూఢమి ఆఖరు**
**06-11-2018 కుంభ కుజ**
**గమనిక : ది. 21-10-2018 నుండి 31-10-2018 వరకు శుక్రమూఢమి ఉండుటచే ఆ కాలము నందు శుభ మూహూర్తములు వ్రాయలేదు.**

**అక్టోబర్10.** బుధ ఆశ్వయుజ శు॥విదియ **చిత్త** (రవిక్రాంతము) సాధారణ పనులు **తులా** ర॥ **ఉ॥8-11.** (1చంద్రః) **స్వాతి** గృహప్రవేశాదులు **మేష** రాజః **రా॥7-17.** (7చంద్రః) వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **సింహ** వసుః **తె॥3-43. (వివాహ,వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**11.** గురు తదియ **స్వాతి** సాధారణపనులు **తులా** ర॥ **ఉ॥8-08.** (1చంద్రః) అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **వృశ్చిక** రాజః **ఉ॥9-05.** (12చంద్రః) **విశాఖ** గర్భాదానాదులు **మేష** ర॥ **రా॥7-14.** (7చంద్రః) సాధారణపనులు **సింహ తె॥3-40. (వివాహ,వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**12.** శుక్ర చవితి **విశాఖ** సాధారణపనులు **తులా** చోరః **ఉ॥8-04. అనురాధ** వివాహ-గృహారంభ-ప్రవేశాదులు **సింహ** ర॥ **తె॥3-36. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**13.** శని పంచమి **అనురాధ** అన్నప్రాశనము-గృహారంభ-ప్రవేశాదులు **తులా** ర॥ **ఉ॥7-59. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)**

**14.** ఆది షష్ఠి **జ్యేష్ఠ** (రాహువేధ) సాధారణపనులు **తులా** ర॥ **ఉ॥7-55. వృశ్చిక** చోరః **ఉ॥8-52.** (1చంద్రః)

**15.** సోమ షష్ఠి **మూల** (శనిక్రాంతము) సాధారణపనులు **తులా** ర॥ **ఉ॥7-52.** సప్తమి **మూల** (శనిక్రాంతము) **వృశ్చిక** ర॥ **ఉ॥8-49. పూర్వాషాఢ మేష** ర॥ **రా॥6-53.**

**17.** బుధ అష్టమి **ఉత్తరాషాఢ** (కేతుక్రాంతము) సాధారణపనులు **వృశ్చిక** ర॥ **ఉ॥8-42.**

**18.** గురు నవమి **శ్రవణము** (కుజక్రాంతము) సాధారణపనులు **వృశ్చిక** మతాం॥ ర॥ **ఉ॥8-36.** దశమి **శ్రవణము** (కుజ క్రాంతము) **కుంభ ప॥3-34.** (12చంద్రః) **ధనిష్ఠ** వివాహ,గృహారంభ-ప్రవేశాదులు **సింహ** ర॥ **తె॥3-11.** (6చంద్రః) **కన్యా తె॥4-48. (వివాహ చక్రశుద్ధి లేదు)**

**19.** శుక్ర దశమి **ధనిష్ఠ** క్రయవిక్రయాదులు **కుంభ** ర॥ **వ॥3-31.** (1చంద్రః) ఏకాదశి **ధనిష్ఠ** గృహారంభ-ప్రవేశాదులు **సింహ** ర॥ **తె॥3-08.** (7చంద్రః) **శతభిషము** వివాహ-గృహారంభ-ప్రవేశాదులు

సింహరాశి వారికి ఈ సం॥ము తేజస్సు-25, ఆనందము-69, ధైర్యము-58,





# 5. సింహ రాశి ♌

మఖ-4పాదములు, పుబ్బ-4పాదములు, ఉత్తర-1వపాదమందు పుట్టినవారు మరియు "మా,మీ,మూ,మే,మో,టా,టీ,టూ,టే"అను అక్షరములు తమపేరునకు ముందుగలవారు "సింహరాశి"కి చెందినవారు.

**రాబడి - 11** **పోబడి - 11** **కీర్తి - 3** **అపకీర్తి - 6**

ఈ రాశివారికి సంవత్సరాది నుండి... **గురుడు** ది. 12-10-2018 వరకు **3**వ ఇంట **తామ్రమూర్తి** గాను, పిమ్మట ది. 2-04-2019 వరకు **4**వ ఇంట **లోహమూర్తి** గాను, తదాది సంవత్సరాంతము వరకు **5**వ ఇంట **తామ్రమూర్తి** గాను, **శని** ఈ సంవత్సరమంతయూ **5**వ ఇంట **సువర్ణమూర్తి** గాను, ది. 5-03-2019 వరకు **రాహువు 12**వ ఇంట **కేతువు 6**వ ఇంట **తామ్రమూర్తులు** గాను, తదాది సంవత్సరాంతము వరకు **రాహువు 11**వ ఇంట **కేతువు 5**వ ఇంట **తామ్రమూర్తులు** గాను సంచరించెదరు.

ఈ సంవత్సరము వీరికి ఆదాయ-వ్యయములు **సమముగా** ఉండును. సమాజములో **33**మంది అనుకూలముగాను, **67**మంది ప్రతికూలముగాను ఉందురు. అన్నింటా ప్రతికూల ఫలితములు ఉంటాయి. భారీ పెట్టుబడులతో ఎటువంటి ప్రయత్నములు చేయరాదు. మధ్యవర్తిత్వములు పనికిరావు. భూమి-గృహ సంబంధిత పనులు ముందుకు సాగవు. క్రయవిక్రయ వ్యవహారములు సంతృప్తికరముగా ఉండవు. రాజకీయముగా-సామాజికముగా అవరోధములు ఎదుర్కొనవలసి ఉంటుంది. పాడి-పంట-చెఱువులు పరిశ్రమలు ఫలించవు. జీవిత భాగస్వామితోను, వ్యాపార భాగస్వాములతోను జాగ్రత్తగా ఉండవలెను. వాహన సారథ్యములోను, ప్రమాదకర ప్రదేశములలోను జాగ్రత్తగా ఉండవలెను. అవివాహితులకు-నిస్సంతులకు-నిరుద్యోగులకు సామాన్య ఫలితములు కలుగును. నవగ్రహముల శాంతి, ఇలవేల్పుల పూజలు అవసరము. ఉదర-హృదయ-మధుమేహ సమస్యలు ఉంటాయి.

ఈ రాశి **స్త్రీలకు** ప్రతికూల కాలము. ఇంటా-బయటా సమస్యలు ఉత్పన్నమగును. ఆర్థికపరమైన వ్యవహారములలో తల దూర్చరాదు.

**విద్యార్థులకు** సామాన్య ఫలితములు. రాజకీయములకు దూరముగా ఉండవలెను. పోటీ పరీక్షలందు అపజయములు కలుగును. కష్టపడాలి.

**ఉద్యోగులకు** నిరాశా కాలము. ప్రమోషన్లు,ఇంక్రిమెంట్లు ముందుకు సాగవు. అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించవలెను. స్థాన చలనములు.

**వ్యాపారులకు** ప్రతికూల కాలము. ధాన్యం వ్యాపారులకు, ధాన్యం వ్యాపారులకు, కమీషన్‌దారులకు, బిల్డర్స్‌కు, ట్రాన్స్‌పోర్టువారికి, ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్స్‌కు, జంతు విక్రయదారులకు, అపరాల వర్తకులకు, వడ్డీ వ్యాపారులకు, మెడికల్ షాపుల వారికి, అద్దాల వ్యాపారులకు, కలప వ్యాపారులకు మేలు.

**మఖా నక్షత్రజులకు** ప్రశాంత జీవనము, విదేశీ ప్రయాణములు, స్త్రీ



ప్రగతి-29, ప్రతిభ-4, విజయము-6, సామర్థ్యము-29, శ్రమ-83,



సౌఖ్యము. **పుబ్బా నక్షత్రజులకు** వాహన ప్రమాదము, వివాదములు. నిరాభివృద్ధి. **ఉత్తరా నక్షత్రజులకు** అనారోగ్యము, సంచారము, శరీర తాపము.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 1.** ఈసంవత్సరము **మఖకు-2, పుబ్బకు-9, ఉత్తరకు-1** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **గ్రామదేవతను** ఆరాధించుట వలన గ్రహములు ఇచ్చు అరిష్టముల నుండి బయటపడుదురు.

**2018 మార్చి :** ఈ నెల రవి-చంద్ర-కుజ-గురు-శని-రాహువులు అశుభులుగాను, బుధ-శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. నూతన వ్యాపార ప్రయత్నములు చేయుదురు. బంధు-మిత్రుల సహకారములు. విద్యార్థులకు-వ్యాపారులకు-స్త్రీలకు-కళాకారులకు యోగించును. శుభవార్తలు.
**అనుకూలతేదీలు : 7,9,14,16,21,23,26,28,30.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-కుజ-గురు-శని-రాహువులు అశుభులుగాను, చంద్ర-బుధ-కేతువులు శుభులుగాను, శుక్రుడు తటస్థుడుగాను ఉందురు. పనుల జాప్యము. ఇతరుల వలన నిరుత్సాహము. ధన వ్యయములు. నిరాశా-నిస్పృహలు. పాడి-పంట-చెఱువులు నష్టములు. ప్రమాదములు,అనారోగ్యం.
**అనుకూలతేదీలు : 2,4,6,9,11,13,18,25,30.**

**మే :** ఈ నెల రవి-చంద్ర-శుక్రులు తటస్థులుగాను, కుజ-బుధ-కేతువులు శుభులుగాను, గురు-శని-రాహువులు అశుభులుగాను ఉందురు. శుభాశుభ మిశ్రమ ఫలితములు. సోదర-సోదరీల సహకారములు. విద్యార్థులకు-వ్యాపారులకు యోగించును. పాడి-పంట-చెఱువులు ఫలవంతమగును.
**అనుకూలతేదీలు : 2,7,8,9,15,18,20,22,25,27,28,29,30.**

**జూన్ :** ఈ నెల రవి-కుజ-బుధ-కేతువులు శుభులుగాను, చంద్రుడు తటస్థుడుగాను, గురు-శుక్ర-శని-రాహువులు అశుభులుగాను ఉందురు. స్త్రీలతో కలహములు. వ్యసనానందములు. భూమి-పాడి-పంట-చెఱువులు యోగించును. విద్యార్థులకు-వ్యాపారులకు-రాజకీయ నాయకులకు మేలు.
**అనుకూలతేదీలు : 1,3,4,5,6,8,10,12,13,17,18,19,20,24,26.**

**జూలై :** ఈ నెల రవి-చంద్ర-కుజ-శుక్ర-కేతువులు శుభులుగాను, బుధ-గురు-శని-రాహువులు అశుభులుగాను ఉందురు. పనులు ముందుకు సాగును. రాజకీయముగా-సామాజికముగా మేలు జరుగును. పాడి-పంట-చెఱువులు యోగించును. దూర ప్రయాణములు. ఉత్సాహ-ఉత్తేజములు.
**అనుకూలతేదీలు : 1,2,3,6,8,10,13,15,16,17,20,24,27,30,31.**

**ఆగస్ట్ :** ఈ నెల రవి-బుధ-గురు-శని-రాహువులు అశుభులుగాను, చంద్ర-కుజ-శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. నంది లేదా బసవ అనే పేరుగల వ్యక్తుల వలన సహకారములు కలుగును. పాడి-పంట-చెఱువులు యోగించును. నిరుద్యోగులకు-అవివాహితులకు ఒకింత మేలు జరుగును.
**అనుకూలతేదీలు : 3,6,7,10,13,14,17,21,24,27,28,31**

**సెప్టెంబర్ :** ఈ నెల రవి-గురు-శని-రాహువులు అశుభులుగాను, చంద్ర-కుజ-శుక్ర-కేతువులు శుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు.

అదృష్టము-23, ఉన్నతి-25, లాభము-100, నిరాశ-25 శాతముగా ఉండును



భార్యాబిడ్డల వలన ఇబ్బందులు వచ్చును. భవిష్యత్తు గురించి ఆందోళనలు. మిత్రశత్రుత్వములు ఏర్పడును. పాడి-పంట-చెఱువులు ఫలించును.

**అనుకూలతేదీలు : 3,4,7,10,11,14,18,19,21,24,25,26,28.**

**అక్టోబర్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-బుధ-గురు-శని-రాహువులు అశుభులుగాను, కుజ-శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. పరస్త్రీ సౌఖ్యములు. అధికారుల వలన మేలు. అధిక వ్యయ-ప్రయాసలు. సోదర-సోదరీల సహకారములు. దూర ప్రయాణములు. వాహన లాభములు

**అనుకూలతేదీలు : 1,2,3,5,9,12,16,19,21,23,26,28,29,30,31.**

**నవంబర్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-గురు-శని-రాహువులు అశుభులుగాను, బుధ-శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. శుభాశుభ మిశ్రమ ఫలితములు. వాహన సారధ్యములో మెలకువ అవసరం. పాడి-పంట-చెఱువులు ఫలించవు. సంతానము ఎడల ఆందోళనలు.

**అనుకూలతేదీలు : 2,4,6,7,9,11,14,16,21,23,26,28,30.**

**డిసెంబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-గురు-శని-రాహువులు అశుభులుగాను, బుధ-శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. స్త్రీలకు-విద్యార్థులకు రచయితలకు యోగించును. పనులు మందముగా సాగును. జీవిత భాగస్వామితో పేచీలు వచ్చును. వృత్తి-ఉద్యోగ-వ్యాపార నిర్వహణలు బాగుండవు.

**అనుకూలతేదీలు : 5,7,12,14,19,21,24,26,28,31.**

**2019 జనవరి :** ఈ నెల రవి-చంద్రులు తటస్థులుగాను, కుజ-బుధ-గురు శని-రాహువులు అశుభులుగాను, శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. సోదర వైరము. ఆస్తి సంబంధిత వివాదములు. పాడి-పంట-చెఱువులు నష్టపడును. వాహన-జల ప్రమాదములు. కోర్టు-పోలీస్ వ్యవహారములు.

**అనుకూలతేదీలు : 4,7,11,18,20,23,25,27,28,30.**

**ఫిబ్రవరి :** ఈ నెల రవి-చంద్ర-బుధులు తటస్థులుగాను, కుజ-గురు-శని-రాహువులు అశుభులుగాను, శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. ధైర్యముతో ముందుకు సాగుదురు. అధికారుల అనుగ్రహము లభించును. ఇష్టవ్యక్తుల సమాగము జరుగును. కళలు-సినిమాల పట్ల మోజు పెరుగును.

**అనుకూలతేదీలు : 1,3,4,6,8,10,15,22,25,27.**

**మార్చ్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-గురు-శుక్ర-శని-కేతువులు అశుభులుగాను, బుధుడు తటస్థుడుగాను, రాహువు శుభుడుగాను ఉందురు. ఎటువంటి శుభప్రయత్నములు కలసిరావు. ఇతరుల వ్యవహారములలో తల దూర్చరాదు. రాజకీయముగా-సామాజికముగా వివాదములు చెలరేగును.

**అనుకూలతేదీలు : 4,6,13**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-శని-కేతువులు అశుభులుగాను, బుధుడు తటస్థుడుగాను, గురు-రాహువులు శుభులుగాను ఉందురు. వ్యయ-ప్రయాసలచే పనులు ముందుకు సాగును. దైవ సందర్శనములు. సంతాన మూలక లాభములు. అవివాహితులకు-నిస్సంతులకు అనుకూల కాలము.

**అనుకూలతేదీలు : 1,4,11,17,18,19,24,26,29.**



కన్యారాశి వారికి ఈ సం॥ము తేజస్సు-23, ఆనందము-44, ధైర్యము-58,



# 6. కన్యా రాశి ♍

*ఉత్తర-2,3,4పాదములు,హస్త-4పాదములు,చిత్త-1,2,పాదము లందు పుట్టినవారు మరియు "టో,పా,పి,పూ,ష,ణ,ఠా, పే,పో" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "కన్యారాశి"కి చెందినవారు.*

**రాబడి - 14** | **పోబడి - 2** | **కీర్తి - 6** | **అపకీర్తి - 6**

ఈ రాశివారికి సంవత్సరాది నుండి... **గురుడు** ది. 12-10-2018 వరకు **2**వ ఇంట **రజితమూర్తి** గాను, పిమ్మట ది. 2-04-2019 వరకు **3**వ ఇంట **తామ్రమూర్తి** గాను, తదాది సంవత్సరాంతము వరకు **4**వ ఇంట **సువర్ణమూర్తి** గాను, **శని** ఈ సంవత్సరమంతయూ **4**వ ఇంట **రజితమూర్తి** గాను, ది. 5-03-2019 వరకు **రాహువు 11**వ ఇంట **కేతువు 5**వ ఇంట **రజితమూర్తులు** గాను, తదాది సంవత్సరాంతము వరకు **రాహువు 10**వ ఇంట **కేతువు 4**వ ఇంట **సువర్ణమూర్తులు** గాను సంచరించెదరు.

ఈ సంవత్సరము వీరికి నూటికి **88**రూపాయలు ఆదాయముగాను, **12**రూపాయలు ఖర్చుగాను ఉండును. సమాజములో శత్రువులు-మిత్రులు **సరి సమానముగా** ఉందురు. భూమి-గృహ సంబంధిత శుభ ప్రయత్నములు ఫలించును. పాడి-పంట-చెఱువులు యోగించును. అవివాహితులకు-నిస్సంతులకు-నిరుద్యోగులకు మేలు కలుగును. నూతన వ్యాపార ప్రయత్నములు ఫలించును. కుటుంబము వృద్ధి యగును. ఆర్థికాభివృద్ధి ఉంటుంది. చర-స్థిరాస్తులను పెంపు చేయుదురు. సంవత్సర ఉత్తరార్ధము నుండి పాడి-పంట-చెఱువులు-పరిశ్రమల యందు అధిక పెట్టుబడులు పెట్టరాదు. ఉదరము-నడుము-మోకాళ్లకు సంబంధించిన అనారోగ్య సమస్యలు ఏర్పడును. రాజకీయముగా యోగించును. కళారంగము వారికి రాణించును. నూతన వస్తు-వాహన-భూషణ ప్రాప్తి కలుగును. దూర ప్రయాణములు ఫలించును. మంత్ర-తంత్ర-జప దీక్షలందు ఆసక్తి చూపించెదరు.

ఈ రాశి **స్త్రీలకు** అనుకూల కాలము. నూతన వస్తు-వస్త్ర-భూషణ సౌఖ్యములు. అభీష్ట విజయములు. కళానైపుణ్యములు. దైవ సందర్శనములు

**విద్యార్థులకు** మంచి మార్కులు వచ్చును. పోటీ పరీక్షలందు విజయము చేకూరును. పై చదువులకు కావలసిన సౌకర్యములు లభ్యమగును.

**ఉద్యోగులకు** సామాన్య కాలము. ఇంక్రిమెంట్లు వచ్చును. అధికారుల అనుగ్రహము ఉండును. అనుకున్న ప్రదేశములకు బదలీలు జరుగును.

**వ్యాపారులకు** విదేశీ వస్తు వ్యాపారులకు, జల వ్యాపారులకు, పొగాకు వ్యాపారులకు, కమ్యూనికేషన్ వ్యాపారులకు, క్యాబ్‌లు నడుపువారికి, స్వీట్ షాపుల వారికి, కెమికల్ వ్యాపారులకు, ప్లాస్టిక్ వ్యాపారులకు, పూల వ్యాపారులకు, కూరగాయలు విక్రయించువారికి, పండ్ల తోటల వారికి అనుకూలము.

**ఉత్తరా నక్షత్రజులకు** వ్యాపారాభివృద్ధి, నూతన మైత్రి, ఉద్యోగ ప్రాప్తి.

ప్రగతి-13, ప్రతిభ-2, విజయము-44, సామర్ధ్యము-42, శ్రమ-46,



**హస్తా నక్షత్రజులకు** భూమి-గృహ యోగములు. శుభకార్యములు. ధనలాభం
**చిత్తా నక్షత్రజులకు** విచారకర సంఘటనలు, మానసిక ఆందోళనలు.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 5.** ఈసంవత్సరము **ఉత్తరకు-5, హస్తకు-3, చిత్తకు-7** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **శ్రీరామచంద్రుడ్ని** ఆరాధించుట వలన సమస్త కష్టనష్టములు నశించి సర్వ కార్యజయములు చేకూరును.

**2018 మార్చి :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-గురు-రాహువులు శుభులుగాను, కుజ-బుధ-శుక్ర-శని-కేతువులు అశుభులుగాను ఉందురు. విద్యార్థులకు-స్త్రీలకు-కళాకారులకు ప్రతికూల ఫలితములు. పాడి-పంట-చెఱువులు సామాన్యముగా ఫలించును. మధ్యవర్తిత్వములు చేయరాదు.
**అనుకూలతేదీలు : 1,4,5,6,8,11,15,19,22,26,29,30.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-శని-కేతువులు అశుభులుగాను, గురు-శుక్ర-రాహువులు శుభులుగాను ఫలిత ప్రదాతలగుదురు. స్త్రీలకు-కళాకారులకు యోగించును. శుభకార్య ప్రయత్నములు ఫలించును. విద్యార్థులకు సామాన్య కాలము. భూమి-పాడి-పంట-చెఱువులు యోగించును.
**అనుకూలతేదీలు : 5,6,12,13,19,20,23,26,27.**

**మే :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-శని-కేతువులు అశుభులుగాను, గురు-రాహువులు శుభులుగాను, శుక్రుడు తటస్థుడుగాను ఉందురు. వివాదములు. అనవసర ధనవ్యయములు. ప్రమాదములు. చెడువార్తలు వచ్చును. అగ్ని ప్రమాదములకు అవకాశముంది. పాడి-పంట-చెఱువులు ఫలించును.
**అనుకూలతేదీలు : 3,4,10,11,16,17,21,23,24,31.**

**జూన్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-శని-కేతువులు అశుభులుగాను, బుధ-గురు-శుక్ర-రాహువులు శుభులుగాను ఉందురు. అవివాహితులకు-నిరుద్యోగులకు-విద్యార్థులకు-స్త్రీలకు-ఉద్యోగులకు-వ్యాపారులకు-కళాకారులకు మంచి జరుగును. దూర ప్రయాణములు ఫలించును.
**అనుకూలతేదీలు : 7,13,14,15,17,20,21,22,24,25,27,28,29.**

**జూలై :** ఈ నెల రవి-బుధ-గురు-రాహువులు శుభులుగాను, చంద్ర-కుజ-శుక్ర-శని-కేతువులు అశుభులుగాను ఫలితములను ఇచ్చెదరు. దూర ప్రయాణములు. మేనమామల సహకారములు. రాజకీయముగా-సామాజికముగా ఉన్నతి. నిరుద్యోగులకు మేలు. భూమి-పాడి-పంట-చెఱువులు ఫలించును.
**అనుకూలతేదీలు : 1,4,5,8,11,12,15,18,19,22,23,25,26,29,30.**

**ఆగస్ట్ :** ఈ నెల రవి-చంద్రులు తటస్థులుగాను, కుజ-శని-కేతువులు అశుభులుగాను, బుధ-గురు-శుక్ర-రాహువులు శుభులుగాను ఉందురు. లక్ష్మీదుర్గ లేదా నారాయణ అను వారి వలన సహకారములు. వ్యాపారులకు-స్త్రీలకు-కళాకారులకు యోగించును. విద్యా-వైజ్ఞానిక విషయ పరిజ్ఞానము.
**అనుకూలతేదీలు : 1,2,3,5,8,9,10,12,15,16,17,20,22,23,24,27,29,30,31.**

**సెప్టెంబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-శని-కేతువులు అశుభులుగాను, గురు-శుక్ర-రాహువులు శుభులుగాను ఫలిత ప్రదాతలగుదురు.



అదృష్టము-8, ఉన్నతి-50, లాభము-6, నిరాశ-38 శాతముగా ఉండును



వాహన ప్రమాదములు. పనుల యందు ఆలస్యము. బంధు విరోధములు. ఉదర రోగములు. సంతానమూలక చిక్కులు. శత్రుబాధలు ఉండును.
**అనుకూలతేదీలు : 6,7,13,14,20,21,24,27,28.**

**అక్టోబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-శని-కేతువులు అశుభులుగాను, బుధ-శుక్ర-రాహువులు శుభులుగాను, గురుడు తటస్థుడుగాను ఉందురు. దూర ప్రయాణములకు ఆటంకములు. పరస్త్రీ వ్యసనములు. పాడి-పంట-చెఱువులు పెద్దగా ఫలించవు. మానసిక-శారీరక అలసటలు ఉండును.
**అనుకూలతేదీలు : 4,5,10,11,12,17,19,22,24,26,29.**

**నవంబర్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-శుక్ర-రాహువులు శుభులుగాను, బుధ-గురు-శని-కేతువులు అశుభులుగాను ఉందురు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు నష్టపడును. సోదర-సోదరీల సహకారములు. ధైర్యముతో సమస్యలను ఎదుర్కొందురు. దూర ప్రయాణములు ఉండును.
**అనుకూలతేదీలు : 2,5,9,13,16,18,19,20,23,25,26,27,30.**

**డిసెంబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-శుక్ర-రాహువులు శుభులుగాను, బుధ-గురు-శని-కేతువులు అశుభులుగాను ఫలితములను ప్రసాదించెదరు. శుభాశుభ మిశ్రమ ఫలితములు. వాహన సారధ్యములో జాగ్రత్త. స్త్రీల సహకారములు. అందుబాటుకు ధనము సర్దుబాటగును. పంట నష్టములు.
**అనుకూలతేదీలు : 2,3,4,7,9,11,14,16,17,18,21,24,28.**

**2019 జనవరి :** ఈ నెల రవి-కుజ-గురు-శని-కేతువులు అశుభులుగాను, చంద్రుడు తటస్థుడుగాను, బుధ-శుక్ర-రాహువులు శుభులుగాను ఉందురు. వ్యాపారులకు-స్త్రీలకు-విద్యార్థులకు యోగించును. దూర ప్రయాణములు. ప్రమాదకర ప్రదేశములకు-వ్యక్తులకు-వస్తువులకు దూరముగా ఉండవలెను.
**అనుకూలతేదీలు : 2,4,9,11,14,16,18,21,25.**

**ఫిబ్రవరి :** ఈ నెల రవి-బుధులు తటస్థులుగాను, చంద్ర-కుజ-గురు-శని-కేతువులు అశుభులుగాను, శుక్ర-రాహువులు శుభులుగాను ఉందురు. మధ్యవర్తిత్వములు చేయరాదు. పరస్త్రీ సౌఖ్యములు కలుగును. విందు-వినోదములు-చతుర్ముఖ పారాయణములలో మునుగుదురు. వస్తులాభము
**అనుకూలతేదీలు : 1,8,13,15,17,18,20,22,24.**

**మార్చ్ :** ఈ నెల రవి-కుజ-గురు-శని-కేతువులు అశుభులుగాను, చంద్ర-బుధ-రాహువులు తటస్థులుగాను, శుక్రుడు శుభుడుగాను ఉందురు. స్త్రీల సహకారములచే పనులు ముందుకు సాగును. ఇతరుల వ్యవహారములలో జోక్యము తగదు. విద్యార్థులు కష్టపడవలెను. పాడి-పంట-చెఱువులు నష్టము
**అనుకూలతేదీలు : 1,3,8,10,15,18,20,25,27.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-కుజ-గురు-శుక్ర-శని-కేతువులు అశుభులు గాను, చంద్రుడు శుభుడుగాను, బుధ-రాహువులు తటస్థులుగాను ఉందురు. భారీ పెట్టుబడులు పెట్టరాదు. ఇతరుల వలన నిరుత్సాహము. విద్యార్థులకు సామాన్య ఫలితములు. నూతన వస్త్ర ప్రాప్తి. వ్యాపార విజయములు.
**అనుకూలతేదీలు : 3,10,15,22,29.**

తులారాశి వారికి ఈ సం॥ము తేజస్సు-15, ఆనందము-44, ధైర్యము-17,





# 7. తులా రాశి ♎

*చిత్త-3,4పాదములు,స్వాతి-4పాదములు,విశాఖ-1,2,3,పాదములందు పుట్టినవారు మరియు"రా,రీ,రూ,రే,రో,తా,తీ,తూ,తే"అను అక్షరము లుతమ పేరునకు ముందుగలవారు"తులారాశి"కి చెందినవారు.*

**రాబడి - 11** | **పోబడి - 5** | **కీర్తి - 2** | **అపకీర్తి - 2**

ఈ రాశివారికి సంవత్సరాది నుండి... **గురుడు** ది. 12-10-2018 వరకు **1**వ ఇంట **లోహమూర్తి** గాను, పిమ్మట ది. 2-04-2019 వరకు **2**వ ఇంట **రజితమూర్తి** గాను, తదాది సంవత్సరాంతము వరకు **3**వ ఇంట **రజితమూర్తి** గాను, **శని** ఈ సంవత్సరమంతయూ **3**వ ఇంట **లోహమూర్తి** గాను, ది. 5-03-2019 వరకు **రాహువు 10**వ ఇంట **కేతువు 4**వ ఇంట **లోహమూర్తులు** గాను, తదాది సంవత్సరాంతము వరకు **రాహువు 9**వ ఇంట **కేతువు 3**వ ఇంట **రజితమూర్తులు** గాను సంచరించెదరు.

ఈ సంవత్సరము వీరికి నూటికి **69**రూపాయలు ఆదాయముగాను, **31**రూపాయలు ఖర్చుగాను ఉండును. సమాజములో శతృవులు-మిత్రులు **సరి సమానముగా** ఉందురు. సంవత్సర ప్రథమార్ధము కంటే ఉత్తరార్ధము మరింత యోగప్రదముగా ఉండును. అనుకున్న పనులను పూర్తి చేయుదురు. అర్ధ-అంగ బలములను కలిగి ఉందురు. రాజకీయముగా-సామాజికముగా ఉన్నతి కలుగును. ఆకస్మిక పదవీ లాభములు ప్రాప్తించును. అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు కలసి వచ్చు కాలము. పాడి-పంట చెఱువులు-పరిశ్రమలు-వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు లాభసాటిగా సాగును. అధికారుల-పాలకుల అనుగ్రహము లభించును. శుభకార్యములు చేయుదురు. గృహనిర్మాణాది పనులు చేపడుదురు. స్థిర-చరాస్తులను కొనుగోలు చేయుదురు. నరఘోష అధికముగా ఉంటుంది. రాహు-కేతువుల పూజ అవసరము. ఉదర-కటి సంబంధిత అనారోగ్యము ఇబ్బంది పెట్టును.

ఈ రాశి **స్త్రీలకు** అభీష్టసిద్ధి. నూతన ప్రయత్నములు ఫలించును. అలంకార-భూషణ-వాహన సౌఖ్యములు కలుగును. శుభ కార్యజయము.

**విద్యార్ధులకు** అనుకూల కాలము. ప్రథమార్ధము కంటే ఉత్తరార్ధము ఇంకా బాగుంటుంది. రాజకీయములకు దూరముగా ఉండవలెను.

**ఉద్యోగులకు** పదోన్నతులు-జీతముల పెంపులు ఉండును. అధికారుల అనుగ్రహమును పొందెదరు. ఇష్ట ప్రదేశములకు బదలీలు జరుగును.

**వ్యాపారులకు** ప్రథమార్ధము సామాన్యముగా సాగును. ద్వితీయార్ధము లాభసాటిగా ఉండును. నగల వర్తకులకు, బాడుగ వ్యాపారులకు, గృహోపకరణ సామాగ్రి విక్రయించువారికి, సినిమా వ్యాపారులకు, రెడీమేడ్ షాపుల వారికి, పుస్తక విక్రేతలకు, ట్రాన్స్‌పోర్టువారికి, ఆటోమోబైల్స్ వారికి మేలు.

**చిత్తా నక్షత్రజులకు** వ్యాపారాభివృద్ధి, నూతన బాంధవ్యములు, అదృష్టం.



ప్రగతి-4, ప్రతిభ-15, విజయము-63, సామర్ధ్యము-92, శ్రమ-17,



**స్వాతీ నక్షత్రజులకు** శుభ సంఘటనలు, స్థిర లాభములు, జీవన సౌఖ్యము. **విశాఖా నక్షత్రజులకు** కార్యాటంకములు, కలహములు, ధనవ్యయములు.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 6.** ఈసంవత్సరము **చిత్తకు-5, స్వాతికి-6, విశాఖకు-9** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **శ్రీ లక్ష్మీనరసింహస్వామిని** పూజించుట వలన ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి సిద్ధించును.

**2018 మార్చ్ :** ఈ నెల రవి-చంద్ర-రాహువులు తటస్థులుగాను, కుజ-బుధ-శనులు శుభులుగాను, గురు-శుక్ర-కేతువులు అశుభులుగాను ఉందురు. విద్యార్ధులకు మంచి ఫలితములు. వ్యాపారులకు మేలు. నూతన మైత్రీ లాభములు. వృత్తి-ఉద్యోగ నిర్వహణలు సాఫీగా సాగును. ధనలబ్ది.
**అనుకూలతేదీలు : 2,3,7,10,12,13,14,17,18,19,20,21,24,25,27,28,31**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-గురు-కేతువులు అశుభులుగాను, చంద్ర-కుజ-బుధ-శనులు శుభులుగాను, శుక్ర-రాహువులు తటస్థులుగాను ఉందురు. శుభ కార్యములు. విద్యార్ధులకు-వ్యాపారులకు-శ్రామికులకు-ఉద్యోగులకు-నిరుద్యోగులకు యోగించును. పాడి-పంట-చెఱువులు ఫలించును. ధనలాభము.
**అనుకూలతేదీలు : 1,2,3,4,7,8,10,11,14,16,17,18,20,21,23,24,25,27,28,30.**

**మే :** ఈ నెల రవి-కుజ-గురు-కేతువులు అశుభులుగాను, చంద్ర-బుధ-శుక్ర-శనులు శుభులుగాను, రాహువు తటస్థుడుగాను ఉందురు. రావలసిన బాకీలు జాప్యమగును. ప్రమాద వస్తువులకు దూరముగా ఉండాలి. కుటుంబ సమస్యలు. ఆర్ధికముగా బాగుండును. పాడి-పంట-చెఱువులు లాభించును.
**అనుకూలతేదీలు : 1,2,4,5,9,11,12,14,18,19,21,25,26,28,30.**

**జూన్ :** ఈ నెల రవి-కుజ-గురు-శుక్ర-కేతువులు అశుభులుగాను, చంద్ర-బుధ-రాహువులు తటస్థులుగాను, శని శుభుడుగాను ఉందురు. స్త్రీ కలహములు. వాహన సారధ్యములో మెలకువగా ఉండవలెను. భారీ పెట్టుబడులు పెట్టరాదు. వృత్తి-ఉద్యోగాదులు సాఫీగా ఉండును. వ్యాపారములో ఇక్కట్లు.
**అనుకూలతేదీలు : 1,2,6,8,9,11,16,18,23,27,30.**

**జూలై :** ఈ నెల రవి-చంద్ర-కుజ-గురు-కేతువులు అశుభులుగాను, బుధ-శుక్ర-శనులు శుభులుగాను, రాహువు తటస్థుడుగాను ఉందురు. వ్యాపారులకు-ఉద్యోగులకు-నిరుద్యోగులకు-స్త్రీలకు యోగించును. శుభకార్య ప్రయత్నములు ఫలించును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు లాభించును.
**అనుకూలతేదీలు : 4,6,7,9,11,13,14,16,18,20,21,22,25,27,28,29.**

**ఆగస్ట్ :** ఈ నెల రవి-బుధ-శనులు శుభులుగాను, చంద్ర-కుజ-గురు-శుక్ర-కేతువులు అశుభులుగాను, రాహువుల తటస్థుడుగాను ఉందురు. రాజకీయముగా పరపతి పెరుగును. దూర ప్రయాణములు చేయుదురు. ప్రమాదములు. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములు లాభించును. దైవదర్శనము.
**అనుకూలతేదీలు : 1,4,5,8,11,12,13,15,18,19,22,25,26,29.**

**సెప్టెంబర్ :** ఈ నెల రవి-శుక్ర-శనులు శుభులుగాను, చంద్ర-బుధ-రాహువులు తటస్థులుగాను, కుజ-గురు-కేతువులు అశుభులుగాను ఉందురు.

అదృష్టము-75, ఉన్నతి-25, లాభము-50, నిరాశ-46 శాతముగా ఉండును



నిరుద్యోగులకు లాభించును. సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దర్శనమగును. మధ్యవర్తిత్వములు చేయరాదు. రాజకీయ పదోన్నతులు. స్థిరలాభములు.
**అనుకూలతేదీలు : 1,2,5,7,8,9,10,12,14,15,16,17,21,22,28,29.**

**అక్టోబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-కేతువులు అశుభులుగాను, గురు-రాహువులు తటస్థులుగాను, శుక్ర-శనులు శుభులుగాను ఉందురు. శుభాశుభ మిశ్రమ ఫలితములు. వాతావరణ మూలక నష్టములు. ఆస్తమా-మూత్రకోశ రోగులకు ఇబ్బందులు. సముద్ర-నదీ స్నానములకు పోరాదు.
**అనుకూలతేదీలు : 5,6,12,13,15,18,19,20,22,25,26,27,31.**

**నవంబర్ :** ఈ నెల రవి-కుజ-కేతువులు అశుభులుగాను, చంద్ర-రాహువులు తటస్థులుగాను, బుధ-గురు-శుక్ర-శనులు శుభులుగాను ఉందురు. అభీష్ట విజయములు. శుభకార్యములు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు-వృత్తి-ఉద్యోగ-వ్యాపార లాభములు. నిరుద్యోగులకు-నిస్సంతులకు మేలు.
**అనుకూలతేదీలు : 1,2,3,7,8,9,10,12,14,15,16,17,19,21,22,23,24,28,29,30.**

**డిసెంబర్ :** ఈ నెల రవి-కుజ-కేతువులు అశుభులుగాను, చంద్ర-బుధ-గురు-శుక్ర-శనులు శుభులుగాను, రాహువు తటస్థుడుగాను ఉందురు. శారీరక-ఆర్థిక-మానసిక ఉల్లాసములు. మీ మాటకు ఎదురు లేదు. అభీష్ట సిద్ధి. శత్రు విజయములు. రాజకీయముగా-సామాజికముగా ఉన్నతులు.
**అనుకూలతేదీలు : 1,5,6,7,8,10,12,13,14,15,17,19,20,21,22,23,25,26,27,28,29,30,31.**

**2019 జనవరి :** ఈ నెల రవి-రాహువులు తటస్థులుగాను, చంద్ర-కుజ-గురు-శుక్ర-శనులు శుభులుగాను, బుధ-కేతువులు అశుభులుగాను ఉందురు. బంధు-మిత్ర సందర్శనములు. పుణ్యక్షేత్ర సంచారములు. నూతన వస్తు-వస్త్ర-భూషణ-వాహన ప్రాప్తి. పాడి-పంట-చెఱువులు యోగించును.
**అనుకూలతేదీలు : 1,3,4,5,6,8,10,11,12,13,14,15,17,18,19,21,22,23,24,25,26,28,29,30,31.**

**ఫిబ్రవరి :** ఈ నెల రవి-కుజ-కేతువులు అశుభులుగాను, చంద్ర-గురు-శుక్ర-శనులు శుభులుగాను, బుధ-రాహువులు తటస్థులుగాను ఉందురు. పాడి-పంట-చెఱువులు ఫలించును. స్త్రీ సహకారములు. కళా-రాజకీయ రంగములందు రాణించెదరు. నూతన వస్తు-వాహన-భూషణ సౌఖ్యములు.
**అనుకూలతేదీలు : 1,2,5,6,7,8,9,11,14,15,16,18,21,22,23,25,27,28.**

**మార్చ్ :** ఈ నెల రవి-గురు-శుక్ర-శని-కేతువులు శుభులుగాను, చంద్ర-బుధులు తటస్థులుగాను, కుజ-రాహువులు అశుభులుగాను ఉందురు. విద్యార్థులకు సామాన్యముగా ఉండును. స్త్రీలకు-ఉద్యోగులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు మేలు కలుగును. వృత్తి-ఉద్యోగాదులు లాభించును.
**అనుకూలతేదీలు : 1,2,6,7,8,9,11,13,14,15,16,17,18,21,22,23,24,28,29,30,31.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-బుధ-శుక్రులు తటస్థులుగాను, చంద్ర-కుజ-గురు-రాహువులు అశుభులుగాను, శని-కేతువులు శుభులుగాను ఉందురు. విద్యార్థులు బాగా కష్టపడాలి. సామాన్య ఫలితములే వచ్చును. సోదరులతో జాగ్రత్తగా మెలగవలెను. చేయు వ్యాపారములందు మరింత శ్రద్ధ అవసరము.
**అనుకూలతేదీలు : 5,6,7,8,12,13,14,15,17,20,24,25,27.**



వృశ్చికరాశి వారికి ఈ సం॥ము తేజస్సు-15, ఆనందము-13, ధైర్యము-8,



# 8. వృశ్చిక రాశి ♏

విశాఖ-4వపాదము, అనురాధ-4పాదములు, జ్యేష్ఠ-4పాదములందు పుట్టినవారు మరియు "తో, నా, ని, నూ, నే, నో, యా, యీ, యూ" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "వృశ్చికరాశి"కి చెందినవారు.

**రాబడి - 2** | **పోబడి - 14** | **కీర్తి - 5** | **అపకీర్తి - 2**

ఈ రాశివారికి సంవత్సరాది నుండి... **గురుడు** ది. 12-10-2018 వరకు **12**వ ఇంట **తామ్రమూర్తి** గాను, పిమ్మట ది. 2-04-2019 వరకు **1**వ ఇంట **సువర్ణమూర్తి** గాను, తదాది సంవత్సరాంతము వరకు **2**వ ఇంట **లోహమూర్తి** గాను, **శని** ఈ సంవత్సరమంతయూ **2**వ ఇంట **తామ్రమూర్తి** గాను, ది. 5-03-2019 వరకు **రాహువు 9**వ ఇంట **కేతువు 3**వ ఇంట **తామ్రమూర్తులు** గాను, తదాది సంవత్సరాంతము వరకు **రాహువు 8**వ ఇంట **కేతువు 2**వ ఇంట **లోహమూర్తులు** గాను సంచరించెదరు.

ఈ సంవత్సరము వీరికి నూటికి **12**రూపాయలు ఆదాయముగాను, **88**రూపాయలు ఖర్చుగాను ఉండును. సమాజములో **71**మంది అనుకూలముగాను, **29**మంది ప్రతికూలముగాను ఉందురు. శారీరక-ఆర్థిక-మానసిక సమస్యలను ఎదుర్కొనవలసి ఉంటుంది. ప్రమాదకర ప్రదేశములుకు-వ్యక్తులకు-వస్తువులకు దూరముగా ఉండవలెను. మధ్యవర్తిత్వములు చేయరాదు. ప్రయాణములందు-వాహన సారధ్యమునందు జాగ్రత్త అవసరము. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు-వృత్తి-ఉద్యోగ-వ్యాపార నిర్వహణలు కష్ట-నష్టములతో కూడియుండును. నిరుద్యోగులకు-అవివాహితులకు-నిస్సంతులకు అంతగా అనుకూల కాలము కాదు. భారీ పెట్టుబడులతో ఎటువంటి వ్యాపార ప్రయత్నములు చేయరాదు. అపరిచితులను సులువుగా నమ్మరాదు. స్వశరీర మరియు కుటుంబ సభ్యుల ఆరోగ్యము ఎడల శ్రద్ధ అవసరము. శిరో-నేత్ర-నర-శల్య-హృదయ-ఉదర-మూత్ర రుగ్మతలు వచ్చును.

ఈ రాశి **స్త్రీలకు** ప్రతికూల కాలము. కుటుంబ వ్యవహారములందు తెలివిగా లౌక్యముతో మెలగవలెను. ఆరోగ్యము ఎడల శ్రద్ధ వహించవలెను.

**విద్యార్థులకు** ప్రతికూల ఫలితములు వచ్చును. చాలా కష్టపడవలసి ఉంటుంది. ప్రమాదకర ప్రదేశములకు వెళ్ళరాదు. క్రీడలలో గాయములు.

**ఉద్యోగులకు** పరీక్షా కాలము. పై అధికారులతో మాటలు పడుదురు. సహచర ఉద్యోగులతో సఖ్యత అవసరము. అవినీతికి దూరముగా ఉండాలి.

**వ్యాపారులకు** ప్రతికూల కాలము. భారీ పెట్టుబడులు పెట్టరాదు. వడ్డీ వ్యాపారులకు, గృహనిర్మాణ సామాగ్రి విక్రయించువారికి, హార్డ్‌వేర్ వర్తకులకు, ఫర్నిచర్ షాపులవారికి, కలప వ్యాపారులకు, ఎఱువుల వ్యాపారులకు, భీమా ఏజంట్లకు, ధాన్యం వ్యాపారులకు, దళారులకు అనుకూల కాలము.

**విశాఖా నక్షత్రజులకు** అనారోగ్యము, కలహములు, అశాంతి. **అనురాధా**

ప్రగతి-29, ప్రతిభ-21, విజయము-69, సామర్థ్యము-33, శ్రమ-25,



**నక్షత్రజులకు** మానసిక రుగ్మతలు, అనవసర ధనవ్యయములు, అవమానం. **జ్యేష్ఠా నక్షత్రజులకు** దూర ప్రయాణములు, స్త్రీ సహకారములు, ప్రశాంతత.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 9.** ఈసంవత్సరము **విశాఖకు-9, అనురాధకు-7, జ్యేష్ఠకు-2** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **కుమారస్వామిని** నిత్యము ఆరాధించుట వలన నవగ్రహములచే కలుగు సమస్త బాధలు నివారణ అగును.

**2018 మార్చ్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-గురు-శని-రాహువులు అశుభులుగాను, శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. పరస్త్రీ వ్యామోహముచే కలహములు. ప్రమాదకర వస్తువులకు-వ్యక్తులకు-ప్రదేశములకు దూరముగా ఉండాలి. ఇంటా-బయటా విరోధములు. గ్రహశాంతులు అవసరము.
**అనుకూలతేదీలు : 2,5,9,16,23.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-కేతువులు శుభులుగాను, చంద్ర-కుజ-బుధ-గురు-శుక్ర-శని-రాహువులు అశుభులుగాను ఉందురు. నిరుద్యోగులకు-ఉద్యోగులకు-రాజకీయనాయకులకు ఒకింత అనుకూలము. పాడి-పంట-చెఱువులు ఫలించవు. దూర ప్రయాణములకు ఆటంకములు. తల్లికి అనారోగ్యము.
**అనుకూలతేదీలు : 9,15,16,22,29.**

**మే :** ఈ నెల రవి-చంద్ర-శుక్రులు తటస్థులుగాను, కుజ-కేతువులు శుభులుగాను, బుధ-గురు-శని-రాహువులు అశుభులుగాను ఉందురు. శుభాశుభ మిశ్రమ ఫలితములుండును. విద్యార్థులకు సామాన్య ఫలితములు. సోదరుల సహకారములు. భూమి-గృహ సంబంధిత పనులు సాగును.
**అనుకూలతేదీలు : 6,7,8,13,14,15,16,18,22,23,25,29.**

**జూన్ :** ఈ నెల రవి-గురు-శని-రాహువులు అశుభులుగాను, చంద్ర-కుజ-శుక్ర-కేతువులు శుభులుగాను బుధుడు తటస్థుడుగాను ఉందురు. అవివాహితులకు యోగించును. అందుబాటుకు ధనము సర్దుబాటగును. వివాదములు పరిష్కారమగును. దూర ప్రయాణములు. నూతన వస్తు-వస్త్ర ప్రాప్తి.
**అనుకూలతేదీలు : 1,4,5,8,11,12,13,15,18,19,20,22,25,26,29.**

**జూలై :** ఈ నెల రవి-బుధ-గురు-శుక్ర-శని-రాహువులు అశుభులుగాను, చంద్ర-కుజ-కేతువులు శుభులుగాను ఉందురు. సుబ్రహ్మణ్యేశ్వరుని ఆరాధన మేలు చేయును. మధ్యవర్తిత్వములు చేయరాదు. పాడి-పంట-చెఱువులు నష్టపడును. అధికారులతో పేచీలు. వృత్తిరీత్యా సమస్యలు.
**అనుకూలతేదీలు : 2,3,9,10,16,17,23,24,31.**

**ఆగస్ట్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-శుక్ర-కేతువులు శుభులుగాను, బుధ-గురు-శని-రాహువులు అశుభులుగాను ఉందురు. స్త్రీ సహకారములు. శుభకార్య ప్రయత్నములు. అభీష్టసిద్ధి. పరస్త్రీ సౌఖ్యము. పాడి-పంట-చెఱువులు సామాన్యము. అందుబాటుకు ధనము చేకూరును.
**అనుకూలతేదీలు : 3,6,7,10,13,14,17,19,20,21,24,26,28,31.**

**సెప్టెంబర్ :** ఈ నెల రవి-కుజ-బుధ-కేతువులు శుభులుగాను, చంద్రుడు తటస్థుడుగాను, గురు-శుక్ర-శని-రాహువులు అశుభులుగాను ఉందురు.



అదృష్టము-13, ఉన్నతి-13, లాభము-69, నిరాశ-29 శాతముగా ఉండును



వాతావరణ మూలక నష్టములు. పనులు నింపాదిగా పూర్తగును. సోదరసోదరీల సహకారములు. శతృమిత్రత్వములు. వ్యాపారులకు యోగించును.
**అనుకూలతేదీలు : 2,3,4,5,9,10,11,12,16,18,19,23,25,26,30.**

**అక్టోబర్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-బుధ-గురు-శుక్ర-శని-రాహువులు అశుభులుగాను, కుజ-కేతువులు శుభులుగాను ఉందురు. ధైర్యముతో సమస్యలను ఎదుర్కొందురు. ఇరుగు-పొరుగువారి లేదా సోదరుల సహకారములు. తరచూ దగ్గరి ప్రయాణములు. అమ్మవారి దర్శనము.
**అనుకూలతేదీలు : 1,2,3,7,8,9,14,16,23,30.**

**నవంబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-గురు-శుక్ర-శని-రాహువులు అశుభులుగాను, కేతువు శుభుడుగాను ఉందురు. ఎటువంటి వివాదములలో తల దూర్చరాదు. భారీ పెట్టుబడులు పెట్టరాదు. ఇతరులను సులువుగా నమ్మరాదు. ప్రమాదకర ప్రదేశములకు-వస్తువులకు-వ్యక్తులకు దూరము.
**అనుకూలతేదీలు : 5,6**

**డిసెంబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-గురు-శుక్ర-శని-రాహువులు అశుభులుగాను, కేతువు శుభుడుగాను ఉందురు. వాహన ప్రమాదములు. అవమానములు. సానుభూతి ఘటనలు. అనవసర ధనవ్యయములు. దగాపడుట. పాడి-పంట-చెఱువులు నష్టములు. నవగ్రహ శాంతి ఆవశ్యము.
**అనుకూలతేదీలు : 3.**

**2019 జనవరి :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-గురు-శని-రాహువులు అశుభులుగాను, బుధ-శుక్ర-కేతువులు శుభులుగాను ఉందురు. శుభాశుభ మిశ్రమ ఫలితములు. విద్యార్థులకు-స్త్రీలకు-వ్యాపారులకు రాణించును. శుభవార్తలు వచ్చును. నూతన వస్తు-వస్త్ర-వాహన సౌఖ్యములు.
**అనుకూలతేదీలు : 2,4,7,9,11,16,18,20,25,27.**

**ఫిబ్రవరి :** ఈ నెల రవి-చంద్ర-బుధులు తటస్థులుగాను, కుజ-శుక్ర-కేతువులు శుభులుగాను, గురు-శని-రాహువులు అశుభులుగాను ఉందురు. అవివాహితులకు ఒకింత మేలు. వ్యయ-ప్రయాసలచే శుభ ప్రయత్నములు సిద్ధించును. అందుబాటుకు ధనము సర్దుబాటగును. పరస్త్రీ సౌఖ్యములు.
**అనుకూలతేదీలు : 1,3,4,8,10,11,12,13,15,19,20,22,26.**

**మార్చ్ :** ఈ నెల రవి-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, చంద్ర-బుధులు తటస్థులుగాను, కుజ-శుక్రులు శుభులుగాను ఉందురు. పాత బకాయిలు వచ్చును. భూములకు సంబంధించిన వ్యవహారములు కొలిక్కి వచ్చును. సోదర-సోదరీల లేదా స్త్రీల సహకారములు. విందు-వినోదములు.
**అనుకూలతేదీలు : 1,4,5,8,11,12,15,19,20,22,27,29.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-బుధులు తటస్థులుగాను, చంద్ర-గురు-శుక్రులు శుభులుగాను, కుజ-శని-రాహు-కేతువులు అశుభులుగాను ఉందురు. ఆర్థిక విషయములు అనుకూలించును. శుభకార్య ప్రయత్నములు సిద్ధించును. మానసిక ప్రశాంతత. దైవ సందర్శనము. దూర ప్రయాణములు. ఉత్తేజము.
**అనుకూలతేదీలు : 1,3,4,5,8,10,11,12,18,19,21,22,26,28.**

ధనుస్సురాశి వారికి ఈ సం॥ము తేజస్సు-4, ఆనందము-6, ధైర్యము-58,





# 9. ధనుస్సు రాశి



మూల-4పాదములు, పూర్వాషాఢ-4పాదములు, ఉత్తరాషాఢ-1వపాదమునందు పుట్టినవారు మరియు "యే,యో,బా,బి,బూ,ధా,భా,ఢా,బే" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "ధనుసురాశి"కి చెందినవారు.

**రాబడి - 5** | **పోబడి - 5** | **కీర్తి - 1** | **అపకీర్తి - 5**

ఈ రాశివారికి సంవత్సరాది నుండి... **గురుడు** ది. 12-10-2018 వరకు **11**వ ఇంట **సువర్ణమూర్తి** గాను, పిమ్మట ది. 2-04-2019 వరకు **12**వ ఇంట **లోహమూర్తి** గాను, తదాది సంవత్సరాంతము వరకు **1**వ ఇంట **తామ్రమూర్తి** గాను, **శని** ఈ సంవత్సరమంతయూ **1**వ ఇంట **రజిత మూర్తి** గాను, ది. 5-03-2019 వరకు **రాహువు 8**వ ఇంట **కేతువు 2**వ ఇంట **సువర్ణమూర్తులు** గాను, తదాది సంవత్సరాంతము వరకు **రాహువు 7**వ ఇంట **కేతువు 1**వ ఇంట **తామ్రమూర్తులు** గాను సంచరించెదరు.

ఈ సంవత్సరము వీరికి ఆదాయ-వ్యయములు **సమముగా** ఉండును. సమాజములో **17**మంది అనుకూలముగాను, **83**మంది ప్రతికూలముగాను ఉందురు. సంవత్సర ప్రథమార్థము గురు గ్రహము అనుగ్రహముచే శుభ కార్య ప్రయత్నములు ఫలించును. అవివాహితులకు-సంతానార్థులకు మంచి జరుగును. భూమి-పాడి-పంటలు-చెఱువులు ఫలించును. వ్యాపారాభివృద్ధి-కుటుంబ వృద్ధి ఉంటుంది. రచయితలకు-కళాకారులకు యోగించును. వృత్తి-ఉద్యోగాలలో ఉన్న ఒత్తిడులను అధిగమిస్తారు. సామాజికముగా-రాజకీయముగా అనుకూలించును. ప్రభుత్వముచే సత్కరించబడుదురు. దైవ దర్శనములు-పుణ్యక్షేత్ర సంచారములు చేయుదురు. సంవత్సర ద్వితీయార్థము నుండి అన్నింటా అవరోధములు కలుగును. శారీరక-మానసిక-ఆర్థిక సమస్యలతో సతమతమగుదురు. వాహన సారథ్యములో మెలకువ అవసరము. తలకు గాయములు అగును. తరచూ అస్వస్థతకు లోనగుదురు.

ఈ రాశి **స్త్రీలకు** సువర్ణ వస్తు-వస్త్ర-భూషణ లాభములు ఉండును. వివాహ ప్రయత్నములు సిద్ధించును. దూరదేశ ప్రయాణములు చేయుదురు.

**విద్యార్థులకు** ప్రథమార్థము ఉత్తమ ఫలితములు కలుగును. ఉత్తరార్థము నుండి విద్యపట్ల ఏకాగ్రత అవసరము. ప్రమాదకర విన్యాసములు చేయరాదు

**ఉద్యోగులకు** ఋణ సదుపాయములు కలుగును. పదోన్నతులలో ఆలశ్యములు జరుగును. ఇంక్రిమెంట్లు వచ్చును. అధికారుల అండదండలు.

**వ్యాపారులకు** సంవత్సర ప్రథమార్థము లాభసాటిగా ఉండును. ఉత్తరార్థములో వ్యాపారములు మందగించును. కిరాణా వర్తకులకు, బంగారం వ్యాపారులకు, అపరాల వర్తకులకు, వస్త్ర వ్యాపారులకు, వాహన వ్యాపారులకు, మిఠాయి దుకాణాలవారికి, ప్రచురణ కర్తలకు, ఫౌండ్రీల వారికి మేలు.

**మూలా నక్షత్రజులకు** వివాహ-వ్యాపార లాభములు. బంధు-మిత్ర



ప్రగతి-42, ప్రతిభ-23, విజయము-25, సామర్థ్యము-50, శ్రమ-19,



సహకారము. **పూర్వాషాఢా నక్షత్రజులకు** భయాందోళనలు. ఆకస్మిక ప్రమాదములు. **ఉత్తరాషాఢా నక్షత్రజులకు** భోగజీవనము. కళానైపుణ్యము. కీర్తి.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 3.** ఈసంవత్సరము **మూలకు-5, పూర్వాషాఢకు-4, ఉత్తరాషాఢకు-6** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **వేణుగోపాలస్వామిని** నిత్యము పూజించుట వలన గ్రహముల వలన కలుగు చెడు ఫలితములకు దూరమగుదురు.

**2018 మార్చి :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-బుధ-గురు-శుక్రులు శుభులుగాను, కుజ-శని-రాహు-కేతువులు అశుభులుగాను ఉందురు. నిరుద్యోగులకు-అవివాహితులకు యోగించును. విద్యార్థులకు-స్త్రీలకు-వ్యాపారులకు-వైద్యులకు-కళాకారులకు అనుకూల కాలము. వ్యాపారాభివృద్ధి

**అనుకూలతేదీలు : 1,2,4,5,7,8,9,11,12,14,15,16,21,22,23,26,28,29,30.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-శని-రాహు-కేతువులు అశుభులుగాను, బుధ-గురులు శుభులుగాను, శుక్రుడు శుభుడుగాను ఉందురు. పాడి-పంట-చెఱువులు ఫలించును. విద్యార్థుకు-స్త్రీలకు-వ్యాపారులకు యోగించును. సంచారము. శరీరములో వేడి. తూర్పు ప్రయాణములు ఉండును.

**అనుకూలతేదీలు : 2,4,5,6,11,12,13,18,19,25,26,30.**

**మే :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగాను, బుధ-గురులు శుభులుగాను ఉందురు. విద్యార్థులకు ఉత్తమ ఫలితములు. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు యోగించును. శుభకార్యములు చేయుదురు. వాస్తు మార్పులు లేదా గృహనిర్మాణ యోగములు.

**అనుకూలతేదీలు : 2,3,9,10,17,20,24,27,28,30,31.**

**జూన్ :** ఈ నెల రవి-బుధులు తటస్థులుగాను, చంద్ర-కుజ-శని-రాహు-కేతువులు అశుభులుగాను, గురు-శుక్రులు శుభులుగాను ఉందురు. బాల్య స్నేహితులను కలుసుకొందురు. కళాకారులకు గుర్తింపు వచ్చును. స్త్రీ సౌఖ్యములు ఉండును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు రాణించును.

**అనుకూలతేదీలు : 3,6,7,10,14,15,21,22,27,28,29.**

**జూలై :** ఈ నెల రవి-చంద్ర-కుజ-శని-రాహు-కేతువులు అశుభులుగాను, బుధ-గురు-శుక్రులు శుభులుగాను ఉందురు. అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు అనుకూలించును. బంధు-మిత్ర సహకారములు కలుగును. సన్మాన-సత్కారములు. శత్రువిజయములు. తండ్రికి అస్వస్థత.

**అనుకూలతేదీలు : 4,5,6,11,12,13,18,19,20,25,26,27,30.**

**ఆగస్ట్ :** ఈ నెల రవి-కుజ-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగాను, చంద్రుడు తటస్థుడుగాను, బుధ-గురులు శుభలుగాను ఉందురు. నూతన స్నేహలాభములు. శుభకార్యములలో పాలు పంచుకొందురు. పాడి-పంట-చెఱువులు-వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సాఫీగా ఉండును. దైవదర్శనము.

**అనుకూలతేదీలు : 1,2,6,8,9,15,16,22,23,27,29,30.**

**సెప్టెంబర్ :** ఈ నెల రవి-కుజ-శని-రాహు-కేతువులు అశుభులుగాను, చంద్ర-గురు-శుక్రులు శుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు.

అదృష్టము-50, ఉన్నతి-92, లాభము-44, నిరాశ-29 శాతముగా ఉండును



శుభాశుభ మిశ్రమ ఫలితములు. పనులందు ఆలస్యము. స్వశరీర ఆరోగ్యము నందు శ్రద్ధ అవసరము. ఆర్థిక లావాదేవీలందు సమస్యలు ఉత్పన్నమగును.

**అనుకూలతేదీలు : 3,6,7,13,14,17,19,20,21,23,24,26,27,28,30.**

**అక్టోబర్ :** ఈ నెల రవి-చంద్ర-బుధ-శుక్రులు శుభులుగాను, కుజ-శని-రాహు-కేతువులు అశుభులుగాను, గురుడు తటస్థుడుగాను ఉందురు. దూర ప్రయాణములు. అభీష్టవిజయములు. సముద్రస్నానములు. మానసిక ప్రశాంతత. ఆర్థికాభివృద్ధి. అందుబాటుకు ధనము సర్దుబాటగును.

**అనుకూలతేదీలు : 1,3,4,5,7,8,10,11,12,14,15,17,19,21,24,26,28,29.**

**నవంబర్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-శుక్రులు శుభులుగాను, బుధ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను ఉందురు. పాడి-పంట-చెఱువులు-వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు కష్టముగా సాగును. సోదర-సోదరీల సహాయ-సహకారములు కలుగును. ఋణసదుపాయములు.

**అనుకూలతేదీలు : 2,4,5,9,11,12,13,16,20,23,26,27,30.**

**డిసెంబర్ :** ఈ నెల రవి-బుధ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, చంద్ర-కుజ-శుక్రులు శుభులుగాను ఉందురు. పనులు మందముగా సాగును. అభివృద్ధి మందగించును. దూర ప్రయాణములు చేయుదురు. ప్రేమ వ్యవహారములు ఫలించును. అన్యస్త్రీ/పురుష సమాగములు.

**అనుకూలతేదీలు : 3,4,7,10,11,14,17,18,21,28,31.**

**2019 జనవరి :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-గురు-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగా ఉందురు. భారీ పెట్టుబడులు పెట్టరాదు. పాడి-పంట-చెఱువులు నష్టపడును. అవాంఛనీయ ఘటనలు ఎదురగును. అవమానములు-అపనిందలు వచ్చును. నవగ్రహముల శాంతి ఆవశ్యము.

**అనుకూలతేదీలు : 23,28,30.**

**ఫిబ్రవరి :** ఈ నెల రవి-బుధులు తటస్థులుగాను, చంద్ర-కుజ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, శుక్రుడు శుభుడుగాను ఉందురు. సమస్యలను ధైర్యముతో ఎదుర్కొందురు. ఆపత్కాలములో మిత్రుల సహకారములు ఊరటనిచ్చును. ఋణ ప్రయత్నములు ఫలించును. దైవదర్శనము

**అనుకూలతేదీలు : 1,6,8,15,17,22,24,25,27.**

**మార్చ్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, బుధుడు తటస్థుడుగాను, శుక్రుడు శుభుడుగాను ఉందురు. ఇతరుల వ్యవహారములలో తల దూర్చరాదు. మధ్యవర్తిత్వములు చేయరాదు. ప్రయాణములలో మెలకువగా ఉండవలెను. స్త్రీలకు యోగించును.

**అనుకూలతేదీలు : 1,3,6,8,10,13,15,22,26,29.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-చంద్ర-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, కుజ-శుక్రులు శుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు. విద్యార్థులకు ఏకాగ్రత అవసరము. సోదర-సోదరీల సహకారములు ఉండును. బుద్ధి బలముచే సమస్యలను అధిగమించెదరు. విందు-వినోదములు.

**అనుకూలతేదీలు : 2,5,9,12,16,17,19,23,24,26,29,30.**



మకరరాశి వారికి ఈ సం॥ము తేజస్సు-2, ఆనందము-44, ధైర్యము-83,



## 10. మకర రాశి ♑

*ఉత్తరాషాఢ-2,3,4పాదములు, శ్రవణం-4పాదములు, ధనిష్ఠ-1,2 పాదములందు పుట్టినవారు మరియు "బో,జా,జి,జూ,జే,జో,ఖ,గా,గీ" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "మకరరాశి"కి చెందినవారు.*

**రాబడి - 8** | **పోబడి - 14** | **కీర్తి - 4** | **అపకీర్తి - 5**

ఈ రాశివారికి సంవత్సరాది నుండి... **గురుడు** ది. 12-10-2018 వరకు **10**వ ఇంట **రజితమూర్తి** గాను, పిమ్మట ది. 2-04-2019 వరకు **11**వ ఇంట **సువర్ణమూర్తి** గాను, తదాది సంవత్సరాంతము వరకు **12**వ ఇంట **రజితమూర్తి** గాను, **శని** ఈ సంవత్సరమంతయూ **12**వ ఇంట **సువర్ణమూర్తి** గాను, ది. 5-03-2019 వరకు **రాహువు 7**వ ఇంట **కేతువు 1**వ ఇంట **రజితమూర్తులు** గాను, తదాది సంవత్సరాంతము వరకు **రాహువు 6**వ ఇంట **కేతువు 12**వ ఇంట **రజితమూర్తులు** గాను సంచరించెదరు.

ఈ సంవత్సరము వీరికి నూటికి **36**రూపాయలు ఆదాయముగాను, **64**రూపాయలు ఖర్చుగాను ఉండును. సమాజములో **44**మంది అనుకూలముగాను, **56**మంది ప్రతికూలముగాను ఉందురు. ఏల్నాటి శని ప్రభావముచే పనులు మందముగా సాగును. గ్రహములు మూర్తిమంతముచే శుభులుగా ఉండుటవలన గ్రహములకు స్థానబలము లేకున్ననూ పెద్దగా ఇబ్బందులు ఉండవు. సంవత్సర ప్రథమార్థము కంటే ఉత్తరార్థము శుభముగా ఉండును. పాడి-పంట-చెఱువులు సామాన్యముగా ఫలించును. మధ్యవర్తిత్వములు చేయరాదు. రాహు-కేతువుల ప్రభావముచే మానసిక బలము అవసరము. అవివాహితులకు-నిస్సంతులకు అనుకూలించును. రచయితలకు-ప్రచురణ కర్తలకు యోగించును. నూతన వాహన ప్రాప్తి. భూమి-గృహ నిర్మాణ ప్రయత్నములు ప్రయాసచే ఫలించును. స్వశరీర ఆరోగ్యము ఎడల శ్రద్ధ అవసరము దూర ప్రయాణములు, సన్మాన-సత్కారములు, మంత్రదీక్షలు ఉండును.

ఈ రాశి **స్త్రీలకు** శుభాశుభ మిశ్రమ ఫలితములు. శారీరక-మానసిక రుగ్మతలు. సువర్ణ-వస్తు-భూషణ ప్రాప్తి. వివాహ ప్రయత్నములు ఫలించును.

**విద్యార్థులకు** ప్రథమార్థము సామాన్య ఫలితములు వచ్చును. ఉత్తరార్థము నుండి ఉత్తమ ఫలితములుండును. విద్యపట్ల నిర్లక్ష్యము పనికిరాదు.

**ఉద్యోగులకు** సామాన్యముగానే ఉంటుంది. ఉత్తరార్థము ఇంక్రిమెంట్లు వచ్చును. అనుకున్న ప్రదేశములకు బదలీలు జరుగును. ధనలాభములు.

**వ్యాపారులకు** శుభాశుభ మిశ్రమ కాలము. దీర్ఘకాలిక పెట్టుబడులకు అనుకూలము. పుస్తక విక్రేతలకు, విద్యా-వైద్య వ్యాపారులకు, స్మగుల్డ్‌గూడ్స్ విక్రయించువారికి, మట్టి వ్యాపారులకు, వడ్డీ వ్యాపారులకు, పూజాసామాగ్రి విక్రయించువారికి, బియ్యం వర్తకులకు, ఆటోమొబైల్స్‌వారికి యోగించును.

**ఉత్తరాషాఢా నక్షత్రజులకు** బంధుమిత్రుల సహకారములు, ఋణ

ప్రగతి-46, ప్రతిభ-8, విజయము-100, సామర్థ్యము-6, శ్రమ-25,



సౌకర్యములు **శ్రవణా నక్షత్రజులకు** దూర ప్రయాణములు, కోర్టు విజయములు. **ధనిష్ఠా నక్షత్రజులకు** వస్తు నష్టములు, శారీరక-మానసిక రుగ్మతలు.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 8.** ఈసంవత్సరము **ఉత్తరాషాఢకు-5, శ్రవణముకు-5, ధనిష్ఠకు-7** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **సరస్వతీదేవిని** ఆరాధించుట వలన జ్ఞాన సంపదలచే కష్టములను అధిగమించగలరు.

**2018 మార్చ్ :** ఈ నెల రవి-చంద్రులు తటస్థులుగాను, కుజ-బుధ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, శుక్రుడు శుభుడుగాను ఉందురు. శుభాశుభ మిశ్రమ ఫలితములు. పనులు మందముగా సాగును. మధ్యవర్తిత్వములు చేయరాదు. కళాకారులకు-స్త్రీలకు మేలు. రాజకీయ అండ.
**అనుకూలతేదీలు : 2,6,9,16,18,19,23,25,26,30.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-కుజ-బుధ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, చంద్ర-శుక్రులు శుభులుగాను ఉందురు. పనుల ఒత్తిడి. శిరో-నేత్ర-హృదయ సమస్యలు. అవివాహితులకు అనుకూలము. విద్యార్థులకు ఏకాగ్రత అవసరము. ప్రమాదకర వస్తువులకు దూరముగా ఉండవలెను.
**అనుకూలతేదీలు : 1,2,6,8,9,13,20,23,27,30.**

**మే :** ఈ నెల రవి-కుజ-బుధ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, చంద్రుడు శుభుడుగాను, శుక్రుడు తటస్థుడుగాను ఉందురు. భారీ పెట్టుబడులు పెట్టరాదు. అనవసర విషయాలలో తల దూర్చరాదు. వాహన ప్రమాదములు. చెఱువులు-పాడి-పంట-పరిశ్రమలు అనుకూలించవు.
**అనుకూలతేదీలు : 4,7,11,16,21,23,28.**

**జూన్ :** ఈ నెల రవి-చంద్ర-బుధులు తటస్థులుగా, కుజ-గురు-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగాను ఉందురు. వృత్తి-ఉద్యోగ-వ్యాపార నిర్వహణలందు జాగ్రత్తగా ఉండాలి. శారీరక-మానసిక-ఆర్థిక సమస్యలు. ఆదాయమునకు మించిన ఖర్చులు. మాటలలో తొందరపాటు పనికిరాదు.
**అనుకూలతేదీలు : 4,13,17,20,24,25.**

**జూలై :** ఈ నెల రవి-శుక్రులు శుభులుగాను, చంద్ర-కుజ-బుధ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను ఉందురు. అస్వస్థత. ప్రియవ్యక్తుల రాక. వాతావరణ మూలక నష్టములు. పాడి-పంట-చెఱువులు ఫలించవు. నిరుద్యోగులకు-స్త్రీలకు ఒకింత మేలు కలుగును. స్త్రీల సహకారములు. వ్యసనాలు.
**అనుకూలతేదీలు : 1,2,6,8,13,15,20,23,27.**

**ఆగస్ట్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-గురు-శని-రాహు-కేతువులు అశుభులుగాను, శుక్రుడు శుభుడుగాను ఉందురు. ఎటువంటి ప్రయత్నములు చేయరాదు. మధ్యవర్తిత్వములు చేయరాదు. ప్రయాణములకు ఆటంకములు. నరములకు సంబంధించిన రుగ్మతలు. మిత్రశతృత్వములు.
**అనుకూలతేదీలు : 3,10,17,20,24,31.**

**సెప్టెంబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-గురు-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు. ఆశాభంగములు.



అదృష్టము-23, ఉన్నతి-58, లాభము-44, నిరాశ-8 శాతముగా ఉండును



అనుకోని విపత్తులు. ప్రమాదకర వ్యక్తులకు-ప్రదేశములకు-వస్తువులకు దూరముగా ఉండవలెను. అపరిచితులను నమ్మరాదు. వివాదములు.
**అనుకూలతేదీలు : 5,12.**

**అక్టోబర్ :** ఈ నెల రవి-గురులు తటస్థులుగాను, చంద్ర-కుజ-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగాను, బుధుడు శుభుడుగాను ఉందురు. శుభాశుభ మిశ్రమ ఫలితములు. వివాహ భంగములు. జీవిత భాగస్వామితో పేచీలు. జలుబు-కఫ సమస్యలతో ఇబ్బంది పడుదురు. ధన వ్యయములు.
**అనుకూలతేదీలు : 10,17,18,21,22,24,25,28,29,31.**

**నవంబర్ :** ఈ నెల రవి-బుధ-గురులు శుభులుగాను, చంద్రుడు తటస్థుడుగాను, కుజ-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగాను ఉందురు. విద్యార్థులకు-రచయితలకు-పండితులకు-వ్యాపారులకు-అనుకూల కాలము. అందుబాటుకు ధనము సర్దుబాటగును. శుభవార్తలు. వస్తు లాభములు.
**అనుకూలతేదీలు : 1,4,7,8,11,14,15,18,19,21,22,25,26,28,29.**

**డిసెంబర్ :** ఈ నెల రవి-చంద్ర-బుధ-గురులు శుభులుగాను, కుజ-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగాను ఉందురు. పనులు ప్రయత్నముచే ఫలించును. స్వల్ప అస్వస్థతలు. పాడి-పంట-చెఱువులు రాణించవు. విద్యార్థులకు-వ్యాపారులకు-పండితులకు యోగించును. ధైర్యము.
**అనుకూలతేదీలు : 2,5,6,9,12.13.16,17,19,20,24,25,26,27,31.**

**2019 జనవరి :** ఈ నెల రవి-బుధ-శని-రాహు-కేతువులు అశుభులుగాను, చంద్ర-కుజ-గురు-శుక్రులు శుభులుగాను ఉందురు. గృహ నిర్మాణాది పనులు వేగవంతమగును. శుభవార్తలు వచ్చును. స్నేహితుల-సోదరుల సహకారములు కలుగును. నూతన వస్తు-వస్త్ర-భూషణ లాభములు.
**అనుకూలతేదీలు : 1,3,4,7,8,10,11,14,15,17,18,21,22,24,25,28,29,31.**

**ఫిబ్రవరి :** ఈ నెల రవి-కుజ-శుక్ర-శని-రాహు-కేతువులు అశుభులుగాను, చంద్ర-గురులు శుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు. నర ఘోష అధికముగా ఉంటుంది. అవివాహితులకు-నిరుద్యోగులకు ఒకింత మేలు జరుగును. కావలసిన వారితో విరోధములు వచ్చును. స్త్రీ కలహము.
**అనుకూలతేదీలు : 4,5,7,13,14,18,20,21,25,28.**

**మార్చ్ :** ఈ నెల రవి-చంద్ర-గురు-శుక్ర-రాహువులు శుభులుగాను, కుజ-శని-కేతువులు అశుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు. పనులు వేగవంతమగును. శారీరక-మానసిక ప్రశాంతతలు. అందుబాటుకు ధనము లభించును. పాడి-పంట-చెఱువులు పెద్దగా ఫలించవు. ప్రయాణం.
**అనుకూలతేదీలు : 1,4,7,8,14,15,17,18,20,21,22,24,25,27,28,29,31.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-బుధులు తటస్థులుగాను, చంద్ర-శుక్ర-రాహువులు శుభులుగాను, కుజ-గురు-శని-కేతువులు అశుభులుగాను ఉందురు. ఖర్చులు అధికమగును. పనులు మందముగా సాగును. విందు-వినోద కార్యక్రమములలో పాల్గొందురు. దూర ప్రయాణములు ఉంటాయి.
**అనుకూలతేదీలు : 1,3,5,7,10,12,14,15,19,22,25,26.**

కుంభరాశి వారికి ఈ సం॥ము తేజస్సు-15, ఆనందము-63, ధైర్యము-69,





# 11. కుంభ రాశి

ధనిష్ఠ-3,4పాదములు, శతభిషము-4పాదములు, పూర్వాభాద్ర-1,2,3 పాదములందు పుట్టినవారు మరియు "గూ,గే,గో,సా,సీ,సు,సే,సో,దా" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "కుంభరాశి"కి చెందినవారు.

**రాబడి - 8** | **పోబడి - 14** | **కీర్తి - 7** | **అపకీర్తి - 5**

ఈ రాశివారికి సంవత్సరాది నుండి... **గురుడు** ది. 12-10-2018 వరకు **9**వ ఇంట **లోహమూర్తి** గాను, పిమ్మట ది. 2-04-2019 వరకు **10**వ ఇంట **తామ్రమూర్తి** గాను, తదాది సంవత్సరాంతము వరకు **11**వ ఇంట **సువర్ణమూర్తి** గాను, **శని** ఈ సంవత్సరమంతయూ **11**వ ఇంట **లోహమూర్తి** గాను, ది. 5-03-2019 వరకు **రాహువు 6**వ ఇంట-**కేతువు 12**వ ఇంట **లోహమూర్తులు** గా, తదాది సంవత్సరాంతము వరకు **రాహువు 5**వ ఇంట **కేతువు 11**వ ఇంట **సువర్ణమూర్తులు** గాను సంచరించెదరు.

ఈ సంవత్సరము వీరికి నూటికి **36**రూపాయలు ఆదాయముగాను, **64**రూపాయలు ఖర్చుగాను ఉండును. సమాజములో **58**మంది అనుకూలముగాను, **42**మంది ప్రతికూలముగాను ఉందురు. కార్యసిద్ధి-అభీష్ట విజయములు. నూతన శుభ ప్రయత్నములు ఫలించును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు యోగించును. అవివాహితులకు-నిరుద్యోగులకు-సంతానార్థులకు మేలగును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములందు అభివృద్ధి కలుగును. విదేశ ప్రయాణములు, నూతన వస్తు-వాహన-భూషణ లాభములు, గృహనిర్మాణాది యోగములు సంప్రాప్తమగును. భాగస్వామ్య వ్యవహారములకంటే వ్యక్తిగత వ్యవహారములే లాభసాటిగా ఉండును. ఆదాయము పెరిగిననూ, ఖర్చులు కూడా అధికముగానే ఉండును. పుణ్యక్షేత్ర సంచారములు-దైవ సందర్శనములు చేయుదురు. స్వశరీర ఆరోగ్యము ఎడల శ్రద్ధ వహించవలెను. నరఘోషచే మానసిక ఒత్తిడులు అధికమగును. మధ్యవర్తిత్వములు చేయరాదు.

ఈ రాశి **స్త్రీలకు** అనుకూల కాలము. కుటుంబ వ్యవహారములు చక్కబడును. సువర్ణ-వస్తు-భూషణ లాభములు. అనుకున్న పనులు పూర్తగును.

**విద్యార్థులకు** ఉత్తమ ఫలితములు వచ్చును. ఉపకార వేతనములు లభించును. దూర ప్రయాణములు కలసి వచ్చును. క్రీడా విజయములు.

**ఉద్యోగులకు** ఉత్తమ కాలము. ప్రమోషన్లు-ఇంక్రిమెంట్లు వచ్చును. ఋణ సదుపాయములచే అనుకున్న పనులను పూర్తి గావింతురు.

**వ్యాపారులకు** అనుకూల కాలము. వడ్డీ వ్యాపారులకు, హార్డ్‌వేర్ వర్తకులకు, ఆయిల్ వ్యాపారులకు, ధాన్యం వ్యాపారులకు, ఫర్నిచర్ వ్యాపారులకు, ఆటోమొబైల్స్ వారికి, ఫౌండ్రీలు-ఖార్ఖానాల వారికి, బియ్యం వ్యాపారులకు, ట్రాన్స్‌పోర్టు వారికి, మద్యము-మాంసము వ్యాపారులకు యోగించును.

**ధనిష్ఠా నక్షత్రజులకు** అనూహ్య లాభములు, వ్యాపారాభివృద్ధి, జ్ఞానసిద్ధి.



ప్రగతి-17, ప్రతిభ-75, విజయము-13, సామర్థ్యము-38, శ్రమ-92,



**శతభిషా నక్షత్రజులకు** భోగము, స్థిర-చరాస్తుల లాభములు, ధనవృద్ధి. **పూర్వాభాద్రా నక్షత్రజులకు** బంధు-మిత్ర సహకారములు, ఆరోగ్యము.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 8.** ఈసంవత్సరము **ధనిష్ఠకు-5, శతభిషముకు-6, పూర్వాభాద్రకు-5** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **శ్రీ వేంకటేశ్వరస్వామివారిని** పూజించుట వలన అతులిత భోగ-భాగ్యములు సంప్రాప్తమగును.

**2018 మార్చ్ :** ఈ నెల రవి-చంద్ర-కేతువులు అశుభులుగాను, కుజ-బుధ గురు-శుక్ర-శని-రాహువులు శుభులుగాను ఉందురు. స్థిర-చరాస్తుల కొనుగోలులు. భూమి-పాడి-పంట-చెఱువులు ఫలించును. విద్యార్థులకు-వ్యాపారులకు-రాజకీయనాయకులకు-కళాకారులకు-వైద్యులకు-స్త్రీలకు మేలు.
**అనుకూలతేదీలు : 1,2,3,7,8,9,10,12,13,14,15,16,17,20,21,22,23,24,27,28,29,30,31.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-కుజ-బుధ-గురు-శుక్ర-శని-రాహువులు శుభులుగాను, చంద్ర-కేతువులు అశుభులుగాను ఉందురు. శుభకార్యములు సిద్ధించును. స్వల్ప అస్వస్థతలు. నిర్మాణాత్మక కార్యక్రమములు చేపడుదురు. జల ప్రదేశములకు దూరముగా ఉండవలెను. రాజకీయముగా యోగించును
**అనుకూలతేదీలు : 3,4,5,6,7,10,11,12,13,14,15,16,17,18,19,20,21,22,23,24,25,26,27,28,29.**

**మే :** ఈ నెల రవి-చంద్రులు తటస్థులుగాను, కుజ-కేతువులు అశుభులుగాను, బుధ-గురు-శుక్ర-శని-రాహువులు శుభులుగాను ఉందురు. సోదర సోదరీలతో జాగ్రత్తగా ఉండవలెను. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు యోగించును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సాఫీగా సాగును. విద్యాభివృద్ధి.
**అనుకూలతేదీలు : 1,2,3,4,5,6,9,10,11,12,13,14,17,18,19,21,24,25,26,30,31.**

**జూన్ :** ఈ నెల రవి-కుజ-శుక్ర-కేతువులు అశుభులుగాను, చంద్ర-గురు-శనులు శుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు. పాడి-పంట-చెఱువులు సామాన్యముగా ఫలించును. భూమి-గృహ సంబంధించిన పనులు మందముగా సాగును. వాతావరణ మూలక సమస్యలు ఏర్పడును.
**అనుకూలతేదీలు : 1,2,6,7,8,9,11,14,16,18,21,23,25,27,28,30.**

**జూలై :** ఈ నెల రవి-కుజ-శుక్ర-కేతువులు అశుభులుగాను, చంద్ర-బుధ-గురు-శని-రాహువులు శుభులుగాను ఉందురు. అధికారులతో జాగ్రత్తగా మెలగవలెను. వృత్తి-ఉద్యోగాదులందు శ్రమ అధికమగును. వ్యాపారాలు సంతృప్తిగా సాగును. భూమి-పాడి-పంట-చెఱువులు పెద్దగా ఫలించవు.
**అనుకూలతేదీలు : 4,5,7,9,11,12,14,16,18,19,21,22,23,25,26,28,29,30.**

**ఆగస్ట్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-బుధ-గురు-శుక్ర-శని-రాహువులు శుభులుగాను, కుజ-కేతువులు అశుభులుగాను ఉందురు. విజ్ఞాన సమూపార్జన. సామాజికముగా-రాజకీయముగా ఉన్నతి. అవివాహితులకు-నిస్సంతులకు-నిరుద్యోగులకు మేలు. అభీష్ట విజయములు. ప్రయాణములు
**అనుకూలతేదీలు : 1,2,3,4,5,8,9,10,11,12,13,15,16,17,18,20,22,23,24,25,27,29,30,31.**

**సెప్టెంబర్ :** ఈ నెల రవి-కుజ-కేతువులు అశుభులుగాను, చంద్ర-గురు-శుక్ర-శని-రాహువులు శుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు.

సన్మాన-సత్కారములు. పనుల ఒత్తిడి. అధిక శ్రమ. తండ్రికి అనారోగ్యము. అనుకున్న పనులు పూర్తగును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సామాన్యము.
**అనుకూలతేదీలు : 1,6,7,8,10,13,14,15,17,19,20,21,22,24,26,27,28,29.**

**అక్టోబర్ :** ఈ నెల రవి-చంద్ర-కుజ-బుధ-కేతువులు అశుభులుగాను, గురుడు తటస్థుడుగాను, శుక్ర-శని-రాహువులు శుభులుగాను ఉందురు. శుభాశుభ మిశ్రమ ఫలితములుండును. స్వల్ప అస్వస్థత. ఆదాయమునకు మించిన ఖర్చులు. పాడి-పంట-చెఱువులు లాభించును. తల్లికి అస్వస్థత.
**అనుకూలతేదీలు : 3,4,5,6,11,12,13,15,19,20,26,27,31.**

**నవంబర్ :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-గురు-కేతువులు అశుభులుగాను, బుధ-శుక్ర-శని-రాహువులు శుభులుగాను ఉందురు. వ్యాపారులకు-స్త్రీలకు-కళాకారులకు-ఉద్యోగులకు రాణించును. ధన వ్యవహారములందు ఇబ్బందులు ఉండును. కుటుంబములో పేచీలు వచ్చును.
**అనుకూలతేదీలు : 2,3,7,9,10,12,14,16,17,18,21,23,24,25,28,30.**

**డిసెంబర్ :** ఈ నెల రవి-బుధ-శుక్ర-శని-రాహువులు శుభులుగాను, చంద్ర-కుజ-గురు-కేతువులు అశుభులుగాను ఉందురు. శుభకార్యములు ఫలించును. నిరుద్యోగులకు శుభము జరుగును. భారీ ప్రాజెక్టులు రూపు దాల్చును. పాడి-పంట-చెఱువులు ఫలించును. సామాజికముగా గౌరవము.
**అనుకూలతేదీలు : 1,2,5,7,8,9,10,12,14,15,16,19,21,22,23,26,28,29,30.**

**2019 జనవరి :** ఈ నెల రవి తటస్థుడుగాను, చంద్ర-కుజ-గురు-శుక్ర-కేతువులు అశుభులుగాను, బుధ-శని-రాహువులు శుభులుగాను ఉందురు. పాడి-పంట-చెఱువులు పెద్దగా ఫలించవు. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు యోగించును. సోదర-సోదరీలతో పేచీలు. అనవసర ధనవ్యయములు.
**అనుకూలతేదీలు : 2,5,6,9,12,13,16,19,21,26.**

**ఫిబ్రవరి :** ఈ నెల రవి-బుధ-గురు-కేతువులు అశుభులుగాను, చంద్రుడు తటస్థుడుగాను, కుజ-శుక్ర-శని-రాహువులు శుభులుగాను ఉందురు. క్రయ విక్రయాదులు సాఫీగా సాగును. భూమి-గృహ నిర్మాణాది పనులు చేపడుదురు. స్థిరాస్తుల కొనుగోలులు. పాడి-పంట-చెఱువులు ఫలించును.
**అనుకూలతేదీలు : 1,2,8,9,11,12,15,16,18,19,22,23,26,27.**

**మార్చ్ :** ఈ నెల రవి-గురు-శుక్ర-రాహువులు అశుభులుగాను, చంద్ర-కుజ-శని-కేతువులు శుభులుగాను, బుధుడు తటస్థుడుగాను ఉందురు. పుణ్యక్షేత్ర సంచారములు. పాత బకాయిలు వచ్చును. పాడి-పంట-చెఱువులు సామాన్యము. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సాఫీగా సాగును.
**అనుకూలతేదీలు : 2,5,6,9,11,12,13,16,18,19,22,23,25,29,30.**

**ఏప్రిల్ :** ఈ నెల రవి-బుధులు తటస్థులుగాను, చంద్ర-గురు-శుక్ర-శని-కేతువులు శుభులుగాను, కుజ-రాహువులు అశుభులుగాను ఉందురు. పనులన్నీ సాఫీగా సాగును. ప్రియవ్యక్తుల రాక ఆనందమును కలిగించును. మానసిక ప్రశాంతత. అందుబాటుకు ధనము వచ్చును. శుభకార్యములు.
**అనుకూలతేదీలు : 4,5,6,8,11,12,13,15,17,18,19,20,21,22,24,26,27,28,29.**





# 12. మీన రాశి ♓

పూర్వాభాద్ర-4వపాదము, ఉత్తరాభాద్ర-4పాదములు, రేవతి-4పాదములయందు పుట్టినవారు మరియు "ది,దు,శ్యం,ఝూ,థా,దే,దో,చా,చి" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "మీనరాశి"కి చెందినవారు.

| | | | |
|---|---|---|---|
| రాబడి - 5 | పోబడి - 5 | కీర్తి - 3 | అపకీర్తి - 1 |

ఈ రాశివారికి సంవత్సరాది నుండి... **గురుడు** ది. 12-10-2018 వరకు **8**వ ఇంట **తామ్రమూర్తి** గాను, పిమ్మట ది. 2-04-2019 వరకు **9**వ ఇంట **రజితమూర్తి** గాను, తదాది సంవత్సరాంతము వరకు **10**వ ఇంట **లోహమూర్తి** గాను, **శని** ఈ సంవత్సరమంతయూ **10**వ ఇంట **సువర్ణమూర్తి** గాను, ది. 5-03-2019 వరకు **రాహువు 5**వ ఇంట **కేతువు 11**వ ఇంట **తామ్రమూర్తులు** గా, తదాది సంవత్సరాంతము వరకు **రాహువు 4**వ ఇంట **కేతువు 10**వ ఇంట **లోహమూర్తులు** గాను సంచరించెదరు.

ఈ సంవత్సరము వీరికి ఆదాయ-వ్యయములు **సమముగా** ఉండును. సమాజములో **75**మంది అనుకూల ముగాను, **25**మంది ప్రతికూలముగాను ఉందురు. సంవత్సర ప్రథమార్ధము శారీరక-మానసిక-ఆర్థిక సమస్యలను అధిగమించవలసి ఉండును. స్వశరీర మరియు కుటుంబ సభ్యుల ఆరోగ్యము ఎడల శ్రద్ధ అవసరము. నేత్ర-ఉదర-గుప్త-మధుమేహ సమస్యలు పీడించును. సంవత్సర ఉత్తరార్ధము నుండి పనులు వేగవంతమగును. భూమి-గృహ నిర్మాణాది పనులను చేపడుదురు. దూర ప్రయాణములు ఫలించును. గతకాలపు సమస్యలు తగ్గుముఖం పట్టును. పుణ్యక్షేత్ర సందర్శనములు చేయుదురు. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములందు అభివృద్ధి ఉండును. సన్మాన-సత్కారములు. నూతన వస్తు-భూషణ-వాహన యోగములు. అవివాహితులకు-నిస్సంతులకు-నిరుద్యోగులకు యోగించును. ప్రచురణ కర్తలకు-గ్రంథకర్తలకు-ఉపాధ్యాయులకు గుర్తింపు. స్థిరాస్తుల కొనుగోలులు.

ఈ రాశి **స్త్రీలకు** ప్రథమార్ధము అంతగా బాగుండదు. ఉత్తరార్ధములో గతకాలపు సమస్యలు నివారణ అగును. సువర్ణ-వస్తు-భూషణ లాభములు.

**విద్యార్థులకు** ప్రథమార్ధము ఆశించిన ఫలితములు రావు. ఉత్తరార్ధము నుండి విద్యాభివృద్ధి కలుగును. దూరదేశ ప్రయాణములు చేయుదురు.

**ఉద్యోగులకు** శుభాశుభ మిశ్రమ ఫలితములు. ఉద్యోగములందు అధిక శ్రమ ఉన్ననూ ఇంక్రిమెంట్లు-ప్రమోషన్లు వచ్చే అవకాశములు ఉన్నవి.

**వ్యాపారులకు** సామాన్య కాలము. ప్లాస్టిక్ వస్తు వ్యాపారులకు, మిఠాయి దుకాణముల వారికి, పూజా సామాగ్రి విక్రయించువారికి, జల వ్యాపారులకు, బోట్లు నడుపుకునే వారికి, రైస్ మిల్లర్లకు, ధాన్యం వ్యాపారులకు, జ్యూయలరీ షాపుల వారికి, అపరాల వర్తకులకు, విదేశీ బ్రోకర్లకు అనుకూల కాలము.

**పూర్వాభాద్రా నక్షత్రజులకు** కోర్టు వివాదములు, ఆర్థిక-కుటుంబ సమ

